# సురవరం ప్రతాపరెడ్డి

## జీవితము - రచనలు

ముద్దసాని రామిరెడ్డి



ప్రచురణ :

ఆంధ్ర సారస్వత పరిషత్తు

తిలక్ రోడ్, హైదరాబాదు.

# సురవరం ప్రతాపరెడ్డి

## జీవితము - రచనలు



ముద్దసాని రామిరెడ్డి






ప్రచురణ :

ఆంధ్ర సారస్వత పరిషత్తు

తిలక్‌రోడ్, హైదరాబాదు.

# మనవి మాట

కవికి; తాత్త్వికుడికి, యోగీశ్వరునికి వారి స్వీయచరిత్రను రచించడం వాళ్ళకే చేతకాని పని యనియు, అందువల్లనే తానా పనికి సంకల్పించలేదని శ్రీ అరవిందులు ఒకానొక వ్యాసంలో ఉల్లేఖించియున్నారు. అందుకు ప్రబల కారణం వారు అంతర్ముఖులు కావడం వల్లనే! అలాంటప్పుడు తదితరులు పై మూడు తరగతులకు చెందిన మహానుభావుల జీవిత చరిత్రలను వ్రాయ సంకల్పించడం కొంతవరకు సాహస కార్యమే అవుతుంది. కవులు, రచయితలు దరిదాపు ఒకే కోవకు చెందిన వారగుట వలన, వాళ్ళ ప్రాపంచిక కార్యకలాపాలకన్న మిన్నయైనవీ, వారికి ప్రీతిపాత్రమైనవీ, వారి అంతర్ముఖ వికాస కార్యక్రమాలే కనుక, వారి మానసిక వికాసోన్ముఖ చేష్టలను పసికట్టి ఉన్న దున్నట్లు వాటికి అక్షరరూప మివ్వడం అంత సులభసాధ్యమైన పనికాదు.

ప్రజ్ఞాశాలియగు సురవరం ప్రతాపరెడ్డిగారి వ్యక్తిత్వానికి రూప కల్పనచేసి విజ్ఞులను మెప్పించడం నాలాంటి సామాన్యుడికి చేతకాని పనియే! పెద్దలందరి ప్రోత్సాహము, ఆదరము, అండదండలు లభించుట వలన నేనీ సాహస కార్యమునకు పూనుకొని కొంతమేరకు కృతకృత్యుడనైనా ననుకుంటున్నాను. లేకున్న నాబోటి నడుమువిరిగినవాడు, నడువలేనివాడు, శయ్యాతల్పగతుడైనవాడు, సురవరంలాంటి బహుముఖ ప్రజ్ఞాశాలి జీవితమును, రచనలను గురించి ఏమి వ్రాయగలడు?

నాకీ పుస్తక రచనలలో అన్ని విధాలా తోడ్పడి, అన్నలా ఆదరించిన డా॥ రామరాజుగారికి సర్వదా కృతజ్ఞుడను. సురవరంవారి పెద్దకుమారుడు; శ్రీ ఎస్. ఎన్. రెడ్డిగారి సహాయ సహకారము లేనిది నారచన ముందుకు సాగెడిదేకాదు. వారి తండ్రిగారి డైరీని, రచనలను నా కందించడమేగాక, బ్లాకులను కూడ తయారించి నాకర్పించిన వారి అవ్యాజానుబంధము మరువరానిది, మరువురానిది. వారికి నేను సదా ఋణగ్రస్తుడను. ఇకపోతే డా॥ కేతవరపు రామకోటిశాస్త్రిగారు తగు సలహాల నందించడమేగాక వారిచే రచింపబడిన "సాహితీ సమీక్షణము"ను నాకంపి, అందు సురవరంవారి కవితా

రీతులను సమీక్షిస్తూ వ్రాసిన వ్యాసమునుండి నన్ను విషయ సంగ్రహము చేయుట కంగీకరించిన శాస్త్రిగారి ఔదార్యమునకు సర్వదా కృతజ్ఞతా బద్ధుడను. వీరేగాక డా॥ సి. నారాయణరెడ్డిగారు, శ్రీ కేశవపంతుల నరసింహ శాస్త్రిగారు, శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు కూడ నాకు చేదోడు వాదోడుగా నుండి సహకరించారు. అందరి సహాయ సహకార మొక ఎత్తు, శ్రీ దేవులపల్లి రామానుజరావుగారి సహకార మొక ఎత్తు అనవలసి యున్నది. నా శ్రమకు పుస్తక రూపమిచ్చి, ఆంధ్ర సారస్వత పరిషత్తు పక్షాన ప్రచురించి నన్నాదుకున్నందుకు వారి కాజన్మాంతము ఋణపడి యున్నాను. దీనికితోడు రావుగారు చక్కని పీఠికను వ్రాసి, వారికి సురవరం వారితోగల స్నేహ బంధాన్ని నిరూపించుకున్నారు. నా రచనకు బహుమతిని ప్రసాదించడమేగాక దాని నచ్చువేయించుకొనుటకు గూడ 1,500/= రూపాయలు, అందించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ వారికి విశేషించి డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డిగారికి సదా కృతజ్ఞుడను.

*బుధజన విధేయుడు*

ముద్దసాని రామిరెడ్డి

# తొలిపలుకు

1948 సెప్టెంబరులో భారత ప్రభుత్వము జరిపిన పోలీసుచర్య ఫలితంగా ఆనాటి హైదరాబాదు ప్రజకు విముక్తి కలిగినది. ఈ పోలీసుచర్యకు పూర్వం నాలు గయిదు దశాబ్దాలు ఆనాటి రాష్ట్ర చరిత్రలో మిక్కిలి ముఖ్యమైనవి. ఈ కాలంలో హైదరాబాదు రాష్ట్రీయులను, విశేషించి తెలంగాణా ప్రాంతీయులను మేల్కొలిపిన వారిలో ముగ్గురిని మనము స్మరింపవలసి ఉంటుంది. ఆ ముగ్గురే 1 రాజాబహద్దుర్ వేంకటరామారెడ్డి, 2. మాడపాటి హనుమంత రావు పంతులు, 3. సురవరం ప్రతాపరెడ్డిగార్లు. ఈ ముగ్గురు పరస్పరం అత్యంత సన్నిహితులు గూడ.

స్వర్గీయ సురవరం ప్రతాపరెడ్డిగారు ఆనాడు తెలంగాణాను ప్రబుద్ధము గావించిన వారిలో ప్రముఖులుగా నిలిచినారు. సంఘసంస్కర్తగా, రాజకీయ నాయకుడుగా, పత్రికా సంపాదకుడుగా ఆయన ప్రజలలో జాగృతి కలిగించ డానికి, చేసినకృషి చరిత్రాత్మకమైనది, ఆయన కృషి యింత మాత్రానికే పరిమితంగాదు. ఆయన బహు గ్రంథరచయిత. కవి, కథకుడు, పరిశోధకుడు, నాటకకర్త, విమర్శకుడు, బహుభాషావేత్తయైన పండితుడు, ఇంతటి బహుముఖ ప్రజ్ఞకలిగిన మేధావి తెలుగువారిలో మరొకరు కనిపించరని చెప్పితే అతిశయోక్తి కాజాలదు. పైన పేర్కొనిన ముగ్గురికి ఆంధ్ర సారస్వత పరిషత్తుతో గాఢమైన సంబంధము ఉన్నది. పరిషత్తు స్థాపకులలో యీ ముగ్గురిని పేర్కొన వలసి ఉన్నది. ప్రతాపరెడ్డిగారు పరిషత్తు స్థాపకులేగాక రెండు పర్యాయాలు అధ్యక్షులుగాగూడ పనిచేసినారు అవసానం వరకు ఆయన ఆంధ్ర సారస్వత పరిషత్తులో అత్యంత సన్నిహితత్వము కలిగి ఉండిరి గూడ.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి 'ప్రతాపరెడ్డిగారి జీవితము-చరిత్ర' రచనకు రెండువేల రూపాయల బహుమతి 1972-73 సంవత్సరానికి ప్రకటించి నది. ఈ బహుమతి పోటీకివచ్చిన వ్రాతప్రతులలో రెండింటిని ఉత్తమమైనవిగా నిర్ణయించి, బహుమతి యిచ్చుట జరిగినది. ఈ రెండింటిలో శ్రీ ముద్దసాని రామిరెడ్డిగారు రచించిన యీ గ్రంథము ఒకటి. శ్రీముద్దసాని రామిరెడ్డిగారు

ఎం. ఏ. పట్టభద్రులు, 'చేయి దిరిగిన రచయిత' దురదృష్టవశాత్తు ప్రమాదానికి గురియై, తత్ఫలితంగా కదలలేని స్థితిలో ఉన్నారు. అయినప్పటికిని నిరంతరం గ్రంథావలోకనం వీరి దినచర్యగా నున్నది. రచనా వ్యాసంగము వీరి కాల క్షేపాలలో ముఖ్యమైనది.

శ్రీ రామిరెడ్డిగారు రచించిన యీ జీవితచరిత్ర ఆంధ్ర సారస్వత పరిషత్తు పక్షాన ప్రకటించ గలుగుతున్నందుకు చాల సంతోషిస్తున్నాము. ఈ గ్రంథ ప్రచురణ బాధ్యత ఆంధ్ర సారస్వత పరిషత్తుకు అప్పగించిన శ్రీ రామిరెడ్డిగారికి పరిషత్తు పక్షాన కృతజ్ఞతలు. శ్రీ రామిరెడ్డిగారు తమ విలువ గల కాలాన్ని యికముందుగూడ యిదే విధంగా సద్వినియోగం చేయగలరని ఆశిస్తున్నాను.

తెలుగు వారిని మేల్కొలిపిన వైతాళికులలో ఒకరైన సురవరం ప్రతాపరెడ్డిగారి జీవిత చరిత్రను ఆంధ్రావళి ఆదరించగలదని విశ్వసిస్తున్నాను.

దేవులపల్లి రామానుజరావు
ఉపాధ్యక్షుడు
ఆంధ్ర సారస్వత పరిషత్తు.

హైదరాబాదు
1-7-74

# విషయసూచిక

# ప్రస్తావన

అవిభక్త హైద్రాబాదు రాష్ట్రాన్ని అవిచ్ఛిన్నంగా సుమారు రెండు వందల పాతిక సంవత్సరాలు నిజాం షాహీ నవాబులు పాలించారు. వారి పరిపాలనా పరిధి తెలంగాణా ప్రాంతంతోబాటు మహారాష్ట్ర జిల్లాలు ఐదు, కర్ణాటక జిల్లాలు మూడింటికీ విస్తరించి యుంటెడిది. హైద్రాబాదు రాష్ట్రంపై కేంద్ర ప్రభుత్వం పోలీసుచర్య జరిపి తురక రజాకార్ల దౌష్ట్యాన్ని, దమన కాండను పరిసమాప్తం చేయువరకూ నిజాము నాజీల పరిపాలనా విధానం హిట్లర్, ముసోలినీల ఫాసిస్టు పద్ధతులనే తలదన్నిందనుటలో విప్రతి పత్తి యుండదు. నాటి హైద్రాబాదు రాష్ట్రాన్ని ఆర్థికంగా, సాంఘికంగా, రాజకీయంగా, వైజ్ఞానికంగా పొరుగు రాష్ట్రాల స్థితి గతులతో పోల్చిచూస్తె హస్తిమశకాంతర భేదముండెడిది. క్రీ. శ॥ 1930-40 సంవత్సరాల మధ్య హైద్రాబాదు పౌరుల అక్షరాస్యత ఐదు శాతము నధిగమించలేదు. జిల్లా కంతటికీ ఒకే ఒక ఉన్నతపాఠశాల ప్రభుత్వపక్షాన యుండెడిది. ప్రభుత్వోద్యోగులలో నూటికి 95 గురు ముస్లిములే నిండియుండిరి. తురకముతప్ప మరొకభాష ద్వారా విద్యాలయాలను నెలకొల్పి విద్యగరపుటకు వీలు లేకుండెడిది. 1942 సంవత్సరాంతం వరకూ తెలుగు ప్రజలు చదువుకొనుటకొక తెలుగు దినపత్రిక యైనా లేకుండెను. రాజకీయపు స్వాతంత్ర్యము మాటయటుంచి, పౌరులకు పౌర స్వత్వాలు కూడా ఊడిపోయిన చీకటి రోజులవి. నాటి హైద్రాబాదులో పార్టీల ప్రసక్తి లేదు, సంఘాల సంస్థాపన కవకాశంలేదు; సమావేశము లేర్పాటు చేయుట కనుమతిలేదు, సాంఘిక సంస్కరణల ఊసెత్తుటకే మగ్గూరు లేదు.

అటువంటి కసాయి నవాబుల పాలనా హయాంలో త్రిమూర్తులవలె

ముగ్గురు మహానుభావులు తెలంగాణకేగాక యావదాంధ్ర ప్రజానీకపు సముద్ధరణకు, సార్వత్రిక పురోభివృద్ధికి నిరాడంబరంగా, నిస్వార్థంగా, నిరవధికంగా పాటుపడిన వైతాళికులు. వారే మాడపాటి హనుమంతరావుగారు, రాజా బహద్దర్ వెంకట రామారెడ్డిగారు, సురవరం ప్రతాపరెడ్డి ప్రభృతులు. ఈ ముగ్గురు వ్యక్తులు ప్రజాభ్యుదయానికి అవలంబించిన పంథాలు, అనుసరించిన బాటలు, వేర్వేరుగా నున్నవి. వారి బాటలు వేరైనా గమ్యం ఒకటే! పంథాలు వేరైనా లక్ష్యం ఒకటే!! మాడపాటివారు రాజకీయ చైతన్య సూత్రధారులై, ఆంధ్రోద్యమ పితామహులై, నాయకమణియై, తెలుగన్నలను జాగృతంచేస్తే, రాజా బహద్దర్ వారు ప్రభుత్వోన్నతోద్యోగులై, కోత్వాలై, మతకల్లోలాల నరికట్టి, హిందూ మహమ్మదీయ సమైక్యతా సేతుబంధమై, విద్యాలయాల నిర్మించి, వసతిగృహాల నెలకొల్పి, బీదవిద్యార్థులకు ఉచిత అసన వసన సౌకర్యాదుల నొనగూర్చి, దాతయై, విద్యాదాతయై రాణించారు. ఇక సురవరం ప్రతాపరెడ్డిగారు పాత్రికేయుడై, నాయకుడై, సాహితీవేత్తయై, బహుగ్రంథకర్తయై "మూగవోయిన తెలంగాణ తొలి మూలుగై" యావదాంధ్ర ప్రజాళి జేజేలనందుకున్నారు. ఆ ముగ్గురు మూర్తులూ తెలుగుతల్లినోచుకున్న తొలి నోముల పంటలు, తెలుగుప్రజల భాగ్యదాతలు; కారణ జన్ములు. వారు తెలంగాణకు చేసిననేవ అగణితము, అనన్యసామాన్యము, అనితర సాధ్యము. ప్రతిఫలాపేక్షా రహితంగా, జీవితాంతము అవిశ్రాంతంగా ప్రజాళి సర్వతోముఖ వికాసానికి పాటుపడిన కర్మయోగులు.

సురవరం ప్రతాపరెడ్డిగారిలో నిబిడమైయున్న శక్తినీ, ధీశక్తినీ, ప్రప్రథమంగా పసిగట్టి పని కల్పించినది రాజాబహద్దర్ వెంకట రామారెడ్డిగారైతే, వారికి సముచితంగా సానబెట్టి వన్నెవాసి నొనగూర్చినవారు ఆంధ్ర పితామహులు, పద్మవిభూషణ బిరుదాంచితులునైన మాడపాటి హనుమంతరావు గారే! ప్రతాపరెడ్డిగారి యౌవన జీవనప్రాంగణంలో ప్రవేశించి, వారి కొక దారిని నిర్దేశించి, అడుగడుగునా అండదండలనిచ్చి ఆదుకొని, జీవిత

లక్ష్యానికి చేరునట్లు సహకరించినదియూ వీరిరువురు మహానుభావులే ! అందు వల్లనే కాబోలు ఈముగ్గురి హృదయాలూ స్ఫటికములై, మనసులు వెన్న ముద్దలై, మాటలు వరాలమూటలై, గమ్యాలు వెలుగుబాటలై రాజిల్లాయి. ప్రతాపరెడ్డిగారి జీవితాన్ని మలచుటలో వీరిద్దరిపాత్ర అద్వితీయమైనది. ఎంతటి జాతిరత్నమైనా స్వయం ప్రకాశితంకానట్లు, సానబెట్టినకొలదీ వన్నెల దేలునట్లు, రెడ్డిగారిని సానలదీర్చి ప్రకాశింపజేసి ప్రజానీకానికెత్తి చూపిన ఘనత మాడపాటివారికి మరియు కొత్వాల్‌గారికే దక్కుతుంది. రెడ్డిగారి జీవనరంగంలో వీరిరువురి పాత్ర ప్రస్ఫుటంగా కానవస్తుంది. అందుకే ప్రతాపరెడ్డిగారి వైయక్తిక జీవితంలోకూడ వీరలను వెనవేసు కున్న నిరాడంబరత, సత్యసంధత, సత్ప్రవర్తనలు బాగా అలుముకొని పోయినవి.

# *వంశ చరిత

ప్రతాపరెడ్డిగారి పుట్టు పూర్వములను తెలుపుటకు ముందు వారి వంశావళి చరిత్రను కొంత సంక్షిప్తంగా తెలిసికొనుట అప్రస్తుతము కాదు. సురవరం వారిది మోటాటి రెడ్డిశాఖ. 'సురవరము' అను ఇంటిపేరు వారి వంశానికి వర్తించుచున్నది. సుమారు వందసంవత్సరాల నుండిమాత్రమే ! అంతకు పూర్వం వారి ఇంటిపేరు "ఏమి రెడ్డివారు" అని యుండెడిది. మహబూబ్‌నగరం జిల్లాలోగల వట్టెం గ్రామంలోకూడ 'ఏమిరెడ్డి' వారు ఉన్నట్లు ధృవపడింది. వారిది కూడ ప్రతాపరెడ్డిగారి వంశీయుల గోత్రమగు "వట్టి నూళ్ళ" గోత్రమే ! "ఏమిరెడ్డి" యను గృహనామం, మొదలగు వారి వంశంలోపుట్టి కీర్తి ప్రతిష్ఠలనార్జించిన ఒకానొక ప్రముఖవ్యక్తి పేరై యుంటుందనుటకు అవకాశం కలదు. ఈనాడు వట్టెం గ్రామంలోను మరియు ఇటికేలపాడు లోను వ్యాపించియున్న ప్రతాపరెడ్డిగారి పూర్వికులు సుమారు 250 సంవత్సరాలక్రితం షోరాపూర్ ప్రాంతంనుండి బ్రతుకు దెరువుకొరకు వలసవచ్చి కొందరు వట్టెంలోను మరికొందరు ఇటికేలపాడు లోను స్థిరనివాస మేర్పరచు కొనియుందురు. షోరాపురంనుండి వలసవచ్చిన వారు కావుననే యీ వంశీయులకు సూరాపురం వారుగా వాడుకలోకి వచ్చి యుండవచ్చును. షోరాపురమను సంస్థానమును పూర్వం తెలుగువారు "సురపుర"మని వ్యవహరిస్తుండిరి. గుల్బర్గ జిల్లాలోగల యీ సురపుర మును పూర్వం కొంతకాలం బేండర్ (బోయ) జాతి రాజులు పాలించిన ఆధారములు కలవు. మహారాష్ట్రంలోగల షోలాపురం మరియు గుల్బర్గా

---

* ప్రతాపరెడ్డిగారి వంశచరిత్రను, బాల్య విద్యాభ్యాసాది వివరాలు రెడ్డిగారు స్వయంగా వ్రాసిపెట్టుకున్న "డైరీ" నుండి సేకరింపబడినవి.

లోనిదగు షోరాపూర్‌నకు గల నామసామ్యమును తొలగించడానికి గాను జనులు షోరాపూర్‌ను బేండర్ షోరాపూర్ అనియు వ్యవహరించుట కలదు. ప్రతాపరెడ్డిగారి వంశీయులు షోరాపూర్‌నుండి వచ్చినారు కనుక "సూరా పురం" వారు అని జనవాడుకలో పడి, క్రమంగా మాటనలిగి సురవరంగా మారి గృహనామంగా నిలిచిపోయింది. సురవరం వారి వంశీయులు మొదట శైవులుగానుండి రానురాను వైష్ణవమతానుయాయులైపోయారు.

ప్రతాపరెడ్డిగారి ముత్తాత పేరు అచ్చన్న. బహుశా ఇతని తండ్రిగారి కాలంలోనే షోరాపురంవదలి మహబూబ్‌నగరం వలసవచ్చి కొంతకాలం వట్టెంగ్రామంలో నివసించి, అనంతరం అచటినుండి కొందరు కృష్ణానదీతీర ప్రాంతమగు కొల్లాపురం సంస్థానపు గ్రామమైన పెద్దమరూరులో నిలిచి పోయినారు. ఆ కాలంలో భూములకు బందోబస్తుగాని, పట్టాలిచ్చు పద్ధతి గాని అమలులో నున్నట్లులేదు. సేద్యయోగ్యమగు భూమియావత్తూ ప్రభుత్వపరంగానే యుండెడిది. ప్రభుత్వం నుండి ప్రజలే తమ శక్తికొలది కౌలుకు లేదా గుత్తకు తీసుకుని, భూమిశిస్తు చెల్లిస్తూ పంటలుపండించేవారు. నాటి రైతాంగానికి ముఖ్యసంపద పశుసంపదయే. అచ్చన్న తండ్రిగారి హయాంలో పశుసంపద పుష్కలంగా ఉండేది. ఆయన పెద్దమరూరులో కొంతకాలం కాపురం చేసినట్లు వారు నివసించిన ఇంటి శిథిలాలు నేటికీ సాక్ష్యం చెబుతున్నవి. అచ్చన్నగారి కాలంలో పశుసంపద బాగా వెంపొంది నది. అచ్చన్న ఆజానుబాహుడు, బలశాలి మంచి ఈతగాడు కూడాను. అచ్చన్న అక్షరాస్యుడు, వ్రాత కోతలు నేర్చినవాడు. ఒకమారు అచ్చన్న గారి మందలోని ఆబోతును హరిజనులు మందుపెట్టి చంపి విందారగించా రట. ఆ సంగతి తెలుసుకున్న అచ్చన్న అరికాలిమంట నెత్తికెక్కింది. దోషులైన హరిజనుల నీడ్చికట్టి కణకణలాడు ఇనుపకడ్డితో ముడ్డిపైన వాతలు గుంజారట. మాలగూడెమంతా లబోదిబోమంటూ కొల్లాపురం రాజాగారికి మొరపెట్టుకున్నారట. రాజుగారు జవాన్లనంపి అచ్చన్నకు పకడ్ లావ్ అన్నారట. ఈ సంగతిని మునుముందే పసిగట్టిన అచ్చన్న ఆలుబిడ్డ

లతో, ఆలమందతో, అర్ధమరాత్రి లేచి కృష్ణానదిని దాటి ఇటికేలపాడులో తిష్ఠవేసి రాజాగారి పిడికిలినుండి తప్పించుకొని బయటపడినారట.

అచ్చన్నగారి అనంతరం సురవరం వారి వంశీయులలో చెప్పుకో దగిన వారు పాపిరెడ్డిగారే! వీరి వంశీయులకు ప్రభుత్వంవారు వతనునిచ్చింది ఎల్లారెడ్డిగారి కాలంలోనే. అచ్చన్న కుమారుడు పకీరురెడ్డి. అతని కుమారుడు ఎల్లారెడ్డి. ఎల్లారెడ్డి పుత్రరత్నమే ప్రఖ్యాతిగాంచిన పాపిరెడ్డి. పాపిరెడ్డిగారు శ్రీమంతులు, గర్భ శ్రీమంతులు కూడ! వీరికి నలుగురు పుత్రులు. వారి పేర్లు వరుసగా వెంకటరెడ్డి, నారాయణరెడ్డి, వెంగళరెడ్డి, రామకృష్ణారెడ్డి గారలు. పాపిరెడ్డిగారి అర్ధాంగి పేరు అచ్చమ్మ. అచ్చమ్మ అమావాస్యనాడు జన్మించింది. పాపిరెడ్డి పౌర్ణమినాడు పుట్టినాడు. కనుకనే జాతకరీత్యా వారిరు వురి జంట అపురూపమై అలరారింది. అచ్చమ్మ తల్లిగారు శ్రీమంతులు. ఆ కాలంలో వారి వంశీయులు గద్వాల సంస్థానాధీశులకే అప్పులిచ్చెడివారు. శ్రీమంతులింటి బిడ్డయగు అచ్చమ్మను పాపన్న కియ్యమని వియ్యాలవారు పితలాటకం పెడితె, పాపిరెడ్డి పక్షంవారు పంతానికిదిగి పట్టుబట్టి అచ్చమ్మతో పాపిరెడ్డి వివాహం జరిపించి తమ పంతం నెగ్గించుకున్నారట.

అచ్చమ్మ తమ్ములలో ఒకరు తిమ్మారెడ్డి. తిమ్మారెడ్డివద్ద డబ్బు రాబడుదామనే తలంపుతో గద్వాల రాజావారు తిమ్మారెడ్డికి కబురుపంపా రట. తిమ్మారెడ్డి ప్రభువుగారి పిలుపును ఖాతరుచేయక ఇటికేలపాడు చెక్కే శారట. రాజుగారి భటులు తిమ్మారెడ్డి ఇంట్లో లేనికారణాన వారికి బదులు వారి భార్యనే మేనాలో ఎక్కించుకుని చక్కా దేవిడీకి తీసుకుపోయారట. ఇంకేముంది! దినములు, వారములు గడచినా తిమ్మారెడ్డి అర్ధాంగి కొరకైనా గద్వాలకు వెళ్ళలేదు. ఇలా నెలలు గతించాయి; రాజుగారికి గుండెదడ ఎక్కువైంది. తిమ్మారెడ్డికి అభిమానం అధికమైంది!! రాజుముట్టిన స్త్రీని మళ్ళీ తనభార్యగా స్వీకరించజాలనని తిమ్మారెడ్డి కబురంపినాడు. రాజు ఖిన్నుడై, తిమ్మారెడ్డిగారిభార్య తన తల్లితో సమానమని తెలుపుకుంటూ రాజమర్యాదలతో తిమ్మారెడ్డిని దేవుడికి ఆహ్వానించి ''దంపతీ'' పూజచేసి పీతాంబరములనిచ్చి సగౌరవంగా సాగనంపినారట.

అచ్చమ్మ సోదరులు ధనవంతులేకాక అభిమాన ధనులు, శౌర్యధనులై వాసిగాంచినారు. వీరి వంశీయులలో నొకవీరుడు వాళ్ళగ్రామాన్ని పిండారీల దోపిడీనుండి కాపాడినందుకుగాను నేటికీ "వీర గుడ్డము"గా వెలసి గ్రామీణుల చేత వీరపూజ లందుకుంటున్నారు. ఇక పావిరెడ్డిగారిని గురించి తెలుసుకుందాము. పావిరెడ్డిగారికి మాతృభాషలో చక్కని ప్రవేశము ఉండెడిది. పావిరెడ్డిగారు వ్యవహారదక్షులై ధనధాన్య భూవసతుల సముపార్జించారు. ధనధాన్యములు, పాడిపంటలు, పిల్లాపాపలతో పావిరెడ్డిగారిల్లు కలకలలాడుతుండేది. వారి గృహంలో పాడి పుష్కలంగా ఉండుటచేత గ్రామీణులకు, గర్భిణీ స్త్రీలకు, బాలింతలకు పాలు, పెరుగు, వెన్న ఉచితంగా లభ్యమవుతూ ఉండేది. ఇంటగెలచిన పావిరెడ్డిగారికి తనగ్రామంలోనేగాక చుట్టు పదిగ్రామాల్లో మంచి పలుకుబడి యుండెడిది. కాపుకులంలో చెలరేగు తగాదాల పరిష్కారం పావిరెడ్డి లేనిమినహా జరిగెడిదికాదు. ఒకమారు గద్వాల ఇలాకా వల్లూరుగ్రామపు కాపువారిపై అకారణంగా వారి బంధువులు కులతప్పు విధించారు. దాని పరిష్కారంకొరకు ఇరువాగుల వారు వనపర్తి రాణియగు శంకరమ్మగారి వద్దకుపోయి తగాదా పరిష్కారం చేయమన్నారట. రాణిగారి సమక్షంలో తగాదా పెట్టిన ఇంటివారి కూతురును వల్లూరు గ్రామపు కాపువారి వరుడికిచ్చి నెయ్యం చేసుకొనుటకు సూత్రరీత్యా అంగీకరింపబడింది. కాని పావిరెడ్డిగారి ఆధ్వర్యంలో వివాహముజరిగి వారిచేత అక్షింతలు వధూవరులపై పడుతేనే, నెయ్యము నేస్తంగా ధృవపడుతుందని పలువురు అభిప్రాయ పడుటచేత, శంకరమ్మగారు పావిరెడ్డికి కబురంపి పిలిపించారు. పావిరెడ్డికి బలవంతపు బ్రాహ్మణార్థం ఇష్టంలేదు. అందుకే అతడు వైవాహిక సంప్రాదాయమునకు విరుద్ధంగా రెండు పిడికిళ్ళతో అక్షింతలుతీసుకుని సేసపెట్టునపుడు చేతులు వ్యత్యాసముచేసి వధూవరులపై చల్లినారట. పావిరెడ్డి గారికీ వియ్యము నచ్చలేదని మగపెళ్ళివారు పెళ్ళిపీటల నుండి లేచిపోయారట. రాణిగారు రెడ్డిగారి అసాంప్రదాయిక కృత్యమునకు కారణం అడిగితే, "దొరసాని గారూ! మీరు రాణులై ప్రజలను పాలించ వచ్చుగాని, వారి మత సంప్ర

దాయాల్లో జోక్యంకలిగించుకొనుట భావ్యంకాదని'' ఉటంకించారట. పాపిరెడ్డి గారి పలుకుబడి మచ్చుతునకగా పైనతెలిపిన ఉదంతం చాలు.

పాపిరెడ్డిగారి విద్యాగురువులు, తక్కశీల సంజీవయ్యగారను నొక బ్రాహ్మణుడు. శూద్రునికి విద్యాదానం చేయరాదని తోడిబ్రాహ్మలు సంజీవయ్యను బెదిరించినా వారు లెక్కచేయలేదు. పాపిరెడ్డిగారి సంభాషణధ్వని ప్రధానంగాఉంటూ వ్యంగ్య ధోరణిలో సాగెడిదట. రాజా బహద్దర్ వెంకట రామారెడ్డిగారు చిన్నతనములో వారి మేనమామయగు విలియమ్ వాహబ్ (వారి అసలుపేరు, శాయిరెడ్డి) గారిఇంట్లో పాపిరెడ్డిగారిని చూచియున్నట్లు ప్రతాపరెడ్డిగారికి తరచూ అతని స్వరూప స్వభావాదులను, గుణగణాదులను గూర్చి చెబుతుండేవారట. పాపిరెడ్డిగారు చనిపోయిన నెలరోజుల లోనే మన కథానాయకుడగు ప్రతాపరెడ్డిగారు జన్మించడం వలన, వీరి ప్రథమనామం పాపిరెడ్డిగానే పెద్దలు నిర్ణయించారు.

పాపిరెడ్డిగారికి నలుగురు కొడుకులని మొదటనే తెలుపబడింది. నలుగురు పుత్రులకు తోడుగా ముగ్గురు బిడ్డలుకూడా జన్మించారు. వారి పేర్లు పెదపాపమ్మ, చినపాపమ్మ మరియు చిన్నమ్మ. పాపిరెడ్డిగారి వంశ వృక్షం శాఖోపశాఖలుగా వర్ధిల్లి వ్యాపించినది. పాపిరెడ్డిగారి నలుగురు కుమారులు పురుషార్థులు, లౌకికులు, వ్యవహారదక్షులై రాణించి తండ్రిగారి ఆర్జితాన్ని ఇబ్బడిముబ్బడి గావించారు. అన్నదమ్ములు నలుగురూ ఒకరినిమించిన విద్యావేత్తలు మరొకరు కావడంవలన వారి కీర్తిప్రతిష్ఠలు ఆలంపురం తాలుకాలోనేగాక కర్నూలు జిల్లావరకు కూడ విస్తరించినది. సురపురం వంశీయులకు ఆయుర్వేదమునందు మంచి అభినివేశము, ప్రవేశము కలదు. ఆయుర్వేదవిద్య వీరికి వంశపారంపర్యంగా లభించినసొత్తు. ముఖ్యంగా వెంకట రెడ్డి, నారాయణరెడ్డి మరియు రామకృష్ణారెడ్డి గారలకు చక్కని ఆయుర్వేద వైద్యంలో ప్రవేశం ఉండెడిది. వెంకటరెడ్డిగారి కుమారుడగు రంగారెడ్డిగారికీ మరియు వారికొడుకుకూడ డాక్టర్‌పట్టా పుచ్చుకున్నవారే: ఇక ప్రతాపరెడ్డిగారి విషయం చెప్పనే పనిలేదు. వీరికి ఆయుర్వేద విద్యాచార్యుడగు శ్రీమాన్

వేదాల రామానుజస్వామి గారి స్నేహము కూడ లభ్యమగుటవలన బంగా రమునకు తావియబ్బినట్లైనది. పిల్లలపాటల యందుండు ఆయుర్వేద రహ స్యముల నెన్నింటినో పత్రికాముఖమున ప్రకటించిరి.

పాపిరెడ్డిగారి వంశవృక్షముయొక్క శాఖోపశాఖలను తెలిసికొందము. పెద్దకుమారుడగు వెంకటరెడ్డిగారికి నలుగురు సంతానము. వారు రంగారెడ్డి, సంజీవరెడ్డి, రాఘవరెడ్డి, మరియు బుచ్చమ్మగారలు. రెండవ కుమారుడగు నారాయణరెడ్డి గారికి ఎనమండుగురు సంతానము. అందు పురుషులు వరు సగా ప్రతాపరెడ్డి (పాపిరెడ్డి), గోపాలరెడ్డి, లోకనాథరెడ్డి, కృష్ణారెడ్డి, రామ చంద్రారెడ్డి మరియు వెంకట్రామా రెడ్డిగారలు. వీరిలో గోపాలరెడ్డి, లోక నాథరెడ్డి మరియు కృష్ణారెడ్డిగారలు అకాలమృత్యు వాతబడ్డారు. నారాయణ రెడిగారికి కలిగిన సంతానంలో ఎవ్వరూ దక్కలేదు. ఇక మూడవ వారగు వెంగళరెడ్డిగారికి కలిగిన ఆరుగురు సంతానంలో నారసింహారెడ్డి, శ్రీనివాసరెడ్డి మరియు జానమ్మగారలే జీవించి యున్నారు. ఇక రామకృష్ణా రెడ్డి గారికి ఇద్దరు భార్యలవల్ల కలిగిన ఏడుగురు సంతానం వరుసగా లక్ష్మీ కాంతరెడ్డి, మాణిక్యమ్మ, వెంకటరామమ్మ, సీతమ్మ, జానకమ్మ, రామ లక్ష్మి మరియు శారదమ్మ కలరు.

సురవరం ప్రతాపరెడ్డిగారి తండ్రియగు నారాయణరెడ్డిగారికి మొదటి భార్యవలన ఒక ఆడబిడ్డ కలిగి పదకొండు సంవత్సరాలు జీవించి మృత్యు వాత బడ్డది. ఒక్కగానొక్క బిడ్డ అకాలమృత్యువు పాలైనందుకు వగచి వగచి సంవత్సరంలోగానే తల్లికూడ మరణించింది. అందుచేత నారాయణ రెడ్డిగారు బోరవెల్లి గ్రామపు ఆడపడచగు రంగమ్మను వివాహం చేసుకుని మామగారింట్లోనే పదిసంవత్సరాలు తనతండ్రిగారితో వ్యవహార విషయంలో పేచీపడిన కారణంగా ఉండిపోవలసి వచ్చింది. నారాయణరెడ్డిగారు పల్లెపాడు గ్రామంలో ఉంటూ ఆహారధాన్యముల క్రయ విక్రయ వ్యాపారం సాగిస్తూ డబ్బుగడించి, చండూరు గ్రామంలో 250 ఎకరాల భూవసతి నార్జించి, పదిహేనువేలు వెచ్చించి ఇటికేలపాడులో శివకేశవాలయాన్ని నిర్మించి, ఊర

జావికి దిగుడుమెట్లు కట్టించి, దైవార్చనకై కొంతపొలమును దేవాలయానికి అర్పణచేసి శాశ్వతకీర్తి నార్జించారు. తండ్రిగారిలో గల దైవభక్తిని, వినయ విధేయతలను ప్రతాపరెడ్డిగారు పుణికి పుచ్చుకున్నారు.

ఇక చిన్న కుమారుడగు రామకృష్ణారెడ్డిగారు అన్నలందరిలో తల మానికం లాంటివారు. వ్యవహారదక్షతలో, వ్యాపారనైపుణ్యంలో విద్యా వినయ సంపన్నతలో, దాతృత్వ గుణంలో అందెవేసిన హస్తము. నారా యణరెడ్డిగారు కర్నూలులో కరీదుచేసిన రెండుగృహాలలో రామకృష్ణారెడ్డి గారు మొదట ధాన్యపు దళారీవ్యాపారమును ప్రారంభించారు. అనంతరం వారి వ్యాపారపరిధి వెండి బంగారు క్రయవిక్రయానికి విస్తరించి వేనవేలు ఆర్జించారు. పాపిరెడ్డిగారి పుత్రులలో రామకృష్ణారెడ్డి గారొక విశిష్ట వ్యక్తి. వారు ఉర్దు, సంస్కృతాంధ్ర భాషలందు మంచి ప్రావీణ్యమును గడించిన విద్వాంసులు. విద్వాంసుల సహవాసము, కవి పండితుల గోష్ఠులు, దాన ధర్మాలు, బంధుజన సత్కారాలు, దీనజనుల పోషణయే వారి నిత్యకృత్య ములు. ఆయన స్వపర భేదభావం లేకుండా తన అన్నదమ్ముల పుత్రులంద రినీ చేరదీసి, విద్యాబుద్ధులు నేర్పించిన వితరణశీలి. తనకొరకు గాని, తన సంతానం కొరకుగాని, చిల్లిగవ్వ యైనను కూడబెట్టని సదమలహృదయుడు. వారు ఒక సంస్కృత విద్యాలయాన్ని కర్నూలులో నెలకొల్పి నిర్వహించిన ఆర్ష విద్యాభిమాని. వారి సంఘసేవకు తార్కాణముగా కర్నూలు పట్టణ మున్సిపాలిటీ సభ్యుడై నగర పారిశుద్ధ్య కార్యక్రమాలు నిర్వహించడంలో చేదోడువాదోడుగా నుండిరి. వారి స్వహస్తాలతో రెండు లక్షలకుపైగా విద్వాంసులకు, అర్థిజనులకు దానధర్మాలు చేసినారు. వారినుండి మూడు నాలుగు లక్షలకుపైగా అప్పుగా స్వీకరించిన మహానుభావులు ఎగనామం పెట్టినారట. ఇకపోతె తాను రాజజీవిగా ఉంటూ బంధుజనులకు వారి పిల్లల విద్యాభ్యాసానికి మరొక మూడునాలుగు లక్షలు వ్యయం చేశారట. రెడ్డిగారు వ్యవహార దక్షుడుగా ఖ్యాతిగాంచుట వలన ఎందరో వ్యక్తులు వారి తగవుల పరిష్కారం వీరిచేత చేయించుకొనెడివారు. అలా ఐదారు వందల పంచాయి

తీలను పరిష్కారంచేసి కోర్టుపాలు కాకుండా కక్షిదారులను వ్యయప్రయాసలనుండి తప్పించారు. సామాన్య కాపుకుటుంబములో అంతటి విశాలహృదయుడు, దాతృత్వ స్వభావం గలవాడు, బ్రాహ్మణ పక్షపాతి పుట్టడం అరుదని స్వయాన ప్రతాపరెడ్డిగారే పలుసార్లు వారి గుణగణాలను ప్రస్తుతించెడివారు.

రామకృష్ణారెడ్డిగారి ఔదార్యమును, దయార్ద్రహృదయమును సాకుగా గొని వారి అవసానకాలంలో అన్నల కుమారులు ఎవరికి వారుగా వ్యవహరించి వంశమర్యాదకు, గౌరవానికి కొంత న్యూనతను ఆపాదించినారట. అలా చేయడంవలన సిరిసంపదలతో తులతూగుతున్న సంసారం అంతిమ దశలో అప్పులపాలై చితికిపోయింది. శ్రీ నారాయణరెడ్డిగారు తమ 36 వ, ఏట అనగా 1912 సం॥లో పరమపదించినారు. వెంకటరెడ్డిగారు 72 సంవత్సరాల పండు వయస్సులో 1915 సం॥లో స్వర్గస్థులైనారు. వెంగళరెడ్డిగారు 1918 సం॥లో కన్నుమూశారు. రామకృష్ణారెడ్డిగారు అరువై వసంతాలు నిండీనిండకుండానే 1932 సం॥లో కార్తిక శుక్ల ఏకాదశీ శుభ దివసమున దివంగతులైనారు. రామకృష్ణారెడ్డిగారు బ్రతికినన్నాండ్లు రాజఠీవితో జీవించి అంతిమ ఉచ్ఛ్వాస నిశ్శ్వాసలను పరమయోగి పుంగవుడిలా వదిలారు. ఇటీ కేలపాడునుండి భోజనంచేసి స్టేషనుకు వెళుతుండగా దారిలోగల చిన్నరాయి కాలికి తగులుటవలన నేలపైబడి వెంటనే మరణించిన మహనీయుడు. వారు పరస్త్రీలను మాతలట్లు భావించెడివారు. అంతటి సమున్నత గుణోపేతుడు మరణించినాక, సమిష్టి కుటుంబ బాధ్యతలను చేబట్టి ఎవ్వరూ నిర్వహించలేక తగవులాటకుదిగి కుటుంబ కలహాలను శృతిమించి రాగానపడేలా చేయడంవలన, వారి కుటుంబ వ్యవహారములను పరిష్కరించడానికి కొండా వెంకట రంగారెడ్డిగారు మధ్యవర్తులై నిలువవలసి వచ్చింది. అలా పాపిరెడ్డిగారి మనుమలు స్థిరచరాస్తులను పెద్దల సమక్షంలో పంచుకొని ఇంటిగుట్టును రచ్చకీడ్చి పదుగురిలో పలుచనైపోయారు.

# బాల్యము - విద్యాభ్యాసము

సురవరం ప్రతాపరెడ్డిగారు దుర్ముఖినామ సంవత్సర అధిక జ్యేష్ఠ మాస బహుళపాడ్యమికి సరియగు 1896 మే నెల 28 తేదిన బోరవెల్లి గ్రామంలో మాతామహుల గృహంలో జన్మించారు. జన్మించిన దాదిగా ఏడు సంవత్సరాలవరకు రెడ్డిగారు బోరవెల్లిలోనే నివసించారు. బోరవెల్లి గ్రామం మొదట గద్వాల సంస్థానానికి రాజధానిగా యుండేది. హైద్రాబాదు ప్రభుత్వ పతనానంతరం, గద్వాల మహబూబ్‌నగరం జిల్లాలో ఒక తాలుకాగా పరిగణింపబడ్డది. ప్రతాపరెడ్డిగారి మొదటి గురువు వారి తండ్రిగారే! అక్షరాభ్యాసం చేయించి, ఎక్కాలు వల్లెవేయించి, పెద్దబాలశిక్షనుకూడ పరిసమాప్తము చేయించారు. నారాయణరెడ్డిగారికి అక్షర రమ్యతపై అనురాగము అమితంగా ఉండుటవలన తనకుమారుడిచేత కుదిరించే అక్షరాలు వ్రాయించెడివారు. అక్షరాలను కుదిరించి పొంకంగా వ్రాయించడము, పుస్తకాలను చినగకుండా, నలగకుండా కాపాడటములాంటి సదభ్యాసాలను నేర్పినది తండ్రిగారేనని ప్రతాపరెడ్డిగారు అంగీకరించేవారు. రెడ్డిగారికి ఎక్కాలను అప్పుజెప్పడమొక సమస్యగా పరిణమించెడిది. ఒకమారు ఎక్కాలనుతప్పుగా వల్లిస్తే నారాయణరెడ్డిగారు మండిపడి కుమారుడిని చెవులుపిండి అమాంతం వాకిట్లోకి గిరాటు వేశారట. పాపం! ఆ బాల పాపన్న అవస్థను చూడలేక అక్కడఉన్న ఒక సాహెబు రెడ్డిగారిని తన ఇంటికి తోడ్కొనిపోయి తన కుమారులతో ఆడుకొనమని అన్నాడట. సాయెబుపిల్లలు కూడ ప్రతాపరెడ్డి యీడువారే కావడంవలన వారితో ఆనాడు కుదిరిన స్నేహం అనంతరకాలం కూడ పరిణతి పొందినది.

నారాయణరెడ్డిగారి స్నేహితుడూ మరియు కృష్ణారెడ్డిపేట మక్తే

దారైన శ్రీ హెన్రీ వాహబు అనువారు దివ్యజ్ఞాన సమాజం సభ్యులగుటచేత తెలుగులో ముద్రితమైన "సనాతనధర్మ ప్రశ్నోత్తర మాలిక" అను చిన్న పుస్తకాన్ని తెచ్చి ప్రతాపరెడ్డిగారికిచ్చి, దానినొక ఉపాధ్యాయుని సహాయంతో కంఠపాఠం చేయించారు. కొన్నిరోజుల తర్వాత రెడ్డిగారు ఏతత్ పుస్తకాంశాలను హెన్రీ వాహబ్‌గారి సమక్షంలో ఆసాంతం వెళ్ళ గ్రక్కినారట. ఆ దెబ్బతో వాహబ్‌గారు చిత్తైపోయి రెడ్డిగారిని తన ఇంటికి తీసుకొనిపోయి వారం పది రోజులుంచుకొని చక్కని ఆతిథ్య మిచ్చినారట. రెడ్డిగారికి ఇంగ్లీషు భాషాధ్యయనం బోరవెల్లిగ్రామంలో ఉండగనే ప్రారంభింపబడింది ఇటికేలపాడు గ్రామంలో వెంకటరెడ్డిగారి కుమారుడగు రంగారెడ్డిగారికి నాగేశ్వరరావు అనువారు అప్పట్లో ఆంగ్లం బోధిస్తూ ఉండేవారు. అతడే వారానికొక తడవ బోరవెల్లికికూడ పోయి ప్రతాపరెడ్డిగారికి ఆంగ్లంబోధిస్తూ ఉండేవారు. అనంతరం కొంతకాలానికి నారాయణరెడ్డిగారు కుటుంబసమేతంగా ఇటికేలపాడు వచ్చేసినారు. అనంతరం ఒక సంవత్సరంపాటు రమణయ్య అనువారు రెడ్డిగారికి ఆంగ్లభాషాధ్యయనం చేయించారు.

1904 సం॥లో ప్రతాపరెడ్డిగారిని కర్నూలుకు రామకృష్ణారెడ్డిగారు తీసుకపోయి ఏ.బి.యమ్. మిషనరీ పాఠశాలలో నాల్గవతరగతిలో చేర్పించారు. రఘురామయ్య అను మాస్టరుగారిని ప్రతాపరెడ్డిగారికి ప్రయివేటు చెప్పడానికి ఏర్పాటు చేయబడింది. రఘురామయ్య మాస్టారు గారొక కర్కోటకుడు. శిష్యులను శిక్షించుటయేగాని శిక్షగరిపిన పాపాన పోలేదు. దండతాడనంతో దశగుణాలు శిష్యులకలవడుతాయనే దృఢ విశ్వాసం రఘురామయ్యగారికి ఉండెడిది. వారి దండము ధాటి కోర్వజాలక రెడ్డిగారికి చిన్ననాటినుండి విద్యపై వెగటుకలగడం ప్రారంభమైనది. విద్యార్థిగా నున్నంతకాలం విద్యపై తమకు వైముఖ్యము తొలగలేదని రెడ్డిగారు ప్రవచించెడివారు. అందువల్లనే వీలుకలిగినప్పుడల్లా బడి కెగనామంపెట్టి రెడ్డిగారు గొట్టికాయలాటలో నిమగ్నులయ్యెడివారు. అలా గొట్టికాయలాటకు మరిగిన జట్టులో రెడ్డిగారొక సభ్యులు, దానికి నాయకుడు చెన్నారెడ్డియను యువకుడు ఉండెడివారు.

రఘురామయ్య ఎంతవిరసుడో చెన్నారెడ్డి అంత సరసుడట. చెన్నారెడ్డి చదువు సంధ్యలను చంకనబెట్టి, చక్కని శేర్వానీలు పైజామాలతో ముస్తాబై రూమీటోపీలు, చమ్కీబూట్లు ధరించి, తేనీరు కేక్ పేస్ట్రీలతో జల్సా చేసు కుంటూ, గానాబజానాలతో కాలక్షేపం చేసెడివారు. చెన్నారెడ్డిగారు ప్రతాప రెడ్డిగారికి మంచిమంచి దుస్తులు వేయించెడివారుట. చెన్నారెడ్డి నాయకత్వం లోని జట్టు ప్రొద్దంతా మామిడితోపుల్లో గొట్టికాయలాడుతూ రాత్రులన్నీ గానా బజానాలతో కరిగించెడివారట. కాని ప్రతాపరెడ్డిగారి స్నేహంమాత్రం గొట్టికాయలాటవరకే పరిమితమై యుండెడిదట. ఒకమారు రెడ్డిగారు గొట్టి కాయలాటల మోజులోపడి తన షేర్వానీని విక్రయించినారట. దానితో రెడ్డి గారి గొట్టికాయలాట కట్టుబడిపోయింది. రఘురామయ్యగారు షేర్వానీ విక్రయపు ఉదంతాన్ని రామకృష్ణారెడ్డిగారి చెవిలోవేశారు. ప్రతాపరెడ్డిగారికి దేహశుద్ధి జరిగింది. నాటినుండి చెన్నారెడ్డిగారి స్నేహానికి స్వస్తిచెప్పబడింది.

ఆరోజుల్లో నాల్గవతరగతికి కూడ పబ్లిక్‌పరీక్షలుండేవి. నాల్గవతరగతి పరీక్షలను స్పెషల్‌గ్రేడ్ పరీక్షలనేడివారు. రెడ్డిగారా పరీక్షలో కూర్చుని లెక్కల్లో బోల్తాకొట్టి మళ్ళీ ఒక సంవత్సరం పాతచదువే చదివినారు. 1906 సం॥లో ఫస్టుఫారంలో ప్రవేశించారు. అప్పట్లో నరసయ్యగారను నాతడు ఆ మిషన్ స్కూలుకు ప్రధానోపాధ్యాయుడుగా ఉండేవారు. వారు చాల మంచివ్యక్తి. సాత్వికులు, ఋషితుల్యుడు. వారి సాత్వికతను సాకుగా తీసుకుని రెడ్డిగారు మరికొందరు విద్యార్థులు విద్యాలయంలో పోకిరిచేష్టలు చేస్తూ, ఉపాధ్యాయుల నేడ్పించుకుతినేడివారు. తరచుగా బైబిల్ బోధకుడు డ్రిల్ టీచరు, డ్రాయింగ్ మ్యాస్టారు, సంస్కృతాధ్యాపకుడు వీరి చిలిపి చేష్టలకు గురియవుతుండేవారు. ఫస్టుఫారమ్‌లో చదువుతున్నప్పుడే ప్రతాపరెడ్డి గారిని బలవంతాన కృష్ణమాచార్యులను సంస్కృతాధ్యాపకుడు యీడ్చుకొని పోయి తన సంస్కృత తరగతిలో చేర్పించారట. రెడ్డిగారి సంస్కృతాధ్యయ నానికి అదే నాంది. ఆ విషయాన్ని ముందుగానే రామకృష్ణారెడ్డిగారికి తెలియ జేసి వారి అనుమతికూడ సంపాదించారట— కృష్ణమాచార్యులుగారు. అందు

వలన ప్రతాపరెడ్డిగారికి సంస్కృతాధ్యయనం తప్పనిసరియైనది. రెడ్డిగారు తొమ్మిదవ తరగతిలోనుండగా ప్రఖ్యాత సంస్కృత విద్వాంసులగు వెల్లాల శంకర శాస్త్రిగారు సంస్కృతాధ్యాపకులైనారు. శంకర శాస్త్రిగారే రెడ్డిగారికి రఘువంశము, కుమార సంభవము, భారతచంపు (ప్రథమ ద్వితీయ సర్గలు) కిరాతార్జునీయము (ఆదిసర్గ) లఘుకౌముది ఆదిగా గల సంస్కృత గ్రంథాలను వల్లెవేయించారు.

రెడ్డిగారు తొమ్మిదవ తరగతిలో నుండగా ఒక సంఘటన జరిగింది. గణిత శాస్త్రాధ్యాపకులగు శ్రీ పలన్వేలు రెడ్డిగారికి ఒకలెక్క నిచ్చి చెయ్యమన్నారట. దానిని సక్రమంగా చేయలేకపోయారు మన రెడ్డిగారు. పలన్వేలుగారు కుపితులై రెడ్డిగారిని క్లాసు పిల్లల ముందే వంగబెట్టి నాలుగు ముష్టిఘాతముల నిచ్చారట. దానితో రెడ్డిగారి అభిమానము దెబ్బతిన్నది. తిన్నగా మిషన్ స్కూలు వదలి మున్సిపల్ హైస్కూలులో చేరిపోయారు. 1912 సం॥లో రెడ్డిగారు స్కూలుఫైనల్ పరీక్షలో కూర్చున్నారు. కాని ఆయేడు లెక్కల్లో పడిపోయిన కారణాన 1913 సం॥లో మళ్ళీ పరీక్షకు కూర్చొని ఉత్తీర్ణులైనారు. రెడ్డిగారి ప్రవర్తనను గూర్చి వారి పాఠశాల ప్రధానోపాధ్యాయులగు శ్రీనివాసమూర్తిగారు ఇలా వ్రాశారు. "Mrs. Pratap Reddy is honest, straightforward, intelligent, but not industrious."

ప్రతాపరెడ్డిగారికి చిన్ననాటినుండి కసరతుపై మోజు ఉండెడిది. స్కూలు ఫైనల్ చదువునంతవరకు రెడ్డిగారు దేహదార్ఢ్యం కొరకు కసరతు చేస్తూ, స్వీయ బలప్రదర్శన ప్రయోగాలతో తోడి విద్యార్థులపై ముష్టిఘాతాలకు దిగుతూ వారిని బాధించెడివారట. రామకృష్ణారెడ్డిగారింట్లో ఉండి విద్యనభ్యసిస్తుండే పదిమందివిద్యార్థులకు ప్రతాపరెడ్డిగారే నాయకుడు. తనమాట పెడచెవినిపెట్టు యువకులను రెడ్డిగారు ముష్టి గుద్దులకు బలిచేస్తూ బాధించెడివారుట. రెడ్డిగారి పిడిగుద్దులకు ఎరయైన వారంతాకలసి ఒకనాడు రామకృష్ణారెడ్డిగారికి తెలియజేసి రెడ్డిగారికి వషట్కారములు పెట్టించారు. కర్నూలులో విద్య ముగియువరకు రెడ్డిగారు రామకృష్ణారెడ్డిగారి అజమాయిషిలోనే

పెరిగినారు. స్కూలు ఫైనలు పాసయ్యేవరకు రెడ్డిగారు ప్రతినిత్యము రాత్రి భోజనానంతరము ప్రైవేటు మాస్టారువద్ద చదువుకొని అక్కడే కటికనేలపై చాపమీదపడుకొని, ఉదయమేలేచి కాలకృత్యములు తీర్చుకొని ఉదయం తొమ్మిది గంటలవరకు అక్కడే చదువుకొని అనంతరం ఇంటికివచ్చి స్నానం భోజనం ముగించుకుని బడికిపోవడం, మళ్ళీ బడినుండి తిరిగివచ్చి భోజనానంతరం మాస్టారింటికి పోవడం ఇదే ప్రతిదినం పాటించు దినచర్య. రెడ్డిగారు కర్నూలులో ఉన్నంత కాలం, సంవత్సరానికి నాలుగు అంగీలు, రెండు కోట్లు, ఒక చెప్పుల జత, మరియు మత్స్యగంధి మార్కుగలవి రూపాయన్నర విలువచేసేవి రెండు ధోతుల జతలతోనే కాలక్షేపం చేశారు. 1913 సం॥లో స్కూల్ ఫైనల్‌లో ఉత్తీర్ణులైనాక, చదువు చాలిద్దామనే ఉద్దేశంతో రెడ్డిగారు పెద్దనాయన గారిని సంప్రతించారు. వారు సరే ననడమే కాక రెడ్డిగారి ఆశయము అను అనలానికి ప్రోత్సాహమను ఆజ్యాన్ని పోసి జాజ్వల్యమానం చేశారట. అనంతరం రెడ్డిగారు తమ చిన్నాయన గారగు రామకృష్ణారెడ్డిగారిని సంప్రతించారట. రామకృష్ణారెడ్డిగారు ప్రతాపరెడ్డిని ఎగాదిగా పరికించి, "నీవు చదువుచాలించి ఏం చేస్తావు? తండ్రిలేని పిల్లడి చదువు చాలించాడన్న అపకీర్తిని నాపై రుద్దడానికి సంకల్పించావా? నీవు చదువు చాలించడానికి వీలులేదు. నిన్ను చదివించి తీరుతాను!!" అని గర్జించారట. అలా అన్న రెండవనాడే రామకృష్ణారెడ్డిగారు రెడ్డిగారిని తీసుకొని హైద్రాబాదు ప్రయాణమైనారు. ప్రతాపరెడ్డిగారి జీవితంలో హైద్రాబాదు ప్రయాణం రెండవ సంఘటన. మొదటిసారి, అంటె రెడ్డిగారు స్కూలు ఫైనల్‌లో ఉండగా వారి తలిదండ్రులు మరియు తమ్ముడగు కృష్ణారెడ్డి సమేతంగా తిరుపతి దేవుడి మొక్కుబడి చెల్లించడానికిగాను రెండవ తరగతి కంపార్టుమెంటును రిజర్వుచేయించుకుని రైలుప్రయాణం సాగించాడు. తన వెంట తండ్రిగారు ఉండుటవలన రైలుయాత్రోల్లాసం కాస్తా నీరుకారి పోయిందట ప్రతాపరెడ్డిగారికి. తనకుమారుడు చదివిన వాడనీ, ఇంగ్లీషు ధారాళంగా వ్రాయను మాట్లాడనూ గలడనేధీమాతో నారాయణరెడ్డిగారు ప్రతాపరెడ్డి గారిని

తోడ్కొని పోయారు. ని నారాయణరెడ్డిగారి ఆశలు కర్నూలు సేషనులో అడియాసలైనాయట. రైలెక్కుతూనే ఒక ఆంగ్లోఇండియన్ టికెట్ చెకర్ రెడ్డిగారిని టికట్లు చూపమని ఇంగ్లీషులో ఏమేమో అన్నారట. అతడి సంభాషణా సారమటుంచి, అసలు వాడి ఉచ్చారణా ధోరణియే అర్థంకాలేదట ప్రతాపరెడ్డిగారికి ఇక అలాంటప్పుడు అతనితో ఏమిమాట్లాడగలడు ? తెల్ల మొహంవేసి, గుడ్లప్పగించి రెడ్డిగారు టికెట్ ఇన్స్పెక్టర్ కేసి చూడసాగినారట. అతను వెళ్ళిదిగి పోయినాక, నారాయణరెడ్డిగారు ఆమంట యీమంట అంతా ప్రతాపరెడ్డిగారిపై తీశారట.

ఆంగ్లేయుల ఉచ్చారణాధోరణి మరియు వారి చిక్కు వ్రాతను గురించిన మరొక అనుభవం, రెడ్డిగారు బి. ఏ. లో చదువుతుండగా సంభవించింది. దసరా సెలవుల్లో రెడ్డిగారు మద్రాసునుండి కర్నూలు వచ్చేశారు. ఆ సంవత్సరం దసరాతోపాటు మొహర్రమ్ పండుగకూడ కలసివచ్చింది రాయచూరు జిల్లాపోలీసు మొహతెమీమ్, కర్నూలు జిల్లాపోలీసు సూప్రంటెండెంటుగారితో ఏదోవిషయంలో సంప్రదించడానికి వచ్చినారట. తురక సాయెబుకు ఆంగ్లంరాదు; ఇంగ్లీషుదొరకు తురకం తెలియదను భ్రమలో రామకృష్ణారెడ్డిగారు ఉండుటవలన, ప్రతాపరెడ్డిగారిని వారికి పరిచయంచేసి వారి పనిలో సహాయపడటానికి అవకాశం కలిగించవచ్చునని ఆశించికర్నూలు పోలీసు సూప్రంటెండెంటుకు ఒకలేఖ వ్రాశారట. రామకృష్ణారెడ్డిగారికి జవాబులేఖ సూప్రంటెండెంటుగారు పంపించారు. రెడ్డిగారా లేఖను ప్రతాపరెడ్డిగారికి చూపించి అందేమి వ్రాశారో తెలుపమన్నారు. సూప్రంటెండెంటుగారి బ్రహ్మవ్రాతను తెలుసుకోలేక తికమకపడుతూ ఎలాగో 12 గంటలన్న అంకెను చదివి చిన్నాయనగారితో పోలీసు ఆఫీసర్‌గారు 12 గంటలకు రమ్మన్నారని రెడ్డిగారు తెలియజేశారు. ఆపైన రామకృష్ణారెడ్డిగారిని తెల్లదొరగారి బంగ్లాకు తీసుకొనిపోయినారు. కాని ప్రతాపరెడ్డిగారి అదృష్టంకొద్దీ తెల్లదొరవారికి ఉర్దూకూడ రావడంవలన దుబాషీ బాధ్యతాగండం గట్టెక్కిందని ప్రతాపరెడ్డిగారు మురిసిపోయినారు.

# కాలేజీ చదువులు

నిజాం కాలేజీలో ఇంటర్‌మీడియెట్‌లో చేర్పించడానికి రామకృష్ణా రెడ్డిగారు, ప్రతాపరెడ్డిగారినీ, వెంకటరెడ్డిగారను మరొక వ్యక్తినీ వెంటబెట్టు కొని రైలెక్కి హైద్రాబాదు చేరుకున్నారు. హైద్రాబాదు బజార్లలో వారికి పిండారుల్లాంటి పోలీసులు, నవాబుల నాలుగు గుఱ్ఱాల బగ్గీలు, ఉర్దుభాషా సంభాషణా వాగార్భటులు తటస్థపడినారట. నాంపల్లి స్టేషన్‌లోదిగి నేరుగా జాంబాగులోనున్న వనపర్తి రాజాగారి బంగ్లాకు చేరుకున్నారు. అప్పటికే రాజావారి బంగ్లా రాజబంధువులతో కిటకిటలాడుతుంది. రామకృష్ణారెడ్డి ప్రభృతులరాక కారణాన్ని తెలుసుకున్న దొరలు ''కాపులేమి కాలేజి చదువు లేమియని కంగారుపడ, రామకృష్ణారెడ్డిగారితో'' నిజాం కాలేజీలో నవాబుల సాహెబ్‌జాదాలకు, ముక్తేదార్లు, సంస్థానాధీశుల కుమారులకే ప్రవేశం లభిస్తుందనీ, అన్యులకు సీటుదొరకదని''అన్నారట.

అమాయకులగు రామకృష్ణారెడ్డిగారు వారి మాటలను విశ్వసించి మరునాడే మద్రాసుకు ప్రయాణమైపోయారు. తీరా మద్రాసు చేరినాక ఒక మిత్రుని సహాయంతో యథార్థాన్ని తెలుసుకొని మద్రాసునుండే నిజాంకాలేజీ ప్రిన్సిపాల్‌కు టెలిగ్రామునిచ్చి రెండు సీట్లు ఇంటర్‌లో రిజర్వుచేయించి, ప్రతాపరెడ్డి, వెంకటరెడ్డి గారలను నిజాంకాలేజీలో చేర్పించారు. 1913సం॥లో ఇంటర్‌లో ప్రవేశించిన రెడ్డిగారు 1917 సం॥లో ఉత్తీర్ణులైనారు. లెక్కల కారణంగా స్కూల్‌ఫైనల్‌లో తప్పిన రెడ్డిగారు, ఇంటర్‌లో సైకాలజీ (మానసిక శాస్త్రం) సరిపడనికారణాన బోల్తాకొట్టినారు. ఇంటర్‌లో ఉత్తీర్ణు లైనాక చదువు చాలిద్దామనుకుని రామకృష్ణారెడ్డిగారికి తెలియజేశారు కాని వారందుకు అంగీకరించనందు వలన మద్రాసుచేరి బి. ఏ. లో చేరిపోయారు.



ప్రతాపరెడ్డి దంపతులు

1916 సం॥లో ప్రతాపరెడ్డిగారికీ మేనపిల్లతో వివాహం అయింది. వారి వివాహంకూడ చిన్నగాథగా పరిణమించినది. వివాహకాలంలో రెడ్డిగారికి ఇరువైసంవత్సరాలు, వధువుకు పదహారు వసంతాలు. చిన్ననాడే పద్మావతీ దేవిని ప్రతాపరెడ్డిగారికి ఇస్తామని వాళ్ళ తలిదండ్రులు నామకరణం చేశారట. రెడ్డిగారు నిజాంకళాశాలలో ప్రవేశించినాక, పద్మావతీదేవి పక్షంవారు రామకృష్ణారెడ్డిగారితో సంప్రతించారట. వారికా సంబంధం సమ్మతమేఅయినా ప్రతాపరెడ్డి తల్లిగారిని మెప్పించి మనువు కుదుర్చుకొండని వధువు పక్షం వారికి సలహాఇచ్చి సాగనంపినారు. ఆపైన ప్రతాపరెడ్డి తల్లిగారితో రాయబారాలు సాగినవి. ఆవిడకు పెట్టుపోతల విషయంలో అంగీకారం కుదరనందువలన తనకా సంబంధం ఇష్టంలేదని అన్నగారికి తెలియజేసింది. వ్యవహారం శృతిమించి రాగానపడినదని గ్రహించిన ప్రతాపరెడ్డిగారు కార్యరంగంలోకి దూకక తప్పలేదు. తన స్నేహితుడూ, సహపాఠియైన వెంకటరెడ్డిగారిని రామకృష్ణారెడ్డిగారి వద్దకంపి, ఎవ్వరుమెచ్చినా మెచ్చకపోయినా తాను అ అమ్మాయినే వివాహం చేసుకుంటానని కబురుచేసినారు. ప్రతావరెడ్డిగారు. వధూవరులు ఏకమైనాక తలిదండ్రులు మాత్రం ఎంతకాలం అడ్డుగా నిలువగలరు. పద్మావతికూడ ప్రతాపరెడ్డినే వివాహం చేసుకుంటానని వర్తమానం చేసింది. తనకునచ్చిన, తనను మెచ్చిన పద్మావతినే ప్రతాపరెడ్డిగారు 1916 సం॥లో వివాహం చేసుకున్నారు. వారి వైవాహిక బంధం అనురాగ వల్లరియై వర్థిల్లినది.

1920 సం॥లో మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో సంస్కృతమును ద్వితీయ భాషగా స్వీకరించి రెడ్డిగారు పట్టభద్రులైనారు. బి. ఏ. లో చరిత్రాధ్యయనం చేయలేక రెడ్డిగారు సంస్కృతాన్ని చేపట్టినారుట. ఇంటర్‌లో సంస్కృతాన్నివిడిచి సైకాలజీని చేపట్టిన రెడ్డిగారికి బి. ఏ. లో సంస్కృతాన్ని సాధించడమొక గగనకుసుమంలా పరిణమించింది. బి. ఏ. లో సంస్కృతము తీసుకొనడానికి రెడ్డిగారు తమ సంస్కృతాధ్యాపకులైన వెల్లాలశంకర శాస్త్రిగారివద్దకుపోయి వారిచేత శిఫారసులేఖను వ్రాయించుకొని మద్రాసులో

నున్న సదాశివ శాస్త్రిగారికిచ్చారు. సదాశివశాస్త్రిగారు గొప్ప వైయాకరణులు, జటప్రోలు ఆస్థాన కవిపుంగవులు. వారికీ వేదం వెంకటరాయశాస్త్రి గారికీ స్నేహం ఉండడంవలన వేదం వారికా చిట్టీని రెడ్డిగారందించారు. వేదంవారు దాన్ని చదువుకొని ప్రెసిడెన్సీ కళాశాల సంస్కృతాధ్యాపకులైన ఎన్. కుప్పుస్వామి శాస్త్రిగారికి రికమండేషన్ లెటర్ వ్రాసిఇచ్చారు. ఎట్టకేలకు కుప్పుస్వామి శాస్త్రిగారు అంగీకరించారు గాని పరీక్ష తీసుకున్నాకనే తరగతిలో చేర్చుకుంటామని రెడ్డిగారికి తెలియజేశారు. రెడ్డిగారందుకు అంగీకరించారు. అయితే కుమారసంభవంలోని ఒకశ్లోకం చదివి అర్థతాత్పర్యములను విశదీకరించుమని శాస్త్రిగారు రెడ్డిగారి కాదేశించారు.

అప్పుడు రెడ్డిగారు, "అలం మహీపాల తవ శ్రమేణ..." అను శ్లోకాన్ని చదివి, పదచ్ఛేదముచేసి, అర్థతాత్పర్యములను విశదీకరించి గురువు గారిని మెప్పించారు. అయినా వారు మరొక షరతు విధించారు. రెడ్డిగారు మాంసభక్షణ మానుకుంటేనే కుప్పుస్వామిగారి శిష్యరికానికి అర్హులని భీష్మించారట. సరేనని అంగీకరించి, రెడ్డిగారు ఆజన్మాంతం శాకాహారిగానే ఉండిపోయారు. అంతేకాదు, ధూమపాన, మధుపానములను సైతం సేవించి యెరుగని సాధుమూర్తి శ్రీ సురవరము. 1919 సం॥లో సంస్కృతం గ్రూపులో రెడ్డిగారు ఉత్తీర్ణులైనారుగాని మిగతా సబ్జెక్టులలో వీగిపోవడంవలన, 1920 లో మళ్ళీ పరీక్షఇచ్చి కృతార్థులైనారు. బి. ఏ. తో చదువులకు స్వస్తి చెబుదామని సంకల్పించిన రెడ్డిగారిని వారిచిన్నాయన సాగనీయలేదు. బి.ఏ. పట్టా పుచ్చుకొనునప్పటికే రెడ్డిగారు ఇద్దరు పుత్రులకు తండ్రిఅయినారు. 1921 సంవత్సరమంతా రెడ్డిగారు ఇంటిలోనే విశ్రాంతి తీసుకున్నారు. "వివాహో విద్యనాశాయ" అన్న నానుడి రెడ్డిగారిపట్ల సార్థకంకాలేదు. 1921 సం॥లోనే "ఉచ్ఛల విషాదమను" నాటకాన్ని పోటీకొరకై వ్రాసి మద్రాసులోగల ఒక నాటక కంపెనీకి అర్పించారు.

1922 సం॥లో ఎఫ్. ఎల్. పరీక్షకు చదివి, 1924 సంవత్సరాంతంలో బి. ఎల్. పట్టాపుచ్చుకొని రెడ్డిగారు గృహోన్ముఖులైనారు. ఇంటికి వచ్చినా

రెడ్డిగారు పఠన వ్యాసంగాన్ని వదలలేదు. సంస్కృత వాఙ్మయంలోగల పురాణేతిహాసములను కావ్యములను శాస్త్ర మీమాంసలను క్షుణ్ణంగా అభ్య సించారు. రెడ్డిగారిదృష్టి మొదటినుండీ పరిశోధనా పరిశీలనాత్మకమైనదే: వారే గ్రామంవెళ్ళినా ప్రాత గుడిగోపురాలను తిలకించినా, ఏజానపద సాహిత్యాన్ని అవలోడనచేసినా అందు నిబిడమైయున్న చారిత్రకాంశములను తవ్వి పత్రికా ముఖమున కెక్కించినగాని వారికి తృప్తియుండెడిదిగాదు.

రెడ్డిగారు మద్రాసులో చదువుకున్న రోజులలో జాతీయ కాంగ్రేస్ ఉద్యమం ఉద్ధృతంగా సాగుతున్నది. మద్రాసు నగరం సత్యాగ్రహ సమర యోధులకు పుట్టినిల్లు. మహాత్మాగాంధిగారి సత్యాగ్రహోద్యమం, అహింసా సిద్ధాంతం, ఖద్దరు వస్త్రధారణ, మద్యపాన నిషేధము, ఆబాల గోపాలమును ఆకర్షించినవి. గాంధీగారి ఉద్యమ ప్రవాహంలో రెడ్డిగారుకూడ చిక్కు కున్నారు. ఖద్దరు వస్త్రధారణ, నిరాడంబర జీవనవిధానము, సత్యనిష్ఠ, స్వాతంత్ర్యేచ్ఛ రెడ్డిగారి అణువణువులో జీర్ణించుకుపోయినవి. సంస్కృతా ధ్యాపకులతో, ఆర్ష విద్యాప్రభావంతో సంస్కరింపబడిన రెడ్డిగారిమనస్సును గాంధీగారి సిద్ధాంతాలు ఆకర్షించి, అలముకొని పోయినవి. బహుగ్రంథ పఠనంతోను, విమర్శనాత్మక దృక్పథంతోను తొణకిసలాడుతున్న రెడ్డిగారి జ్ఞాన సరోవరము పూర్ణమై మత్తడి దూకడం ప్రారంభించింది. తత్పర్యవసా నంగా రెడ్డిగారి కలంనుండి ఎన్నో చారిత్రక పరిశోధనాత్మక వ్యాసాలు 'పినా కిని' 'కళ' రెడ్డిరాణి'మున్నగు వార మాసపత్రికల్లో ప్రకటితమవుతూ వచ్చినవి. వా రా రోజులలో ప్రకటించిన విమర్శనాత్మక వ్యాసాలలో హరిజనోద్ధరణ, మద్యపాన నిషేధము, మార్వాడీల వ్యాపారము, మన పరిశ్రమలను నాశనం చేసిందెవరు?, మలబారు క్రైస్తవులు, ప్రత్తిసాగు పద్ధతి మున్నగునవి ఎన్న దగినవి. ''సంఘోద్ధరణము'' అను పుస్తకంద్వారా ఆయా వ్యాసాల్లో కొన్ని సేకరించి ప్రకటింపబడి మేధావుల ప్రశంసల నందుకున్నవి.

సాహిత్యసేవకు తోడుగా దేశసేవకూడచేయాలని రెడ్డిగారి సంకల్పమై యుండెడిది. గాంధిగారి గాలి బాగా ఒంటపట్టింది కనుకనే రెడ్డిగారు ఉన్నత

విద్యాసంపన్నులై యుండియూ ఉద్యోగమునకై అర్రులు చాచలేదు. ఆంధ్ర భాషయనినా, ఆంధ్రప్రజలన్నా, ఆంధ్రదేశమన్నా రెడ్డిగారి కెనలేని అభిమానముండెడిది. చిన్ననాటినుండియే రెడ్డిగారి హృదయం రామకృష్ణారెడ్డి గారి ఆధ్వర్యంలో అలా మలచబడింది. రెడ్డిగారు అనుకోకుండా హైద్రాబాదు రావడం జరిగింది. ప్రతాపరెడ్డిగారి బంధువర్గంలో ఒకరగు పెరూరు బసిరెడ్డి గారిపై చౌర్యనేరం ఆపాదింపబడిన కారణంగా చిన్నాయనగారి ఆదేశంపై హైద్రాబాదువెళ్ళి కొత్వాల్ బహద్దర్ వెంకటరామారెడ్డిగారిని సందర్శించాల్సి వచ్చింది. ప్రతాపరెడ్డిగారి ఇంటివ్యవహారములు ఆరోజులలో సక్రమంగా ఉండుటవలన రెడ్డిగారిమనస్సు ఉద్యోగంపై మరలలేదనడానికి మరొక కారణమై యుండవచ్చు. ఉద్యోగం చేయడమంటే ఎంత ఏవగింపో రెడ్డిగారికి ప్రాక్టిస్ చేయడమన్నా అంతే అసహ్యము ఉండెడిది.

ఇదలా ఉండగా అమరచింత సంస్థానాధీశ్వరుల బంగారుపొందాను దొంగిలించారని ప్రతాపరెడ్డిగారి బంధువులగు పెరూరు బసిరెడ్డిగారిపై నేరారోపణ చేయబడింది. మహబూబ్‌నగర పోలీసుఠానాలో బసిరెడ్డిగారిపై కేసు నమోదు చేయబడింది. ఆ వార్తను తెలుసుకున్న బసిరెడ్డిగారు రామకృష్ణారెడ్డిగారి సహాయ సహకారముల నర్థించాడు. రామకృష్ణారెడ్డిగారు ప్రతాపరెడ్డి గారిని పిలువనంపి కేసువిషయాలను తెలియజేస్తూ హైద్రాబాదువెళ్ళి కొత్వాల్ వెంకటరామారెడ్డిగారి సహాయంతో ఠానాలోగల కేసును కొట్టివేయవలసిందిగా తెలిపినారు. వారి ఆదేశానుసారం ప్రతాపరెడ్డిగారు హైద్రాబాదువెళ్ళి రాజా బహద్దర్ వెంకట్రామారెడ్డిగారిని కలుసుకొని యథార్థ విషయాలు తెలియజేసినారు. ప్రతాపరెడ్డిగారికి కొత్వాల్‌గారితో నిజాంకాలేజీలో విద్యార్థిగాఉంటూ ఉండేనాటినుండే పరిచయం ఏర్పడింది. రెడ్డిగారు నిజాంకాలేజీలో చదువుకునే రోజులో రెడ్డిహాస్టల్ ప్రారంభింపబడలేదు. అందుచేత రెడ్డిగారు పింగిలి వెంకటరామారెడ్డిగారి భవనపు బయటిగదులలో (out houses) నివసిస్తూ వనపర్తివారి హోటల్‌లో నెలకు 18 రూపాయలిచ్చి భోజనం చేసెడివారు. రెడ్డిహాస్టల్ 1918 సంవత్సరపు ఆగస్టు నెలలో అనగా కాళయుక్తి నామ

సంవత్సర జ్యేష్ఠశుక్ల పంచమినాడు అద్దెకుతీసుకున్న భవనాల్లో 43 విద్యార్థులతో ప్రారంభింపబడింది. వనపర్తి రాజావారి కుమార్తె వివాహసమయంలో కోత్వాల్ వెంకట్రామారెడ్డిగారు బీదరెడ్డి విద్యార్థుల అసన వసన సౌకర్యార్థం హాస్టల్ నిర్మాణానికిగాను వివాహంలోపాల్గొన్న పెద్దలను ఉదారంగా ధన సహాయం చేయవలసిందిగా అర్థించారు. మొదట పింగిలి వెంకటరామారెడ్డి గారు పదివేలు ఇస్తామని ప్రకటించారు. అనంతరం గద్వాలరాజు, వనపర్తి రాజు ముప్పది, ఏబదివేల ధనసహాయాన్ని ప్రకటించారు. ఆ సందర్భంలో సమావేశమైన పెద్దలంతా రెడ్డిహాస్టల్‌కు ఇతోధికసహాయంచేశారు. 1918లో ప్రారంభింపబడిన హాస్టల్‌భవనం శంఖుస్థాపన కార్యక్రమం 1925 వరకు భవనాల నిర్మాణం కొనసాగింది. మొత్తం ఐదులక్షల ధనవ్యయంతో రెడ్డి హాస్టల్ నిర్మాణం పూర్తికావింపబడింది. ఇంతపెద్ద భవనపు యాజమాన్య బాధ్యతను మంచివ్యక్తిచేతిలో ఉంచాలని కోత్వాల్‌గారు ప్రయత్నిస్తున్న సమయంలో ప్రతాపరెడ్డిగారు ప్రత్యక్షమైనారు.

ప్రతాపరెడ్డిగారి కేసునువిన్న కోత్వాల్‌గారు, "సరే ! నీవు తెచ్చిన కేసును ఒకషరతుపై అంగీకరిస్తాను. నీవు రెడ్డిజన వసతిగృహానికి కార్యదర్శిగా ఉండవలెను" అని ఆదేశించారు. ప్రతాపరెడ్డిగారు తమబంధువు గండమును కడతేర్చడానికి పూనుకున్నారు కనుక కోత్వాల్‌గారి మాటను మన్నించకతప్పలేదు. అంతటితో బసిరెడ్డిగారి గండం కడతేరింది. ప్రతాప రెడ్డిగారి పని ప్రారంభమైంది. రెడ్డిగారు హాస్టల్ బాధ్యతలను స్వీకరించక పూర్వము విద్యార్థులప్రవర్తన సక్రమంగా ఉండేదికాదు. గుండాలవలె ప్రవర్తించడం, వీలుదొరికినపుడు చిక్కినవారిని తన్నడంలాంటి ఘనకార్యాలు రెడ్డిజనసంఘవిద్యార్థులు చేస్తూ ఉండేవారు. కొన్నిషరతులను విధించి, కోత్వాల్‌గారినిమెప్పించి రెడ్డిహాస్టల్ బాధ్యతను రెడ్డిగారు చేపట్టినారు.

# రెడ్డిహాస్టల్ బాధ్యతలు

1. తాను రెడ్డిహాస్టల్ కార్యదర్శిగా ఉన్నంతకాలము, అందుకు ప్రతిఫలంగా ఏమీఆశించిక సేవచేయుట.

2. హాస్టల్ విద్యార్థులకొక ప్రవర్తనావళిని తానే తయారుచేసి దాని నాచరణయందుంచుటలో తనప్రమేయముతప్ప అన్యులజోక్యముండకుండుట.

3. హాస్టల్ విద్యార్థుల క్రమశిక్షణలో క్రొత్తపద్ధతులను ప్రవేశపెట్టి వాటి నాచరణయందుంచుటయందు, అలాగే సర్వాధికారిగా యుండుట.

పైమూడు షరతులను బేషరతుగా కోత్వాల్‌గారు అంగీకరించారు. ప్రతాపరెడ్డిగారు హాస్టల్ కార్యనిర్వాహణ బాధ్యతను చేబూనిన రెండుమూడు మాసములలోనే విద్యార్థుల ప్రవర్తనలో గణనీయమగు మార్పు గోచరించినది. విద్యార్థులు హాస్టల్‌కు రాకపోకలలో పాటించు నియమ నిబంధనలలో మార్పులు గావించబడినవి. రాత్రి తొమ్మిదిగంటలు దాటినాక ఏవిద్యార్థియు బయటఉండుటకు వీలులేదు. విద్యార్థులు వారానికొకమారు సమావేశ భవనంలోచేరి ఏదేనిఒక అంశంపై వక్తృత్వ లేదా వ్యాసరచన పోటీలు నిర్వహించడానికి తగినఏర్పాటు చేయబడింది. విద్యార్థులంతా ఉదయమేలేచి కాలకృత్యములు తీర్చుకొని కసరతుచేయుటకు తగిన సౌకర్యములు చేకూర్చబడినవి. రెడ్డిగారురాకపూర్వము హాస్టల్‌గ్రంథాలయంలో వేయిగ్రంథములు మాత్రమే యుండెడివి. రెడ్డిగారి పదేండ్ల కార్యదర్శిత్వపు హయాంలో గ్రంథముల సంఖ్య వేయినుండి పదునొకండు వేలవరకు పెరిగింది. హాస్టల్ విద్యార్థులు పూర్వము హాస్టల్‌లో భుజిస్తూ వసతిగృహ యాజమాన్యం వారికి సక్రమంగా డబ్బు చెల్లించనందువలన అట్టి బకాయలు నాలుగైదు వేలవరకు

పెరిగిపోయెను. రెడ్డిగారిట్టి పాతబాకీల నన్నిటిని వసూలుచేసిరి. రెడ్డిగారు కార్యదర్శకత్వ బాధ్యతలను చేబూనినపుడు హాస్టల్ విద్యార్థులసంఖ్య ఎనబై మాత్రమే యుండెడిది. అట్టిసంఖ్యను 120 వరకూ పెంచి హాస్టల్ ఆసన వసన వ్యవహారములను స్వయంపోషక వ్యవస్థగా మార్చినారు. విద్యార్థులలో పూర్వమున్న తుర్కీటోపీలు, శేర్వానీలు, చుడీదార్ పైజామాలు మాయమై అచ్చమగు తెలుగుసాంప్రదాయిక వేషభాషలు చోటుచేసుకున్నవి. విద్యార్థులలో చాలమంది మెట్రిక్, ఇంటర్, బి. ఏ. పరీక్షలలో ప్రథమశ్రేణు లందు ఉత్తీర్ణులై ప్రభుత్వ స్కాలర్‌షిప్పులను పొందటం ప్రారంభించారు. 1924 సంవత్సరాంతంలో చేబట్టిన రెడ్డిజనసంఘ కార్యనిర్వహణ బాధ్యతలను పదిసంవత్సరాలు సక్రమంగా, సమర్ధవంతంగా, ఆదర్శప్రాయంగా నిర్వహించి కోత్వాల్‌గారి గౌరవమన్ననలకు రెడ్డిగారు పాత్రులై చెరగని ముద్రవేశారు.

ఒక్కచిన్న సంఘటన కారణంగా రెడ్డిగారు తమకుతాముగా సెక్రటరీ పదవీ బాధ్యతలనుండి వైదొలగాల్సి వచ్చింది. అదొక పుస్తకమును రెడ్డి హాస్టల్ గ్రంథాలయానికి కొనుగోలుచేసిన వ్యవహారమునకు సంబంధించిన సమస్య. శ్రీ వీర సావర్కార్ వ్రాసిన "The war of Independence" అను గ్రంథము పొరపాటున ప్రతాపరెడ్డిగారు రెడ్డిహాస్టల్ గ్రంథాలయం కొరకు ఖరీదుచేసిన పాతపుస్తకాల కట్టలో ఉండుటవలన సంభవించినది. ఏతత్ పుస్తకరాజమును ఘనతవహించిన నిజాము ప్రభుత్వమువారు హైద్రాబాదు రాష్ట్రంలో బహిష్కరించి యుండిరి. అది బహిష్కృతమగు పుస్తకము కావున రెడ్డిగారు ఆ పుస్తకాన్ని తీసుకొనిపోయి కోత్వాల్‌గారికి చూపించి యుండిరి. కాని కోత్వాల్‌గారు అప్పుడు ఏమూడ్‌లో ఉండిరో కాని, ఆ విషయాన్నంతగా పట్టించుకొనలేదు. కొన్నాండ్లకా పుస్తకాన్ని ఎవరు తీసుకున్నారో ఏమోకాని మళ్ళీ ఆగ్రంథం గ్రంథాలయంలో లభించలేదు. కాని ఆ వార్తమాత్రం తిన్నగావెళ్ళి రెసిడెన్సీ పోలీసువారి చెవిలోదూరి పోయింది. ఇంకేముంది అగ్నిలో ఆజ్యంపోసినంత పని అయింది. పోలీసువారి రంధ్రా

న్వేషణ కార్యక్రమం ప్రారంభమైంది. సురవరంవారే ఆ పుస్తకాన్ని రెడ్డి హాస్టల్‌కు తెప్పించారని పోలీసుశాఖకు తెలిసిపోయింది రెడ్డిహాస్టల్ కార్య నిర్వాహక వర్గ సభ్యులుకూడ ఆ విషయాన్ని బలపరచారు. జిల్లాపోలీసుశాఖ వా రా సంగతిని రాష్ట్ర మాలుఅధికారికి (Revenue Secretary) తెలియ జేసారు. అప్పటి మాలుశాఖాధికారియగు కర్నల్ ట్రెంచ్ దొరగారికి ఇంకా కొన్ని అభూతకల్పనలు ప్రతాపరెడ్డిగారి కార్యకలాపముల గురించి అంది యుండెను. కర్నల్ గారా సమాచారమునంతా మూటగట్టి కోత్వాల్‌గారికి పంపించారు. కోత్వాల్‌గారికి మాత్రం ప్రతాపరెడ్డిగారి విషయం తెలియదా? అయినా చేయునదిలేక రెడ్డిగారు సమర్పించిన రెడ్డిహాస్టల్ కార్యదర్శి పదవి యొక్క రాజీనామాను స్వీకరించి ఆ పత్రాన్ని ప్రభుత్వానికి పంపించారు. కోత్వాలుగారు. అంతటితో ప్రభుత్వకళ్లు చల్లబడినవి, ప్రతాపరెడ్డిగారి భారమూ తగ్గిపోయింది.

ప్రతాపరెడ్డిగారు ఒక్క రెడ్డి హాస్టల్‌కేకాక యాదవసంఘానికీ, ముది రాజ సంఘానికీ, గౌడసంఘానికీ కూడ కార్యదర్శిగాఉంటూ ఆ యా సంఘాల వసతి గృహాలకు అరమరికలులేని సేవచేశారు. రెడ్డిగారిని ఏసంఘమువారు కోరినా వారికి వారి సహాయసహకారములు కుల, మత, వర్గ తారతమ్య రహితంగా లభించెడివి. తాను రెడ్డిననే దురభిమానము జాత్యహంకారం వారికి ఏకోశానా లేకుండెడివని అవిభక్త హైద్రాబాదు తొలి ముఖ్యమంత్రి యగు బూర్గుల రామకృష్ణారావుగారు పలుమార్లు ఉగ్గడించారు. కాపులంతా రెడ్లేననీ, కాపుకులమంతా కలెబులుగమేననీ, కాపు బలిస్తేనే రెడ్డి అవుతాడనీ, ప్రతాపరెడ్డిగారొకతడవ యాదవసంఘ సమావేశంలో ఉద్ఘాటించారు. తెలంగాణాలో రెడ్లు ముప్పదిశాతం ఉన్నారని సురవరంవారు గణాంకసంఖ్యావివరణద్వారా నిరూపించారు. కాపుకులాలు, తెగలు అన్నీ, మర్రిఊడలు మర్రిచెట్టుకే సంబంధించియున్నట్లు, రెడ్లశాఖకే చెందుతాయనీ; కాపులంటే రక్షకులు, సంరక్షకులు, కృషీవలురనీ సశాస్త్రీయంగా నొక్కి వక్కాణించిన ఘనత ప్రతాపరెడ్డిగారికే దక్కుతుంది. పాకనాడు, పంట

నాడు, పలనాడు, వెలనాడు, కమ్మనాడులాంటి పెద్దతెగలు ఆయాప్రాంతాలనే సూచిస్తాయిగాని, పెద్దినాడు తమలోతాము సృష్టించుకున్న కృత్రిమ తరతమ భేదాలకు సూచకాలు కావని నిర్ధారణగా, హేతుబద్ధంగా తమ "కాపులెవరు?" అను పుస్తకంలో సోపపత్తికంగా నిరూపించారు. ఆ పుస్తకమింతవరకూ ముద్రణ భాగ్యానికి నోచుకోలేదు.

# 6

# గోలకొండ పత్రిక సంస్థాపన

రెడ్డిజన సంఘ హాస్టల్ కార్యదర్శిగా నియక్తులైన మరుసంవత్సరమే అనగా 1926 సంవత్సరారంభంనుండి "గోలకొండ పత్రిక" సంస్థాపనకు కృషిసల్పబడింది. ప్రతాపరెడ్డిగారిలో నిబిడమైయున్న రచనాశక్తిని పసిగట్టిన కోత్వాల్‌గారు వారి ఆశయజ్వాలల కాజ్యంపోసి సముజ్జ్వలంచేశారు. గోలకొండ పత్రిక కేవలం తనకొరకే, తన ప్రోద్బలంతోనే జరిగిందని రెడ్డిగారి అభిప్రాయము. ఒకదినము రెడ్డిగారు కోత్వాల్‌గారిని కలిసికొని ఒక్క రెడ్డి హాస్టల్ కార్యనిర్వహణమే తనకు చాలదనియు, ప్రజాహిత కార్యముల సక్రమ నిర్వహణకు పత్రికాప్రచురణమే ప్రధానపాత్ర వహించగలదుకనుక, "ఒక పత్రిక స్థాపనకు వలయు ధనమైనా ప్రోగుచేయండి లేదా నన్ను గ్రామమైనా పంపించండని" విన్నవించారు. కోత్వాల్‌గారు వెంటనే వారి ప్రతిపాదన నంగీకరించి మరునటిదినమే ఏడుగురు పెద్దలను పిలిపించి తలా వేయిరూపాయల చందాఇచ్చుటకు ఏర్పాటుచేశారు. రెడ్డిగారు ఏడువేల రూప్యములను తీసుకొని మద్రాసువెళ్ళి ప్రింటింగ్‌మిషను మరియు టైపు పెట్టెలు తెప్పించారు.

ఆ రోజుల్లోనే కర్నూలు జిల్లానుండి స్వరాజ్యపార్టీ పక్షాన శాసన సభకు అభ్యర్థిగా నుండుటకై గాడిచెర్ల హరిసర్వోత్తమ రావుగారు ప్రతాప రెడ్డిగారికి తంతిద్వారా వర్తమానమంపుతూ తాను ఎన్నికలకు నిలుచుంటే కాని ఖర్చులేకుండా ఎలక్షన్‌లో నెగ్గిస్తానని తెలియజేశారు. కాని ప్రతాపరెడ్డి గారు అదివరకే పత్రికాస్థాపన కార్యక్రమంలో చిక్కుకొని యుండుట వలన తన అశక్తతను గాడిచెర్లవారికి నివేదించుకున్నారు.

రెడ్డి హాస్టల్ భవనాల్లోనే గోలకొండ పత్రికను ప్రారంభించాలని

రెడ్డిగారు రెసిడెన్సీ తెల్లదొరలకు నివేదించారట. కాని వారిఆశయం ఫలప్రదం కాలేదు. పత్రికకు జాతీయనామం ఉంటే దానిప్రచురణకే అనుమతి లభించ దని ముందే గ్రహించిన రెడ్డిగారు పత్రికపేరు "గోలకొండ పత్రిక"యని నామకరణంచేసి అధికారుల అనుమతి నర్థించియుండిరి. అంతకుపూర్వమే ఒకవ్య తాను ప్రచురించనున్న పత్రికకు "ఆంధ్రమాత" యను పేరు స్థిరపరచి అనుమతి నర్థించగా అధికారులు రి అభ్యర్ధనను తిరస్కరించారట. అందువలన ప్రతాపరెడ్డిగారు తన పత్రికపేరును గోలకొండ పత్రికగా సూచించి తెల్లదొరల రెసిడెన్సీ కోటలో పాగవేసినానని సంతసించారు కాని వారి ఆశయం ఆడియాస పాలైనది. ఇక చేయునదిలేక రెడ్డిగారు కొత్వాల్ గారి సహాయమును అర్థించాల్సివచ్చింది. కోత్వాల్‌గారు రెసిడెన్సీ దొరలతో సంప్రతించగా రెసిడెంట్ కార్యదర్శియొకరు "Oh, that editor is a Khaddar man, a political one who comes from Guntur — a hot bed of non cooperation" అని అన్నారట. ప్రతాపరెడ్డిగారు గుంటూరువాసియని నగర సి. ఐ. డీలు తెల్లదొరల కెలా రిపోర్టుచేసినారో ? ఏ ఉద్దేశంతో చేశారోతెలియదు. పాపం; రెడ్డిగారప్పటికి గుంటూరు పొలి మేరలనుకూడ చూచియెరుగరు. మొత్తంపై ఏదోఒక నెపంతో పత్రికాప్రచు రణ అనుమతి నిరాకరించాలను దురుద్దేశంతో వారా నాటకమాడియుంటారు. ఎలాగైతేనేమి కొత్వాల్‌గారు రెసిడెన్సీ దొరలను కలుసుకున్న గంటలోప లనే వారిభ్రమ తొలగిపోయింది. గోలకొండ పత్రికా ప్రచురణకు నిజాంవారి ఫర్మాన్ జారిఅయింది, అవరోధాలన్నీ అంతరించాయి.

గోలకొండ పత్రిక ముద్రణాలయం మొదట త్రూప్‌బజార్‌లోగల ఒక చిన్న భవనంలో స్థాపించబడింది. రెడ్డిగారికి పత్రికను ప్రచురించుట దాని నిర్వహణ పద్ధతులు, వాటికిసంబంధించిన వ్యవహారములేవీ తెలియవు. అడపాతడపా వ్యాసములు వ్రాస్తూ పత్రికలకంపి ప్రచురించడం తప్పితే పత్రికను నడపడంలాంటి వ్యవహారం రెడ్డిగారికొక సమస్యగానే తోచింది. ఆ కాలంలో అతిపురాతనమని చెప్పబడు "ముషీరెదక్కన్" ఉర్దు దిన

పత్రిక సంపాదకుడగు కిషన్‌రావుగారిని కలిసి, వారి అనుభవాలను విందామని సంకల్పించిన రెడ్డిగారు కిషన్‌రావు గారింటికివెళ్ళి వారితోసంప్రతించగా "పత్రికా ప్రచురణమంటే ఏముంది? ఆ వార్త ఈవార్త అన్నీ జమచేసి అచ్చొత్తించాలె. ప్రభుత్వము జారీచేయు గష్తీలను పుణ్యానికి ప్రకటించాలి. ఇది హైద్రాబాదు సుమా! ఇక్కడ తోక ఆడించకూడదు" అని ముక్తసరిగా మూడు ముద్దుముచ్చట్లు చెప్పినారట. ఇక లాభంలేదనుకొని వారివద్ద సెలవు తీసుకొని, చాదర్‌ఘాట్ హైస్కూల్‌కు కొత్తగా బొంబాయినుండి వచ్చిన ప్రిన్సిపాల్‌గారగు శ్రీ పిక్థాల్ అను వారిని రెడ్డిగారు కలుసుకున్నారు. పిక్థాల్‌గారు బొంబాయిలో కొంతకాలము ఒకపత్రికను ప్రచురించారట. అతను రెడ్డిగారితో, ''ఏమని చెప్పాలి, నావలె పత్రికను ప్రచురించి కోర్టు కెక్కవద్దు'' అని హితోపదేశం చేసినారట.

తుదకు ''ఆత్మబుద్ధి సుఖం చైవ'' అనుకొని రెడ్డిగారు తమకు తోచినట్లు పత్రికను నడపడానికి ఆయత్తమై రంగంలోకి దూకినారు. ఉగాదినాడో, సంక్రాంతినాడో పత్రికను ప్రారంభిద్దామని సంకల్పించుకున్న రెడ్డిగారికొక శుభోదయాన కొత్వాల్‌గారు కలిసి, ''ఎల్లుండి నాకొడుకు రంగారెడ్డి (అప్పట్లో ఆబ్కారీ మొహతెమీమ్) దౌరాకు పోతున్నాడు. కొన్ని పత్రికలను వెంటనే ప్రచురించి అతనికిస్తే చందాలు జమ చేసుకొస్తాడని'' ఆజ్ఞాపించారు. కొత్వాల్‌మాటకు కొట్టులేదని తెలుసుకున్న రెడ్డిగారు తీర్‌నెల 3వ, తేదీన (10th May, 1926) అక్షయ నామసంవత్సర చైత్ర బహుళ తదియనాడు "గోలకొండ పత్రిక"ను అనుకున్నప్రకారం ప్రచురించి రంగారెడ్డిగారికొక పత్రికలకట్టను దౌరాపోవుటకు ముందుగా అందించారు. కాని వారు ఆశించినంతగా చందాలు వసూలుచేయలేదు. ప్రతాపరెడ్డిగారికి అనుభవం లేనందువల్లనూ, అవసరమగు వస్తుసామగ్రి సకాలంలో లభ్యంకానందువల్లనూ తనవద్ద మిగిలిఉన్న కాస్తడబ్బుకూడ వ్యయమైపోయింది. ఇంతవరకేకొన్న ట్రెడిల్ మిషన్ పెద్దదికావడంచేత, దినదినమూ దాన్ని నడుపడానికి నలుగురు మనుషులు అవసరము కావడముచేతను, వాళ్లకూడ సక్ర

మంగా పనికి రాకపోవడముచేతను, కరెంట్ డైనామో తెప్పించవలసివచ్చింది. అందుకు డబ్బు కావాలికదా ! ఆ తరుణంలో పోషకులు, రాజపోషకులు, అభిమానులు అను మూడుతెరగుల వాటాదార్లను చేర్పించి వేయిరూపాయలతో డైనామోను ఖరీదుచేశారు రెడ్డిగారు. తదాదిగా కొన్నాండ్లవరకు రెడ్డిగారే 'గోలకొండ' సంపాదకుడుగా, మేనేజరుగా, ఉపసంపాదకుడుగా, ప్రూఫ్‌రీడరుగా, గుమాస్తాగా, చప్రాసీగా వ్యవహరించి సవ్యసాచివలె పరిశ్రమించారు. అయినా ఎంతకాలం అలాచేయడానికి ఓపికా, సత్తువా ఉంటాయి. మూడునాలుగు మాసములు రెడ్డిహాస్టల్ విద్యార్థులు అండదండలుగా నిలిచి ఆదుకున్నారు. ఆపైన ఒక సబ్ ఎడిటర్‌ను, ఒక ప్రూఫ్‌రీడర్‌ను, ఒక చప్రాసీని రెడ్డిగారు తమకు సహాయంగా నియమించుకున్నారు.

ఆ కాలంలో హైద్రాబాదులో తెలుగుమాట్లాడువారే అరుదైనపుడు, పత్రికకు వ్రాయు స్థాయిగల తెలుగువాడు సహాయసంపాదకుడుగా లభ్యమవడం గగనకుసుమంలాంటి విషయము. సహాయసంపాదకుడు లభించినా వార్తాహరుడు (correspondent) మరియు విలేకరులు దొరకుట చాల దుర్ఘటము. అలాంటి క్లిష్టపరిస్థితులలో 'గోలకొండ పత్రిక' ద్వైవారపత్రికగా హైద్రాబాద్‌నుండి ప్రచురింపబడింది. అంతకుముందునుండే నల్లగొండ మరియు ఇనుగుర్తినుండి "నీలగిరి" మరియు "తెలుగు పత్రిక" వార పత్రికలుగా ప్రచురింప బడుతుండేవి. బుద్ధిరాజు సోదరులు తెలుగుపత్రికను నడుపుచుండెడివారు. 'నీలగిరి' పత్రిక ప్రచురింపబడిన కొద్దిరోజులకే 'తెలుగుపత్రిక' నిలిచిపోయింది. గోలకొండ పత్రిక అవతరించిన కొన్నాండ్లకు నీలగిరి నిలిచిపోయింది. 'గోలకొండ పత్రిక ద్వైవారపత్రికగా వెలువడాలని శ్రీ మాడపాటి హనుమంతరావుగారు కూడ అభిలషించుటవలన వారు గోలకొండ పత్రిక సక్రమ ప్రచురణకు తోడ్పడవలసి వచ్చింది. అందువలన వారు గోలకొండలో కొంతకాలం సహాయ సంపాదకులుగా పనిచేస్తూ ప్రతాపరెడ్డిగారికి అండగా నిలిచారు. ఏ సుముహూర్తాన గోలకొండ అవతరించినదోగాని అది ప్రారంభింపబడిన తరుణంనుండి అన్నీ హంసపాదులే అడ్డు

తగిలినవి. విలేకరులులేరు, సహాయ సంపాదకులు నిలకడగా నిలువలేదు; వ్రాయసగాండ్రు అసలే లేరు. చందాదారులు సకృత్తు, జనాదరణ అంతంత మాత్రము; ఉర్దువ్యామోహము అక్షరాస్యులలో అధికముకావడమువలన గోలకొండ నిలద్రొక్కుకొని నడువడం దుర్ఘటమై పోయింది. దానికితోడు తురక ప్రభుత్వ పెత్తందార్లు సాలుకు మూడు నాలుగుసార్లు ఏదోఒక కుంటిసాకు జూపిస్తూ పత్రికను మూసివేయిస్తామని బెదిరించడంవలన గోలకొండ దినదిన గండంతో నడువసాగింది. ఇలాంటి బాలారిష్టాలతో కూడుకున్న పత్రికను రెడ్డిగారు నడుపలేక విసిగిపోయి కొత్వాల్‌గారి వద్దకేగి గోలకొండను మూసి వేస్తానని వాదిస్తూ, తుమ్మితేఊడిపోయే ముక్కుతో ఏమిలాభమని అన్నారట. అందుకు కొత్వాల్‌గారు "అసలు ముక్కేలేకపోతే తుమ్ముకు పరిగణన, ప్రాముఖ్యము ఉండదు. కాబట్టి గోలకొండనునడిపి తీరాల్సిందేనని ఆజ్ఞాపించి నారట. ఇందరు రెడ్లు ఉంటున్న తెలంగాణలో ఒక తెలుగుపత్రిక నడుప బడక పోతె ఆ అవమానము ఎవరికి? అని పృచ్ఛచేసి ప్రతాపరెడ్డిగారిని త్రిప్పికొట్టినారట.

గత్యంతరములేక రెడ్డిగారు ఎట్లో బాధలకోర్చి, కష్టాలనుసైచి, అవరోధాల నధిరోహించి, గోలకొండను బాలారిష్టాలనుండి గట్టెక్కించి, ఆర్థికంగా స్వయంపోషకం అయ్యేలా రూపొందించారు. ''పట్టుకుంటె కప్పకు, వలదంటే పాముకు కోపంవచ్చే" సామెతలా పరిణమించిన నాటి నిజాము పరిపాలన పోకడలు, అన్నివిధాలా నలిగి నకనకలాడుతున్న పీడితప్రజలకు పత్రికద్వారా కనువిప్పు కలిగేలా వ్రాయడం రెడ్డిగారికి అగ్నిపరీక్షలా పరిణమించెడిది.

గోలకొండ పత్రికకు సంపాదకులై మూడువసంతాలు గడచినాక రెడ్డిగారికి వారి చిన్నాయినగారితో ప్రాక్టీసు ప్రారంభించడంపై భేదాభిప్రాయములు తలెత్తినవి. ప్రతాపరెడ్డిగారు వకాలతుచేయాలని రామకృష్ణారెడ్డిగారి సంకల్పము. రెడ్డిగారికి వకాలతంటే సుతరమూ గిట్టనికారణాన వారిరువురికి ఘర్షణ తప్పనిసరియైనది. వాదోపవాదాలు తీవ్రరూపం దాల్చినవి. రెడ్డిగారి

మనస్సు కలతచెందినది. చిన్నాయనగారి మాటను తీసివేయలేక, తనకు తాను సమాధానము చెప్పుకోలేక, తిన్నగా హైద్రాబాదువిడిచి గ్రామంవెళ్ళి ఆరునెలలు అజ్ఞాతవాసం చేశారు. చిన్నాయినగారితో మాటలు మానుకున్నారు. తుదకు రామకృష్ణారెడ్డిగారే మెత్తబడినారు. రెడ్డిగారి అభిమతానుసారమే గోలకొండ పత్రికపని చూచుకుంటూ హైద్రాబాదులోనే ప్రాక్టీస్ చేయడానికి అనుమతినిచ్చారు. ఆరు నెలలు ఇటికేలపాడులో ఉన్న తరుణంలోనే ప్రతాపరెడ్డిగారు సంస్కృత రామాయణమును పఠించి, విమర్శనాత్మక దృక్పథంతో "రామాయణ విశేషముల"ను వ్యాసరాజములను ప్రకటించారు. అవే మొదట 'విభూతి'లో వెలసినవి.

ఆరునెలల అనంతరం ప్రతాపరెడ్డిగారు భాగ్యనగరం చేరుకొని రాజా బహద్దర్ వారిని సందర్శించారు. కోత్వాల్‌గారు రెడ్డిగారితో, "ఉండడానికి వస్తివా, పోయేదానికా ?" అని ప్రశ్నించారు. 'పోయేదానికే'నని రెడ్డిగారు సమాధానమిచ్చారు. 'సరే'నని కొత్వాల్‌గారు కార్యనిమగ్నులై వెళ్ళిపోయారు, రెడ్డిగారు గృహోన్ముఖులై బిస్తర్ బిఛానా సర్దుకొని మరునాడు వీడ్కోలు చెప్పడానికిగాను కొత్వాల్‌గారిని కలుసుకున్నారు. అప్పటికే రాజాబహద్దర్ మెత్తబడినారు. నుతిమెత్తగా, "రెడ్డి! నీవు ఎక్కడికి పోవద్దు ? ఇక్కడే ఉంటివో !"అని అన్నారు. అలా అయితే నాకు వకాలతు వృత్తిలో నెలకు 200 రూపాయల ఆదాయం చూపండని" అడిగినారు. "సరే మంచిదని" అందుకు తగిన ఏర్పాటు చేసినారు కొత్వాల్‌గారు. ప్రతాపరెడ్డిగారు వెంటనే హైకోర్టులో ప్రాక్టిస్ ప్రారంభించడానికి వీలుగా కోర్టువారి సనదు సంపాదించారు. సనదుపొందిన వకీలు సంపాదకుడుగా ఉండడానికి వీలులేదు కాబట్టి సంపాదక పదవికి మరొకరిపేరును పెట్టాల్సివచ్చింది. రెడ్డిగారు రాజా బహద్దర్‌గారి అనుమతితో గడ్డంపల్లి రామకృష్ణారెడ్డి గారిపేర ముద్రణాధికారమును, కొండా బాలకృష్ణారెడ్డిగారి పేర సంపాదకత్వపు పేరును మార్పు చేసినారు. పైమార్పులన్నీ చట్టరీత్యా జరిగినవే కాని ఆచరణరీత్యా అన్ని బాధ్యతలను మునుపటిలాగే ప్రతాపరెడ్డిగారు నిర్వహిస్తూనే వచ్చారు.

# వకాలతు వృత్తి

రెడ్డిగారి వకాలతు వృత్తియొక్క లోతుపాతుల కొంత నరయుదము. సురవరం వారికి స్వభావరీత్యా వకాలతువృత్తి సరిపడదు. దానిపై అభిమానంగాని, అనురాగంగాని ఏకోశానా లేదు. అందునా హైద్రాబాదులో, గాసట బీసట తురకంలో వాదించుట రెడ్డిగారికి ఏమాత్రమూ నచ్చకుండెడిది. వకీళ్ళు అనబడు వ్యక్తులకు అధికారులతో స్నేహముచేయుట, వాళ్ళను లోబరచుకొనుట, లేనిపోని డాంబికాలకు పోవుట, ప్రజాహిత కార్యములకు దూరముగానుండుట; గడుసు దనమును ప్రదర్శించుట, సత్యాసత్యములందు విచక్షణచూపకుండుట మొదలగు చేష్టలన్నీ రెడ్డిగారి ప్రవృత్తికి చుక్కెదురు. పైనుదాహృత సుగుణాలన్నీ ఒంట బట్టనిదే ప్రాక్టిస్ పకడ్బందీగా సాగదు, పైసా చేజిక్కదు; వకీలు రాణించడు. ఇక కింకర్తవ్యము? కోత్వాల్‌గారి మాటను మన్నించి, రాజా బన్సీలాల్ మోతీలాల్‌గారు నెలకు వందరూపాయలు వారి ఇస్టేట్ వ్యవహారములను చూడడానికి ఇస్తూవచ్చారు. రాజా శివరాజ్ బహద్దర్‌గారి సంస్థానానికి బన్సీలాల్‌గారు కార్యనిర్వహణాధికారిగా నుండుటవలన పై సదుపాయం సమకూరినది. బన్సీలాల్‌గారు జీవించియున్నంత కాలము రెడ్డిగారికి వకాలతు బాపతుడబ్బు ముట్టడమేగాక మరికొన్నిసంస్థానపు కేసులుకూడ లభ్యమవుతూ వచ్చినవి. వారిమరణానంతరము సంస్థానపు కేసులుపోయినవి, మాసిక వేతనంకూడ నిలిచిపోయింది. రాజా బహద్దర్‌వారు ఏర్పాటుచేసిన మాసిక వేతనరూపపు ఫీజుతప్ప రెడ్డిగారికి వకీలుగా లభ్యమైనడబ్బు అంతంత మాత్రమే! అందువలన ప్రతాపరెడ్డిగారు వకీలువృత్తి యనబడు బలవంతపు బ్రాహ్మణార్థమును ఎంతోకాలం నిలుపుకోలేదు. రెడ్డిగారు చిన్నాయనగారి బలవంతముపై వకాలతువృత్తికి పట్టమైతే



దిన్యాయువా ప్రతాపరెడ్డి

కట్టినారుగాని పట్టుమని పదికాలములపాటు సరదాగా కోర్టుకాపురం వేయలేక పోయారు. వకాలతు వగలాడితో సౌమ్యుడైన సురవరం వారికి కాపురం ఎలా కలిసివస్తుంది? అందుకే వకీలువృత్తికి తిలోదకాలిచ్చి మళ్ళీ యథా ప్రకారం తన "గోలకొండ"లో ప్రవేశించారు.

# 8

# సంపాదకుని సమస్యలు

రెడ్డిగారు వకాలతువృత్తికి తిలోదకాలిచ్చి మళ్ళీ గోలకొండలో ప్రవేశించారు. గోలకొండ తనకొరకే పుట్టిందని సురవరం వారన్నమాట అక్షర సత్యము. గోలకొండ పత్రికతో ప్రతాపరెడ్డిగారికి జన్మాంతర బంధం, అనురాగాల అనుబంధం ఉందనుటలో విప్రతిపత్తి లేదు. ఇరువైమూడు వసంతాలు అవిశ్రాంతంగా కృషిచేసి దినదినగండం నూరేండ్లాయువుగా వర్ధిల్లిన గోలకొండ ద్వైవార పత్రికను దినపత్రికగా మార్చి స్వయంపోషక స్థితికితెచ్చిన రెడ్డిగారి శక్తియుక్తులకు జోహారు లర్పింపకతప్పదు. పత్రికారచన చరిత్ర పుటలలో సురవరంవారికి మాసిపోని, మరపురాని స్థానం ఉండగలదనుటకు సందేహంలేదు.

గోలకొండ పత్రికాలయమొక సౌధరాజమై యుండవచ్చుననే భావం యీనాటి పాఠకులకు కలుగుటకు ఆస్కారం కలదు. గోలకొండ పత్రికాలయం ట్రూప్‌బజార్‌లోగల ఒక చిన్న పెంకుటింట్లో ఒకప్రక్కన ముద్రణ యంత్రము, మరొక మూలన బైపు కంపోజుచేయు అక్షరమాలిక పెట్టెలు, ఇంకో కోనలో ప్రతాపరెడ్డిగారి గది. ఆ గదిలో రెండు పుస్తకాల బీరువాలు, ఒకబెంచి, ఒక మేజుబల్ల మరొకపాతకుర్చీ రెడ్డిగారి ఆసనము. గదిగోడలపై వేదం వెంకటరాయ శాస్త్రిగారిది, అళియ రామరాజుగారిది, వీరరసం ఉట్టిపడు మీసాల కృష్ణమూర్తిది ఫోటోలు వ్రేలాడుతుండేవి. అదే గోలకొండ పత్రికాలయము, ప్రచురణాలయమూను. అదియే కోటి తెలుగన్నల పవిత్రాలయము. యువకులు, కవిపుంగవులు, పండిత ప్రకాండులు, నాయకులు, ఆచార్యవర్యుల కదొక దివ్యాలయము. అక్కడే అభివృద్ధి పక్షము, విజ్ఞాన వర్ధనీ పరిషత్తు, ఆంధ్రసారస్వత పరిషత్తులాంటి రాజకీయ, వైజ్ఞానిక, సారస్వత సంస్థలు పుట్టి పెరిగినవి.

ఆంధ్ర పితామహులగు మాడపాటి హనుమంతరావుగారు, డా॥బూర్గుల రామకృష్ణారావుగారు, ఆచార్య రావాడ సత్యనారాయణగారు, ఆదిరాజు వీర భద్రరావు గారు, చిదిరె మఠం వీరభద్ర శర్మగారు, దేవులపల్లి రామానుజ రావుగారు, అనుముల, పెండ్యాల, కప్పగంతుల, చెలమచర్ల, పల్లెర్ల లాంటి అతిరథ మహారథులెందరో అనుదినం విద్వద్గోష్ఠిలో పాల్గొంటుంటె, ప్రతాపరెడ్డిగారు అధ్యక్షపీఠంపై అపరంజిలా వెలిగేవారు. అతని కన్నివిష యాల్లో ఆకళింపు ఉండేది అన్ని రంగాల్లో ప్రమేయం ఉండేది. సంగీతం సాహిత్యం, చిత్రకళ, వాస్తుశాస్త్రం, ఆయుర్వేదం; దేనిపై చర్చ జరిగినా అందు తానున్నాడనిపించు కోవడమేగాక, కొసరుగా సరికొత్త విషయాలు రెండు చేర్చి అధ్యక్షహర్యక్షుడనిపించుకునేవారు.

రెడ్డిగారు బహుభాషా కోవిదులు. తెలుగు, సంస్కృతం, కన్నడం, ఉర్దు, ఫార్సి, ఆంగ్లం, హిందీ భాషలలో ఆరితేరిన ఘనుడు. అతని లేఖినిలో కన్నడభాషాపోకడలున్నాయని బూర్గులవారే అంగీకరించారు. అగ్నికి ఆజ్యం తోడైనట్లు రెడ్డిగారిలో నిబిడమైయున్న ప్రతిభావ్యుత్పత్తులకు, సార స్వతానురక్తికి, పాండితీగరిమకు దీటగునట్లు "గోలకొండ పత్రిక" సాధన మాతృకగా లభించినది. పత్రికా సంపాదకుడుగా షుమారు పాతిక సంవత్స రాలు అకుంఠిత దీక్షతో, అశేషప్రతిభతో, అనుపమ ధైర్య సాహసములతో, నిద్రాణమైయున్న తెలంగాణీయులను వెన్నుతట్టి జాగృతంచేసిన వైతాళికుడు. అంతటి ప్రజ్ఞాపాటవములు కలవారు కనుకనే గోలకొండ దినదిన ప్రవర్ధ మానమై ''ఆంధ్ర పత్రిక''కు దీటుగా అంతకంటె సంక్లిష్టమైన సాంఘిక, రాజకీయ, ఆర్థిక దుస్థితినెదుర్కొని దేదీప్యమానంగా విరాజిల్లినది.

రెడ్డిగారి సంపాదకత్వపు రోజులు నిజామునాజీల కసాయిరోజులు, పత్రికా స్వాతంత్ర్యము కరువైనరోజులు; సాంఘిక చైతన్యము నిదుర లేవని రోజులు; వ్యక్తి స్వేచ్ఛ వక్రించిన రోజులు; మిన్నుమన్ను కానరాని కటిక చీకటి రోజులు. అలాంటి గడ్డు పరిస్థితులలో రెడ్డిగారి రచనలు దివ్యజ్యోతులై ఆరని వెలుగులై, ఆణిముత్యములై ఆబాలగోపాలము కన్నులు మిరుమిట్లు గొలిపిన అపరంజి వెలుగులై ప్రకాశించినవి.

"సుకవితా యద్యస్తిరాజ్యేనకిమ్"అని ఆచరణరీత్యా ప్రకటించిన పౌరుషశాలి శ్రీ ప్రతాపరెడ్డి. రాజా బహద్దర్‌లాంటి మహామహుల ప్రాపక ముండియూ, ఉన్నత విద్యావంతులయ్యూ, శక్తి సామర్థ్యములుండియూ, ప్రభుత్వోద్యోగము నాశింపని అభిమానధనుడు శ్రీ సురవరము. గాంధీగారి అహింసాతత్త్వమును, ఆత్మాభిమానమును, జాతీయాభిమానమును, దేశగౌరవ మును నరనరాల్లో జీర్ణించుకున్న అకలంక దేశభక్తుడు. స్వస్థాన దేశాభిమా నము వారికున్నంత సాటివారికరుదు. వారు త్రికరణశుద్ధిగా ఆంధ్రమహాజను లను, ఆంధ్రదేశాన్ని, ఆంధ్రభాషను అభిమానించి ఆరాధించిన ఆరాధ్యుడు. స్వదేశ, స్వరాష్ట్ర, స్వజాతీయ సంప్రదాయాభిజాత్యములు వారి వ్యక్తిత్వమున కొక వైశిష్ట్యము నాపాదించినవి. హేమాహేమీ లనదగు పెద్దలంతా ఆనాడు తురక వేషభాషలందు తలదూర్చి తమ్ముతాము కాపాడుకొనెడివారు. రూమీ టోపీలు, బేల్‌దార్ శేర్వానీలు, చుడీదార్ పైజామాలు, సలీమ్‌షాహీ జూతాలు ఆనాటి లౌకికుల రాజదుస్తులు. అలాంటివేషాల్లో ఎందరో ఘరానా కుటుంబీకులు అపర నవాబుల్లా తిరుగుతుంటే, ప్రతాపరెడ్డిగారు మాత్రము ఖద్దరు ధోవతికట్టి, ఆజానులంబి కూర్పాసముధరించి, ధవళకాంతుల నీను కోరతలపాగచుట్టి, కోరమీసములతో అపరప్రతాపుడై పురవీథుల నడుస్తుంటే నవాబుల కోరచూపుల్లో అరుణిమలు తొంగిచూచెడివి.

రెడ్డిగారు స్వేచ్ఛాస్వాతంత్ర్యములకు బంధువులు, నిరంకుశాధి కారమునకు ధూమకేతువులు. ఆ నిరంకుశాధికారము నిజాము నవాబుదైనా గ్రామ పెత్తందార్లదైనా యీసడించుకొనెడివారు. రెడ్డిగారు రైతుబాంధవుడు పదహారణాల రైతుబిడ్డ, ప్రజలమనిషి, స్వచ్ఛమైన ప్రజాస్వామ్యమునకు పట్టుగొమ్మ. ప్రజాపీడుతులైన ప్రభువులు, ప్రజావంచకులకు దొరలు ఉండ రాదని తన కలంపోటుతో తెలియజేసిన దిట్ట. రెడ్డిగారు గోలకొండ పత్రిక లోను తదితర పత్రికలలోను కొన్ని గుప్తనామములతో వ్యాసములను, కథ లను, విమర్శనలను వ్రాస్తూ పాఠకుల కుతూహలమును కుతకుతలాడించి

ఉత్సాహమును ఉసిగొల్పెడివారు. వారు ముఖ్యంగా చిత్రగుప్త, భావకవి, రామ్మూర్తి, యుగపతిసింహ అనుపేర్లను అధికంగా ఉపయోగించారు.

ఎన్నో వాదాత్మక సమస్యలను లేవనెత్తి 'గోలకొండ'ను వాదోపవాదోల్లాస వేదికగా ఉపయోగించి ప్రజలకు విజ్ఞాన వికాసాలనందించేవారు. తాము సంపాదకులము గదాయని రెడ్డిగారెన్నడూ తమ భావాలకే ప్రాముఖ్యతనిచ్చి అన్యుల అభిప్రాయములను త్రోసిపుచ్చెడివారు కాదు. ''వాదే వాదే జాయతే తత్త్వ బోధః'' అనునదే రెడ్డిగారి అభిమతము. ప్రత్యర్థి భావాలు ఎంత అప్రతిహతంగా ఉంటే, అంతటి పతాక శీర్షికనిచ్చి, పత్రికలో ప్రముఖ స్థానమిచ్చి ప్రోత్సహించడమేకాక, తద్వాద ఖండనకు మరొక మహానుభావుడిని ప్రోత్సహించి పత్రికా ముఖమున కెక్కించెడివారు. రెడ్డిగారు వాదప్రతివాదములను కేవలం సత్యదృష్టితోనే వీక్షించెడివారు. విషయము కూలంకషంగా పరిశీలించి శల్యపరీక్ష చేయనిదే సరియగు నిగ్గు తేలదను అభిప్రాయము రెడ్డిగారిది. ఏదో ఒక వ్యాసాన్ని గుప్తనామముతో వ్రాసి ఎవరో ఒకవ్యక్తిని అపహాస్యముపాలు చేయనిదే వారికి తోచెడిది కాదు. ఒకతడవ ''జంగములు బ్రాహ్మణులు కారను'' వ్యాసాన్ని వ్రాసి గోలకొండ శిఖరాని కెక్కించారు. దానిని చదివిన చిదిరెమఠం వీరభద్ర శర్మగారి అరికాలిమంట నెత్తికెక్కింది. వాదోపవాదములు, ఖండన మండనములు, తర్జన భర్జనలు చెలరేగినవి. వ్రాయసగాండ్రన దగిన దిగ్దంతులంతా తమ సునిశిత భావ శర పరంపరలచే ప్రతికక్షుల వాదాంశములను పూర్వపక్షం చేయడానికి కృతనిశ్చయులై రంగంలోకి దూకారు. అవి వాదోపవాద రూపంలో వికసించిన రసఝురులు. వక్రోక్తులు, వ్యంగ్యాలు, ధ్వనులు, ధ్వన్యాభాసములు ఎన్నో ఇంకా ఎన్నో ఛలోక్తులతో నిబిడమైయున్న వారి వ్యాస పరంపరలు పఠించిన రసజ్ఞుల హృదయాలు తన్మయత్వంలో తేలియాడినవంటె అతిశయోక్తి లేదు. అలా వారముల తరబడిసాగిన వారి వాదోపవాదముల ఫలితంగా జంగములకు బ్రాహ్మణుల శ్రేణి లభ్యమైందో లేదో ఇంగితజ్ఞులెరుగరు కాని, తత్పర్యవసాన ఫలి

తంగా 'గోలకొండ' ప్రాచుర్యము హిమవత్తుంగంలా పెరిగి బహుజనాదరణ పాత్రమై అలరారినది. రెడ్డిగారి సంపాదకత్వంలో గోలకొండ ఒక ఆదర్శ ప్రాయమగు ప్రజాభిప్రాయ వేదికగా రూపొందినది. ఒక తడవ పింగిలి వెంకటరామా రెడ్డిగారు శాకాహారమును ప్రచారము చేయుటకుగాను మాంసాహార భక్షణమును ఖండిస్తూ కొన్ని వ్యాసములు వ్రాసి గోలకొండలో ప్రచురించారు. ప్రతాపరెడ్డిగారు స్వయాన శాకాహారియే ఐనా మాంసాహారము వలన కలుగు శారీరక లాభముల నుగ్గడిస్తూ గుప్తనామంతో పింగిలివారి వాదాన్ని తునాతునియలు చేసినారు. మరొకతడవ ఒక అభ్యుదయ భావాలు కల యువకుడు తెలుగు మాగాణంలో తౌరక్యాంధ్రులు ప్రబలి పోతున్నారని పద్యములువ్రాసి ప్రతికక్షుల నాఘాతపరచారు. రెడ్డిగారా వ్రాతలను బూర్గులవారికి చూపిస్తూ, "చూశావా ! ఈ కుర్రకారు దురుసుగా కలం నడిపి నిరంకుశ పదప్రయోగం చేశాడు. నీవు చూస్తూ చూస్తూ ఊరోకవడం భావ్యం కాదని" రావుగారికి కరి ఎక్కించి పురికొల్పి వారిచేత ఘాటైన పద్యాలు వ్రాయించి పత్రికలో ప్రముఖ స్థానమిచ్చి ప్రచురించి, ఆ యువకుని అపహాస్యంపాలు చేశాడు. అసలు రహస్యమేమంటే అలా పద్యాలు వ్రాసిన యువకుడు ఎవరోకాదు ; ప్రతాపరెడ్డిగారి శిష్య పరమాణువే ! వారు నెల కొల్పిన అభివృద్ధిపక్షం యొక్క సభ్యుడే ! బూర్గులవారు అవతలి పక్షపు అతిరథుడు కాబట్టి వారిచేత సమాధానం వ్రాయించి ప్రకటించి, స్వపర భేద భావం తనకులేదని రెడ్డిగారు ఆచరణరీత్యా రుజువు చేసికొనెడివారు. వారి రచనలో ఎక్కడా వ్యక్తి దూషణకాని, కాలుష్యంకాని ఉండేదికాదనీ; వాద ప్రతివాదముల వాడినీ, వేడినీ, వైయక్తిక స్నేహంలో జొప్పించి, సహృదయుల మనస్సును మలినము చేసెడివారు కాదనీ; ప్రతాపరెడ్డిగారు తమ ఔదార్య గుణరాశితో పత్రికారచనకే ఉదాత్తమైన వరవడినిపెట్టి పత్రికా రచనా రంగంలో అగ్రగాములైనారని బూర్గుల రామకృష్ణారావుగారు ఉద్ఘాటించారు.

మరొక సందర్భంలో రెడ్డిగారు "స్త్రీలకు స్వాతంత్ర్య మవసరమా?"

అను శీర్షికపై వ్యాసం వ్రాస్తూ స్త్రీలకు పురుష సమాజంలో స్వాతంత్ర్య మనవసరమే కాకుండా అనర్థదాయక మని ఎంతో ఘాటుగా బహుశా ఈ నాడీ శీర్షిక అర్థరహితము, అనర్థదాయాకమూ కావచ్చునేమో కాని, నలుబది సంవత్సరాల క్రిందట, నిజాముగారి రాజ్యంలో, హైందవ స్త్రీలకే బురఖాలను తొడిగిన రోజుల్లో, యువతులను ముల్లే మూటల క్రింద పరిగణించే రోజుల్లో, పురుష పుంగవులకే వ్యక్తి స్వేచ్ఛ మృగ్యమైన రోజులలో, స్త్రీలయొక్క స్వేచ్ఛా స్వాతంత్ర్యముల మాట చెప్పనేల ? ఆ నాడు తెలంగాణములో విద్వాంసులైన విదుషీ మణులుండుటే అపురూపము అథవా ఉన్ననూ, ప్రతాపరెడ్డిగారి వ్యాసాన్ని ఖండించే ధైర్యము, విజ్ఞ నము ఎంతటి విదుషీమణి కుండియుంటుంది ? అయిన ఎల్లాప్రగడ సీతా కుమారి గారు నేనున్నానని [illegible] కుంది. తానొక ఉపాధ్యాయినియే యైనా, స్త్రీ సమాజానికంతా ప్రాతినిధ్యం వహించి, ప్రతాపరెడ్డిగారి వ్యాస మును ఖండిస్తూ గోలకొండ శిఖరము నధిరోహించినది. విమర్శలు, ప్రతి విమర్శలు ఘాటుగా, పసందుగా సాగినవి. రెడ్డిగారు స్త్రీల పట్టుదలను పసి కట్టి తలపంకించక తప్పలేదు. "నిండు మనంబు నవ్య నవనీత సమానము, పల్కు దారుణా ఖండల శస్త్రతుల్యము" లాగుండే ప్రతాపరెడ్డిగారు తమ మనోగత భావాలనెలా దాచగలరు ? ఒకానొక ఆంధ్ర మహిళాసభ సమా వేశంలో బయటపడ్డారు. "నేను స్త్రీల స్వేచ్ఛాస్వాతంత్ర్యములకు వ్యతిరేకిని కాదు, మీలో స్వాతంత్ర్య పిపాస ఎంత ఉందో తెలుసుకోవాలనే ఉబ లాటం కొద్దీ అలా వ్రాశాను" అని చల్లగా అనగానే ఎందరు మహిళల మనంబు లుప్పొంగలేదు ! ఎందరు యువతులు రెడ్డిగారిని మనసారా అభి నందించలేదు !! మచ్చునకు కొన్ని సన్నివేశములను మాత్రమే రెడ్డిగారి స్వభావాన్ని వ్యక్తీకరించడానికి ఉట్టంకించడం జరిగింది. శతాధికంగా జరిగిన ఇలాంటి సంఘటనల్లో చిదిరెమఠం, బూర్గుల, రావాడ, అనుముల, పెండ్యాల, పింగిలి, మాడపాటి, ఎల్లాప్రగడ, ఇల్లిందలలాంటి మహామహు లెందరో పాఠకలోకాన్ని విజ్ఞాన వికాసమయ అక్షర జగత్తులో తలములకలు చేసినారు.

## గోలకొండ కవుల సంచిక

కోస్తాప్రాంతం నుండి వెలువడే ఒకానొక వారపత్రికలో తెలంగాణ ములో కవులే లేరనీ, ఉన్నవారిలో కవితాశక్తియే మృగ్యమనీ, తెలుగు మాట్లాడడమే తెలుగువారికి తెలియదని ఏమేమో వ్రాయబడింది. ఆ పత్రిక యొక్క ప్రతినొకదానిని రెడ్డిగారికెవరో చూపించారు. అందు ప్రచురించిన అంశాలను చదివిన రెడ్డిగారి అభిమానం దెబ్బతిన్నది. ఆవేశం పెరిగింది; రక్తం పొంగులెత్తింది; పౌరుషం ప్రకోపించింది. తేట తెనుగు నుడికారపు తీయదనమును చవిచూపిన పొన్నగంటి తెలగనార్యుని గోలకొండ కవితలను మరొకసారి ఆంధ్రుల కందించాలని రెడ్డిగారు సంకల్పించారు. మూలనున్న కవుల పట్టికను పైకి తీసినారు. మారుమూల గ్రామాల్లో నివురుగప్పిన నిప్పుకణాలవలె పడియున్న కవి దిగ్గజాలను, పుంగవులను, కిశోరులను, కుమారులను గోలకొండ పత్రికాలయమున కాహ్వానించి కవితల వ్రాయించారు. నగరానికి రాలేని వారి కవితల తెప్పించుకున్నారు. వారి పూర్వ కృతులనుకూడ తెప్పించారు. జాడతెలియకుండాఉన్న మారుమూలగ్రామములలో నివసించు కవులను శోధించి వారిచేత కవిత లల్లించి తెప్పించుకున్నారు. వారికన్న పూర్వమందుండిన కవుల పట్టికను, వారు రచించిన గ్రంథముల పట్టికను కూలంకషంగా సిద్ధం చేయించారు. అలా భగీరథ ప్రయత్నంతో కొన్ని మాసములు అవిశ్రాంతంగా శ్రమించి ఆశించిన పనిని సాధించారు. కొండొకనాడు "గోలకొండ కవుల సంచిక"ను ప్రచురించారు. ఆ నాడు తెలంగాణపు తెలుగు కవులకొక పర్వదినము, తెలుగుప్రజలకు గర్వదినము. గోలకొండ కవుల సంచికలో మొత్తము 183 పూర్వకవుల కవితలు, 354 ఆధునికుల కవితలూ ప్రకటింపబడినవి.

కవుల సంచికయొక్క అవతారికలో ప్రతాపరెడ్డి గారిలా వ్రాశారు. "తెలంగాణములో కవులు లేరను విడ్డూరపు అభిప్రాయములు పలుమారు వినుట, ఆ యా పత్రికలందు చూచుటయు తటస్థించినది. అయిననూ అట్టి అభిప్రాయములు అభివ్యక్తము చేయువారికి తెలంగాణముయొక్క పరిస్థి

తులు తెలియకనూ, తెలిసికొనకనూ; తెలిసికొనుటకు అవకాశము లేకనూ, అలాంటి ప్రయత్నము చేయకనూ, చెల్లని వ్రాతలు వ్రాశారే కాని అవి ద్వేష బుద్ధిచేత వ్రాయబడినవి కావని నాయొక్క నిశ్చితాభిప్రాయము."

గోలకొండ కవుల సంచిక అవతరణ తెలంగాణ తెలుగు పద్య సాహిత్యమునకొక అలంకారము, తెలుగు పద్య రచనకొక మైలురాయి. నాటినుండి నేటివరకూ అటి బృహత్తర ప్రయత్నము ప త్రికాధిపతియు సాహిత్యాభిమానియూ చేయలేదు. ప్రతాపరెడ్డిగారి పిలుపు తెలంగాణకవు కొక శంఖారావమై, కవితా విపంచికి సంక్రాంతియై వెలుగొందినది.

గోలకొండ కవుల సంచిక రెడ్డిగారి అకలంకదీక్షకు, నిరుపమ కార్య సాధనా తత్పరతకు, సాహితీ జిజ్ఞాసకు దర్పణమై నిలిచిపోయింది.

* * *

1939 సంవత్సరారంభం నుండి జూలై మాసాంతం వరకు రెడ్డిగారి ప్రశాంత జీవితమున విషాద తిమిరము లావహించినవి. చేతికందిన ఇద్దరు పుత్రులు అకాలమృత్యు వాతబడుటవలన రెడ్డిగారి హృదయము చలించినది. వారి భార్య పద్మావతీదేవిగారి ఆరోగ్యం కూడ పుత్రుల వియోగము వలన దెబ్బతిన్నది. పద్మావతీ దేవిగారి ఆరోగ్యము క్రమక్రమంగా క్షీణించుట వలన రెడ్డిగారు కొంతకాలము గోలకొండ పత్రిక కార్యభారమునకు సెలవు పెట్టి స్వగ్రామమగు ఇటికేలపాడులో నివసించాల్సి వచ్చింది. ఆ అదనునే సాకుగాతీసుకున్న కొండా బాలకృష్ణారెడ్డిగారు తాను నామమాత్రపు సంపాద కత్వ బాధ్యతలను స్వీకరించ జాలననియు, కనీసము నలుబది రూపాయల మాసిక వేతనము నిప్పించవలయుననియు, పత్రికాలయపు ఆయ వ్యయ ముల ఆజమాయిషీపై తనకే పూర్తి అధికారము ఉండవలయుననియు, ఇంకా ఏమేమో కోర్కెలను కోరియుండిరి. వాటిని సాకల్యంగా పరిశీలించిన గోల కొండ కార్యనిర్వాహక వర్గము వారు, ప్రతాపరెడ్డిగారిని రావించి, సంపాద కీయ బాధ్యతలను యథాప్రకారము చట్టసమ్మతముగా, తామే స్వీకరించవల సినదిగా కోరియుండిరి. రెడ్డిగారు యథాప్రకారము రాజా బహద్దర్‌వారి సహా

యముతో ప్రభుత్వమును అంగీకరింపజేసి, ఆగష్టు 3, 1939 నాడు గోల కొండ పత్రికను పునః తనపేరుతో ప్రకటించుకొన నారంభించారు. నాటి నుండి రెడ్డిగారికి నెలకు నూరు రూపాయల వేతనముతోపాటు, ఇంటి అద్దె మినహాయింపు సౌకర్యము, రాజా బన్సీలాల్‌గారు ఇచ్చు 25 రూపాయల మాసిక భృతితోను తృప్తి పొందవలసి వచ్చినది. తన కుటుంబమున పొడ సూపిన విషాద సంఘటనల కారణంగాను, నాటి రాజకీయరంగంలో నెల కొన్న కలుషిత వాతావరణ ఫలితముగాను, రెడ్డిగారు తమ రాజకీయ రాజ కీయేతర వ్యాసంగములను తగ్గించుకొని కచ్ఛపన్యాయమును అనుసరించి కేవలము గోలకొండ పత్రిక బాధ్యతలనే నెరవేర్చు చుండిరి. 1947 సంవ త్సరం వరకు అనగా గోలకొండ పత్రిక దినపత్రికగా రూపొందువరకు రెడ్డి గారు కచ్ఛపన్యాయ సూత్రమునే పాటిస్తూవచ్చారు.

వారి దృష్టి ఆ కాలంలో రాజకీయ రంగమునువీడి సాంఘిక, సార స్వత సాంస్కృతిక విషయాలపై ఆసక్తి చూపనారంభించినది. రాజా బన్సీ లాల్‌గారు ఇస్తూఉండిన పాతిక రూపాయలుకూడ వారి మృత్యువుకారణంగా ఆగిపోవుట వల్లనూ, సహాయ సంపాదకుని బాధ్యతలుకూడ అదనంగా తానే భరించుట వల్లనూ మరొక 50 రూపాయల మాసిక భృతి పెంచబడినది. రెడ్డి గారు గోలకొండ పత్రికలో ఉన్నంతకాలము ఎన్నడూ 150 రూ॥ మాసిక వేతనము కంటె అధికంగా స్వీకరించలేదు. 1925 నుండి 1938 సంవత్స రాల మధ్య వారి వేతనం నూటపాతిక రూకలకే పరిమితమై యుండెను.

రెడ్డిగారికి చాలినంత భూవసతి యుండియూ, ఉన్నతోద్యోగము చేయుటకు తగిన విద్యార్హతలుండియూ, రాజా బహద్దర్‌లాంటి పెద్దల ప్రాపకముండియూ, తనను పెంచి పెద్దచేసి విద్యాబుద్ధులు గరపిన రామ కృష్ణారెడ్డిగారి అభిమతాన్నికూడ ఖాతరుచేయకుండా గోలకొండను పట్టు కొని ప్రాకులాడినారంటే వారికి పత్రికారచనపై, ప్రజాసేవా తత్పరతపై, సాహితీ వ్యాసంగంపై, ఎంతటి అభిమానము, అనురాగము లుండెడివో పాఠకు లూహించుకుంటె చాలు. ఆంధ్రుల సర్వతోముఖ వికాసమే వారి

ధ్యేయము, లక్ష్యమూను. వారి రచనలు, ఉపన్యాసములు, సంపాదకీయములు అన్నీ లక్ష్యసాధన యొకటే! నాడు తెలంగాణము అభ్యుదయానికి పాటు పడిన పెద్దలందరి ఉద్దేశ్యముకూడ నదియే! రెడ్డిగారు అభివృద్ధి పక్షమును స్థాపించినా అది ఆంధ్రుల అభ్యుదయము నాకాంక్షించియే! విజ్ఞాన వర్ధినీ పరిషత్తును నెలకొల్పినా అది ఆంధ్రులలో విజ్ఞానబీజములు వెదజల్లుటకొరకే!! ఆంధ్ర సారస్వత పరిషత్తునకు శంకుస్థాపన చేసినా, అది ఆంధ్రుల సారస్వత పిపాసను ఇనుమడింప జేయుట కొరకే!!! అంతటి విశాలదృష్టి, సమ్యక్ దృక్పథము, భావనా సమైక్యత రానురాను తెలుగువారిలో తీసికట్టుగా పరిణమించడం శోచనీయము. స్వార్థాలు, సంకుచితత్వాలు, ప్రతిబింబించే ఉద్యమాలకే నేటి నాయకమ్మన్యుల ప్రక్షిప్త చేయూత లభిస్తున్నది. ఆంధ్ర ప్రదేశ్ అవతరిస్తుందని ఊహించని రోజులలోనే ఆంధ్ర మహాసభోద్యమము పేరుతో యావదాంధ్రులు ఒక్కటేనని చాటిచెప్పిన నాయకులు వారు, నాయక శబ్దమును సార్థకముచేసిన ధన్యజీవులు.

1947 సంవత్సరారంభం నుండి గోలకొండ పత్రిక దిన పత్రికగా ప్రచురింపబడింది. గోలకొండ దినపత్రికగా అవతరించడానికిముందు పత్రిక యొక్క వాటాదార్ల సంఖ్య పెంచబడింది. దానితోపాటు వాటాధనం కూడ హెచ్చించబడింది. కనీసపు వాటాధనమును వంద రూపాయలు చేశారు. అందులో ఎక్కువ వాటాలు తీసుకున్నవారు వనపర్తి సంస్థానాధీశులగు రాజా రామేశ్వర రావుగారు. గద్వాల ప్రభువులుకూడ కొన్నివాటాలు తీసుకున్నారు. అదే విధంగా పింగిలివారు, తదితర సంస్థానాధీశులు, దేశముఖులు, దొరలు అందరూ దొరికిన వాటాలు పుచ్చుకున్నారు. దిన పత్రికకు అవసరమగు పవర్ ప్రెస్‌ను తదితర పరికరాలనుకూడ సమకూర్చినారు. అనంతరము రాజా రామేశ్వర రావుగారి ఆధ్వర్యంలో రెడ్డిదొరలు సమావేశమై, మంత నములాడి ప్రతాపరెడ్డిగారిని 1948 సంవత్సరాంతములో "గోలకొండ పత్రిక" సంపాదకత్వ బాధ్యతలనుండి తొలగించి, ఆ స్థానములో నూకల నరోత్తమరెడ్డి గారిని (ప్రస్తుత ఉస్మానియా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు)

సంపాదకులుగా నధిష్ఠింప జేసినారు. నరోత్తమ రెడ్డిగారి సంపాదకత్వములో గోలకొండ పత్రిక 1968 వరకు నడచి ఆర్థికఇబ్బందుల కారణంగా నిలిచి పోయింది.

అనంతరం 1951 సం॥లో ప్రతాపరెడ్డిగారు ''ప్రజావాణి''పేర ద్వి దిన పత్రికను ప్రారంభించి రెండు సంవత్సరాలు నడిపినారు కాని, డబ్బు కొరతవల్ల "ప్రజావాణి" మూగవోయి మూలపడ్డది. పత్రికా ప్రచురణ డబ్బుతో కూడుకున్నపని. ప్రతాపరెడ్డిగారికి పత్రిక నడుపు సామర్థ్యమున్నా వేలువెచ్చించి ద్విదిన పత్రికను నిర్వహించగల ఆర్థిక స్తోమతలేదు. డబ్బు లేనిపని ఇబ్బందులతో కూడినదే కదా? రెడ్డిగారు విధిలేక పత్రికారంగము నుండి తొలగి గృహోన్ముఖులైరి. నగరంలో ఉన్నా నట్టింట ఉన్నా రెడ్డి గారి ధ్యేయము ఒక్కటే! అదే సారస్వత సేవ. ''ఆంధ్రుల సాంఘిక చరిత్ర"యను బృహత్పరిశోధనాత్మక రచనకు రెడ్డిగారు తగినన్ని పరికర ములు సేకరించి 1950 సం॥లో ఆంధ్ర సారస్వత పరిషత్తువారి సహాయంతో పరిషత్తుపక్షాన ప్రచురించారు. ఆర్థిక ఇబ్బందులు, గృహ కల్లోలములు, శారీరక అస్వస్థతలు, ఏవీ వారి కార్యసాధనకు అవరోధము కలిగించలేక పోయినవి. ధీర చిత్తులైనవారు అభీష్టములను సాధించుటలో అవాంతరము లకు తలయొగ్గి క తా మూఢులుకారు.

# 9
# రాజకీయ సేవ

ప్రతాపరెడ్డిగారి ప్రజాసేవ ప్రబోధములతో ప్రారంభమైనది. వారు రెడ్డిజన సంఘ కార్యదర్శిగా నున్నప్పుడు విద్యార్థుల అభీష్టము ననుసరించి అడపాతడపా విద్యార్థులకొరకు ఉపన్యసిస్తూ ఉండెడివారు. అదైనా కాగితములపై వ్రాసుకొని క్రమబద్ధంగా వ్రాసుకొని, ఏతదంశాలనే విపులీకరించి విద్యార్థులకు బోధించెడివారు. ఆ నాడదే ఘనకార్యము. ఆ విషయము ఆనోటా ఆనోటాపడి మాడపాటి హనుమంతరావుగారికి కూడ తెలిసింది. రావుగారు రెడ్డిగారిని వెతుక్కుంటూ వచ్చారు. ఆంధ్ర పితామహునిలో ఉన్న గొప్పతనమదియే : ఎక్కడ సామర్థ్యం కల యువకులూ, కార్యదీక్షా పరాయణులూ, సేవా తత్పరతా స్వభావులు గోచరించినా మాడపాటివారు తామే స్వయంగా వారివద్దకు వెళ్ళి, వారికి పనికల్పించి, తమ ఆంధ్రోద్యమ కార్యక్రమాన్ని నిర్వహించెడివారు. మాడపాటి వారెన్నడూ తగుదునమ్మాయని తామే పట్టము కట్టుకొనలేదు. పనులు నిర్వహించుటలో తాము ముందుండి పట్టము మాత్రము మరొకరికి కట్టి మురిసిపోతుండెడివారు. అందుకే ఆంధ్ర పితామహులు అందరికీ గురుతుల్యులైనారు. ప్రతాపరెడ్డి గారికి మాడపాటి వారు రాజకీయ గురువు. రెడ్డిగారు అభిమానించి గౌరవించిన వ్యక్తి రాజకీయ రంగంలో ఒక్క హనుమంతరావు గారే!

మాడపాటివారు ప్రప్రథమంగా 1925 సం॥లో ప్రతాపరెడ్డిగారిని సందర్శించి పరిచయం చేసికొని శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషా నిలయంలో సభ నేర్పాటుచేయించి "నిజాం రాష్ట్రాంధ్రులు" అను శీర్షికపై ఉపన్యసించవలసిందిగా కోరియుండిరి. రెడ్డిగారికి మొదట ఆ సభయొక్క గొప్పతనమూ, అందు ఉపన్యసించుటవలన తన వ్యక్తిత్వమునకు పెరిగే గౌరవమును

వేయలేక పోయారట. సభ ఇంకా రెండురోజులుండగనగా రెడ్డిగారు పై నుల్లేఖిత శీర్షికపై చక్కని వ్యాసమును సిద్ధముచేసికొని సభలో గంటన్నరసేపు అనర్గళంగా గ్రాంథిక భాషలో ఉపన్యాసము దంచినారట. నాటిసభకు పింగిలి వెంకట రామారెడ్డిగారు అధ్యక్షులు. మాడపాటివారు కూడ సభాంతమున కృతజ్ఞతలు తెలుపు ఉద్దేశంతో లేచి సుమారొక గంట న్నర ఉపన్యసించి ప్రతాపరెడ్డిగారి ఉపన్యాసమును ఎంతో ప్రశంసించినారట. ఆదిలో రెడ్డిగారు తమ ఉపన్యాసములను గ్రాంథికభాషలో నడిపించినా రాను రాను వ్యావహారిక భాషలోనే ఉపన్యాసముల నివ్వడం ప్రారంభించారు. మొదట రెండు మూడు పర్యాయములు ఉపన్యాసాంశములను క్లుప్తంగా వ్రాసుకొని ప్రసంగించినా కొంత కాలమునకు అట్టి అలవాటుకు స్వస్తిచెప్పి సమయ సందర్భములననుసరించి ఏమి తోచిన దానినే తటపటాయించకుండా ప్రసంగించెడివారట. అలాగని రెడ్డిగారు అధికప్రసంగము గాని, అప్రస్తుత ప్రసంగము గాని చేసియెరుగరు. ఎప్పుడు ఏమిచెప్పినా, అందులో ఒక అందం, ఒక క్రొత్తదనం తొణికిస లాడెడివి.

శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషానిలయోపన్యాసంతో ప్రారంభించి, రెడ్డిగారిని మాడపాటి వారు క్రమంగా రాజకీయ రంగంలోకి దింపి తమ ఆంధ్రోద్యమానికి చేదోడువాదోడుగా నిలుపుకున్నారు. 1929 సం॥లో నల్లగొండ జిల్లా సూర్యాపేటలో జరిగిన ఆంధ్రమహాసభలలో ప్రధానపాత్ర వహించి ప్రతిభావంతు డనిపించుకున్నారు. అచట నిర్వహింపబడిన వర్తక సభలో, గ్రంథాలయ సభలో, యువజన సభలో, సంఘసంస్కార సభలో ప్రసంగించిన ప్రతాపరెడ్డిగారు పలువురి మన్ననలకు పాత్రులైనారు. రాజకీయ సభలలో వర్తక సంఘాలేమిటని, అందు నాయకులు ప్రసంగించడ మేమిటని యీ నాటి పాఠకులకు సంశయాలు కలుగవచ్చు. ఆ నాడు రాజకీయసభ లెచ్చట జరిగినా, వాటి నెవరు నిర్వహించినా, అవి వర్తకసంఘాల చాటున, గ్రంథాలయోద్యమాలమాటునా, యువజన సభల మరుగునా జరిపించుతూ, ప్రజానీకంలో రాజకీయ చైతన్యం తేవడానికి నాయకులు తంటాలు పడేవారు.

ఇలాంటి విషయాలెన్ని ఏకరువుపెట్టినా, అసలు ఆ రోజుల్లో నిజాము రాష్ట్రంలో నెలకొనియున్న సాంఘిక, రాజకీయ, పరిస్థితులను కొంత వరకైనా యీనాటి పాఠకులకు రుచి చూపనిదే, నాటి నాయకులు అనుభ వించిన కష్టాలు, ఎదుర్కొన్న ఇబ్బందులు అవగతముకావు. కనుక ఇచట ప్రతాపరెడ్డిగారి వ్రాతలనే ఉట్టంకించి నాటి తురకరాజుల దుష్ట పాలనా హయామును విశదీకరిస్తాను.

"నిజాముల్ ముల్క్ మీర్ ఉస్మానలీ ఖాన్ ఆసఫే సాబె అను ఏడవ నిజాము తరము నవాబు హైద్రాబాదు రాష్ట్రాన్ని 1913 నుండి 1948 సెప్టెంబర్ మాసాంతంవరకు పాలించాడు. అనగా ఇతడు 35 సంవత్సరాలు నిరంకుశంగా, నిరాఘాటంగా, పాలించి ప్రజాకంటకుడుగా కీర్తి ప్రతిష్ఠల నార్జించాడు. ఇతడు అత్యంత ఇస్లాము మతాభిమాని. అందుచేత ఇతని ప్రభుత్వ కాలమంతయు ముస్లిముల ఆధిక్యతకు వినియోగింపబడి, హిందు వుల రాజకీయ. సాంఘిక హక్కులన్నియు నామమాత్రావశిష్టములుగా పరిణమించినవి. ఇతడు ఔరంగజీబు పరిపాలనా పద్ధతుల నవలంబించెను. ఔరంగజీబు అరబ్బీ, ఫారసీభాషల ప్రాబల్యమునకు ప్రాముఖ్యతనిచ్చెను. ఇతడు ఉర్దు,అరబీ, ఫార్సీభాషలను పోషించెను. ఔరంగజేబు హిందువుల పాఠ శాలలను మూయించెను; ఇతడుకూడ ప్రభుత్వానుమతి లేనిది ప్రాథమిక పాఠశాలలుకూడ ప్రారంభించకూడదని ఫర్మాను జారీచేసెను. ఔరంగజీబు మంచి దేవాలయములను నాశనముచేసి శిథిలమైనవాటిని పునరుద్ధరించ రాదనెను; ఇతడుకూడ కొన్ని మంచి దేవాలయములను మసీదులుగామార్చెను. ఔరంగజీబు హైందవులను తురకమతమును స్వీకరించుటకు బలాత్కరించెను; ఇతడు హరిజనులను ముస్లిములుగా మార్చుటకు సామ, దాన, భేదో పాయములను ప్రయోగించెను ఇతడన్ని ప్రభుత్వోన్నత పాఠశాలలలో "అఖ్‌లా ఖియాత్" అను పాఠ్య పుస్తకంద్వారా ఇస్లాం మత ప్రబోధము నకు ప్రోత్సాహము కలిగించెను. నిజాము రాష్ట్రమునకొక జాతీయగీతమును మీర్ ఉస్మాన్ అలీఖాన్ గారే రచించారు. ఇతడిని "అమీరుల్ మోమిన్"

అనగా భక్తులపాలిటి మకుటముగా జాతీయ గీతికలో శ్లాఘించిరి. భారత దేశంలోను, అరబిస్తాన్ లోను నడుపింపబడుతున్న అరబ్బీ, ఫార్సీ భాషలను బోధించు పాఠశాలలకు సాలీనా కొన్నిలక్షల ద్రవ్యమును వ్యయంచేసిరి. ప్రభుత్వానుమతి లేనిది ప్రజలకు ఏలాంటి సభలు, సమావేశములు జరుపుకొనుటకు అధికారము లేకుండెను. ఒకవేళ ప్రభుత్వానుమతి లభించినా, అది అష్టదిగ్బంధనములతో కూడి యుండెను. అదికూడ అడిగిన ఆరు వారాలకు లభిస్తె లభించినట్లు లేకుంటె లాకేత్వమే! హైద్రాబాదు రాష్ట్రంలో ప్రజలంటె నిర్వచనం హిందువులనియే! తురకలు ప్రజలను పద నిర్వచనం లోకి రారు. అందుకే వారికి అన్ని విషయాల్లోను సంపూర్ణాధికారము లభించియుండెను. పత్రికలను ప్రచురించుటకు ప్రభుత్వానుమతి లభించకుండెడిది. అథవా దొరికినా, అందు రాజకీయములను చర్చించగూడదు. తురకం తప్ప అన్యభాషల్లో ప్రచురింప బడుతున్న పత్రికలపై పోలీసునిఘా యుండెను. నిజామును, నిజాముప్రభుత్వాన్ని తుదకు తురకలనుకూడ విమర్శించు అధికారము పత్రికలకు లేదు. అలా వ్రాసిన పత్రికలను బయటినుండి రాష్ట్రములోనికి రాకుండా నిషేధించెడివారు. గట్టిగా మాట్లాడే వ్యక్తులనుకూడ బయటనుండి హైద్రాబాదులోనికి రానిచ్చేవారు కాదు. ఒకవేళ అలాంటివారే రాష్ట్రంలో ఉంటే వారిని దేశ బహిష్కృతులను చేసి నానా బాధలకు గురిచేసెడివారు. అధికారియైనా, ధనాధికారియైనా తురకవేషంలో ఉంటెనే రక్షణ ఉండెడిది. లేకుంటె వారిగతి అధోగతియే! గాంధీటోపిని చూచినా, ఖద్దరు గుడ్డలను వీక్షించినా కండ్లలో నిప్పులు పోసుకునేవారు. వాళ్ళు రైలు దిగిందిమొదలు మళ్ళీ తిరుగు ప్రయాణం సాగించు వరకు పోలీసు గూఢచారులు వారి వెన్నంటి తిరుగుతూ వారి పుట్టు పూర్వములను ఆరాతీసి, వాళ్ళ దినచర్యలను గమనిస్తూ ఉండేవారు.

1940 వరకు నిజాం రాష్ట్రంలో దొరలు, దేశముఖులు, జాగీర్దార్లు, విద్యాధికులు అందరూ తుర్కీ టోపీలుపెట్టి, షేర్వానీ పైజామాలు తొడిగి వాటి ముసుగులో తిరిగేవారు. హిందువులు మాతృభాషలో మాట్లాడ లేక,

మాట్లాడరాక తురకంలోనే సంభాషించు కొనెడివారు. ఉద్యోగాలలో 95 శాతము తురకలకే లభించెడివి. నిజాం ప్రభువు సుమారు 40 సంవత్సరాల క్రితం ఉర్దూపత్రికలో ఒకగీతమును ప్రచురించెను. దాని అర్థము ఇట్లున్నది ''మా నవాబుయొక్క ధ్వనిచే శంఖము పగిలిపోయెను. మా మత నాదము అజాన్(కూత) వెడలగానే జంధ్యములు పుటుక్కున తెగిపోయెను.'' ఇలాంటి దుష్టోపమానములతో ఆ గీతముయొక్క అర్థము ఇమిడియున్నది. చిలికి చిలికి గాలివాన యైనట్లు వారి మతోన్మాదము శృతిమించుచున్న తరుణంలో హైందవులు విధిలేక పోరాటమున కుద్యుక్తులైరి. 1935 సం॥లో బ్రిటిష్ ప్రభుత్వమువారు ద్వంద్వ పరిపాలనా విధానమును ప్రతిబింబించు రాజ్యాంగ చట్టమును ప్రవేశపెట్టి ప్రజాస్వామ్య పరిపాలనకు ప్రోద్బలము కలిగించి యుండిరి. దానిని ఆసరాగా తీసికొని హైద్రాబాదు రాష్ట్రంలో కూడ రాజ్యాంగాధికారములు కావలయునని ప్రజలు ఆందోళనము చేయదొడగిరి. హైద్రాబాదు ప్రజాపరిషత్తును స్థాపించి, అందు ''నెహ్రూ నివేదిక''లాంటి దొక రాజ్యాంగ ప్రణాళికను సిద్ధముచేసిరి. దీని నరికట్టుటకై ప్రభుత్వము, ప్రభుత్వవరేణ్యుల అండదండలతో ముసల్మానులు ''ఇత్తెహాదుల్ ముస లీమీన్'' అనునొక మతసంస్థను 1937 సం॥లో స్థాపించారు. ఆ సంస్థకు బహద్దర్ యార్ జంగ్ అనువాడు నాయకుడాయెను. నాటినుండి హైద్రాబాదు చరిత్ర యంతయు ''ఇత్తెహాద్'' చరిత్రగా రూపొందెను. 1939 సం॥నుండి హిందువులు సత్యాగ్రహమును ప్రారంభించిరి. తురక ప్రభుత్వము దానిని రెండు నెలల్లో నేలమట్టముచేసెను. ఆ ఉద్యమముతోపాటు ఆర్య సమాజము వారు భారత దేశమునుండి వందలకొలది వాలంటీర్లను రాష్ట్రము లోని కంపి జైళ్ళను నింపిరి. ఈ పరిణామముతో ఇత్తెహాద్ వారు మరింత బరితెగించి, విశృంఖలంగా ప్రవర్తిస్తూ నానాహంగామా చేస్తూ ఆందోళనము లేవదీసిరి. అంతలో బహద్దర్ యార్ జంగ్ చచ్చెను. నిజాము నవాబు స్వయంగా వాని ఇంటికివెళ్ళి శవమును దర్శించి, బేగం యార్ జంగ్ గారికి తమ దుఃఖ మును వెల్లడించిరి. అనంతరం రెండు మాసములవరకు నిజాముగారే

స్వయంగా తురక పత్రికల్లో వ్యాసాలు వ్రాస్తూ ఇత్తెహాద్‌యొక్క భవిష్య త్కార్యక్రమమునకు సూచనలిస్తూ ఉండిరి. అన్నిటికన్న విచిత్రమైన విషయమేమనగా బహద్దర్‌ఖాన్ బ్రతికియుండగనే నిజాముగారు ఇత్తెహాద్ వారికొక ప్రమాణ పత్రము (తయకున్నాత్) వ్రాసి ఇచ్చెను. దానిని రహస్య ముగా ఎనిమిది సంవత్సరాలు దాచియుంచిరి. అంతకన్న ఎక్కువకాలము దాచలేకపోయిరి. భారతదేశమునకు స్వరాజ్యం వచ్చినాక, సర్ మిర్జా ఇస్మాయిల్ హైద్రాబాద్ రాష్ట్రమునకు ప్రధానిగానున్న కాలంలో హిందువు లకు అధిక శాసన సభ్యత్వస్థానము లిత్తురేమోయన్న భయంతో ఇత్తెహాద్ వారు "మాకు మా ప్రభువులిచ్చిన రహస్య వాగ్దాన పత్రమును చూడండి" అని దానిని ప్రకటించారు. ఈ విధంగా నిజాముగారు ప్రత్యక్షంగాను, పరో క్షంగాను హైందవులకు వ్యతిరేకంగా, తురకల కనుకూలంగా ఉంటూ తమ నిరంకుశపాలనను ముప్పదియైదు సంవత్సరాలు కొనసాగిస్తూ వచ్చిరి.

అంతలో ఖాసిమ్ రజ్వీయను ఒక సాధారణ జిల్లావకీలు తటాలున ఇత్తెహాదు రంగంపైకి ఎక్కెను. హిట్లరెట్లు వెలిగెనో, ముసోలినీ ఎట్లు ఎగిరెనో అదే చందమున ఖాసిం రజ్వీ మూడుసంవత్సరాలు హైద్రాబాదు రాజకీయ రంగంపై దేదీప్యమానంగా ప్రకాశించినాడు. రజాకారు (దేవుని సేవకుడు) ఉద్యమాన్ని లేవదీశాడు. హైద్రాబాదులోగల మిలటరీ, పోలీసు బలగమంతా రజాకారులతో చేతులు కలిపినారు. వీరంతా తోడుదొంగలై 1946 నుండి 1938 వరకు హైద్రాబాదు రాష్ట్రంలో చేసిన దోపిడీలు, కావించిన ఖూనీలు, రేపిన దహనకాండలు, ఒనర్చిన మానభంగాలు, సభ్య మానవ ప్రపంచాన్ని భయకంపితులను చేసినవనిన అత్యుక్తి యుండదు. వీరిచేత ఛత్తారీ ప్రధాని చావుదెబ్బలుతిని బ్రతుకుజీవుడాయని పారిపోయెను. సర్ మిర్జా ఇస్మాయిల్ ప్రధానిగావచ్చిన ఏడాదిలోనే చల్లగా బెంగుళూరు నుండి జారుకొనెను. సిగ్గుమాలిన ఛత్తారీయే మరల ప్రధానిగావచ్చి శరీర శుద్ధి జరుగులోపలనే చచ్చిచెడి చాయంగల విన్నపములొనర్చి హైద్రాబాదు నకు శాశ్వతముగా అల్విదా (వీడ్కోలు) పలికెను.

ఇత్తెహాద్ వారి ముఖ్యసిద్ధాంతములలో కొన్ని :—

1. దక్కన్ దేశాన్ని తురకలు కత్తి పోటుతో గెలిచిరి, కనుక దాన్ని పాలించే హక్కు వారికే సర్వదాకలదు.
2. తురకలకు రాజ్యపాలనాధికారం తప్పితే, ఏవృత్తీ మిగులలేదు, కనుక ప్రభుత్వోద్యోగముచేయుట వారికి జన్మహక్కు గలదు.
3. తురకలను వారి ఘనతనుబట్టి తూచవలయునుగాని వారి సంఖ్యను గణించరాదు.
4. తురకలీదేశములో ఆఖాలు (యజమానులు) హిందువులు గులాములు
5. ఉర్దు విశిష్టమైన భాష కావున అది అధికార భాషగా నుండవలయును.
6. రాజ్యాంగములో ముస్లిమ్ ఆధిక్యత ఉండవలెను. ఏలయన హైద్రాబాదు రాజ్యం తురకలయొక్క సామ్రాజ్యము. (ఇస్లామీ రాజ్యము)

అన్నిటికంటే చిత్రమగు విషయమేమనగా నిజాంరాజు సర్ అక్బర్ హైదరీ కాలంలో పైన తెలుపబడిన సిద్ధాంతాలను 1939 సం॥లో ఒక విచిత్రమగు రాజ్యాంగమును ప్రతిపాదించునపుడు అంగీకరించి యుండిరి. నిజాంవారు తమ ఫర్మాన్‌లో "హైద్రాబాదు రాష్ట్రము ఇస్లాము రాజ్యము" అని ఇత్తెహాద్ వారిని సంతృప్తి పరచుటకు అంగీకరించియుండెను. ఈ విధంగా నిజాంప్రభువరేణ్యులు ఇస్లామ్‌మత పక్షపాత దుర్బుద్ధితో మతోన్మాద మంత్రివర్గ మంతనాలకు తలయొగ్గి హిందువులకు ఎనలేని కష్టనష్టములు కలిగించెను. తుట్టతుదకు నిజాం పాపం పండెను. పోలీసుచర్య హైద్రాబాదుపై 13 సెప్టెంబర్, 1948, నాడు జరిగెను. మూడురోజుల దండయాత్రతో 35 ఏండ్లనుండి నిర్మించుకుంటూ వచ్చిన ఇస్లాము మతరాజ్యపు పేకమేడలు నేలమట్టమై పటాపంచలైనవి..." అలాంటి భస్మాసురుల రాజ్యంలో రాజకీయ ఉద్యమాలద్వారా ప్రజానీకంలో చైతన్యం తేవలయునన్న రాజకీయనాయకు లెంతటి ధీరచిత్తులై, ధైర్యసముపేతులై యుండవలెనో ఊహించుకుంటె చాలు.

తెలంగాణ ప్రజానీకంలో రాజకీయ చైతన్యం కలిగించినది ఆంధ్ర మహాసభలే కాని కాంగ్రెస్ ఉద్యమాలు కావు. పంద్రెండవ ఆంధ్ర మహాసభ తర్వాత జరిగిన పదమూడవ ఆ. మ. సభ శ్రీ జమలాపురం కేశవరావుగారి అధ్యక్షతన మెదక్ జిల్లా కంది గ్రామములో సమావేశమై కాంగ్రెస్ పార్టీ ఉద్యమంతో 1943 సం॥లో చేతులుకలిపి అందు సంలీనమైనది. స్టేట్ కాంగ్రెస్ సంస్థ స్థాపన హైద్రాబాదు రాష్ట్రంలో స్వామి రామానంద తీర్థగారి అధ్యక్షతన 1923సం॥లో జరిగింది. కాని 1931 సంవత్సరారంభంలో రాష్ట్ర ప్రభుత్వం స్టేట్ కాంగ్రెస్ సంస్థను రద్దుచేసి, కొందరిని జేలుపాలు చేసి, మరి కొందరిని దేశ బహిష్కృతులనుజేసి, 1946సంవత్సరాంతంవరకు కాంగ్రెస్‌కు స్థానంలేకుండా చేసింది. రాజకీయ పార్టీల ఉనికికే ఆస్కారంలేకుండా చేసిన హైద్రాబాదులో ఒక్క ఆంధ్ర మహాసభయే మనగలిగినది. అదియే తెలంగాణలో రాజకీయ చైతన్య స్రవంతికి దోహదం చేసింది

1930 సంవత్సరంలో ప్రప్రథమంగా మెదకు జిల్లా జోగిపేటలో ఆంధ్ర మహాసభలు వైభవోపేతంగా జరుపబడి, తెలంగాణీయుల సమష్టి ఆశయాలకు, ఆకాంక్షలకు ప్రతిరూపమై వెలుగొందినవి. అంతకుపూర్వము జరిగిన ఆంధ్ర సభలలో స్థానిక సమస్యలకే ప్రాధాన్యత ఇయ్యబడెను. జోగిపేటలో ప్రారంభమైన ఆంధ్ర మహాసభలు యావత్ తెలంగాణీయుల సమష్టి సమస్యలకు, కష్ట సుఖాలకు, అభ్యుదయానికి ప్రాధాన్యత ఒసగబడినది. అందుకే జోగిపేటలో జరిగిన ఆంధ్ర మహాసభ తదుద్యమ చరిత్రలో రెండవ మలుపు అనవచ్చును.

ఆంధ్ర మహాసభను జోగిపేటలో జరుపుటకు అనుమతి ప్రసాదించవలసిందిగా నిజాం ప్రభుత్వానికి మహజర్‌నామా సమర్పించుకున్న రెండు నెలలకు అనగా ఫిబ్రవరి 22, 1930 నాడు ప్రభుత్వం తమ గష్తీ నిషాన్ 5 ద్వారా ఆంధ్ర మహాసభను జరుపుకొనుటకు కొన్ని షరతులద్వారా అనుమతి ఇయ్యబడెను. షరతులు :—

హాసభాధ్యక్షుడు పరదేశీయుడు అనగా నాన్‌ముల్కీ కాగూడదు.

2. ఇతర మతస్థులకు మనస్తాపముగాని అనుమానముగాని కలుగు పరిస్థితులు మహాసభ కల్పించగూడదు.

3. రాజకీయ విషయములనుండి సభికులు, సభానిర్వాహకులు పూర్తిగా వైదొలగుట అవసరము.

పై షరతులలో ఏ ఒక్క అంశమునకు భంగము వాటిల్లిననూ మహాసభ రద్దు చేయబడంగలదని సదరు గష్తీద్వారా విశదీకరించబడినది.

ఇలా అడుగడుగునా అడ్డంకులు కల్పిస్తూ హిరణ్యాక్షవరాలతో ప్రభుత్వంవారు మహాసభలు జరుపుకొనుటకు అనుమతించెడివారు. ఆంధ్ర మహాసభ మూడు రోజులకు ప్రారంభమవుతుందనగా హైద్రాబాదు నుండి అరవైమంది స్త్రీ పురుషులు, సురవరం ప్రతాపరెడ్డిగారి వెంట బయలుదేరి మార్గమధ్యమున సంగారెడ్డిపేటలోను తదితరగ్రామాల్లోను సన్మాన పత్రములను స్వీకరిస్తూ జోగిపేట ముసాఫిర్ బంగ్లాలో విడిదిచేసిరి. వీరి రాకకై నిరీక్షిస్తున్న జోగిపేట వర్తక సంఘంవారు, పురప్రముఖులు మేళ తాళములతో, బాజా బజంత్రీలతో రెడ్డిగారిని ధవళాశ్వముపై ఊరేగించి సభాస్థలికి మహావైభవోపేతంగా ఊరేగిస్తూ తీసుకొని పోయారు. ఆనాటి మహాసభకు ఆరువేల జనం సభాకార్యక్రమాల్లో పాల్గొని సభను దిగ్విజయం చేసారు. ప్రతాపరెడ్డిగారు తమ అధ్యక్షోపన్యాసంలో సంఘ దురాచారములను సోదాహరణముగా వివరిస్తూ వాటివలన సమాజానికి కలుగు అనర్థాలను సోపపత్తికంగా విశదీకరించారు.

ఆంధ్ర మహాసభలకు అధ్యక్షత వహించిన వారందరిలో ప్రతాపరెడ్డిగారే అన్ని విధాలా సమర్థులని మాడపాటివారు తమ తెలంగాణాంధ్ర మహాసభోద్యమ చరిత్ర రెండవ సంపుటిలో ఉద్ఘాటించారు. జోగిపేట మహాసభ అనంతరం ఆ యా జిల్లాల్లో జరిగిన ఆరు ఆంధ్ర మహాసభ సమావేశము

లందు ప్రతాపరెడ్డిగారు మా. హనుమంతరావు గారికి చేదోడువాదోడుగా ఉండి ఆంధ్ర మహాసభోద్యమానికి స్ఫూర్తిని, కీర్తిని చేకూర్చారు.

1931 నుండి 1934 వరకు ఆంధ్ర మహాసభకు కార్యదర్శిగా ఉంటూ రెడ్డిగారు తదుద్యమానికి సేవ చేసినారు. అనంతరం మూడు సంవత్సరాలు మందుముల రామచంద్రరావు గారికి అండగా ఉంటూ కార్యదర్శకత్వ బాధ్యతలను నిర్వహించినారు. నల్లగొండ, కరీంనగరం, జిల్లాలగ్రామాల్లో పర్యటించునపుడు మాడపాటివారి వెంటనుండి గ్రామ సభలలో ఉపన్యసిస్తూ ప్రజలలో రాజకీయ చైతన్యానికి దోహదం చేశారు.

1938 సంవత్సరంలో రెడ్డిగారి రాజకీయ జీవితమున నొక విచిత్ర సంఘటన సంభవించినది. దీపావళి అనంతరం, స్టేట్ కాంగ్రెస్ పక్షాన సత్యాగ్రహము చేయుటకు సంకల్పింపబడెను. మందుముల రామచంద్ర రావుగారు రెడ్డిగారిని సత్యాగ్రహోద్యమంలో దించడానికి ప్రయత్నంచేసిరి. రెడ్డిగారికి వైయక్తికంగా సత్యాగ్రహోద్యమానికి అది తగిన సమయంకాదని స్ఫురించుటవలన ఉద్యమానికి విముఖుడుగా నుండిరి. అయినా మందముల వారి మాట కాదనలేక అందుకంగీకరించారు. అదే దరిమిలా రెడ్డిగారి భార్య ఆరోగ్యము క్షీణించుటవల్లనూ, ఇంటి వ్యవహారములు కల్లోలముగా నుండుటవల్లనూ, స్వగ్రామం వెళ్ళి వాటిని సరిదిద్దుకొని వారి సతీమణి ఆరోగ్యము కుదుటపడువరకు ఉండి ఇరువై రోజుల అనంతరం నగరంవచ్చి సత్యాగ్రహోద్యమానికి తమ అంగీకారాన్ని రావుగారికి తెలియజేశారు. డిసెంబర్ 15, 1938 నాడు సత్యాగ్రహం చేయడానికి సమాయత్తమై యుండిరి. అంతలోనే మందుములవారు జ్వర పీడుతులైరి. అందువల్ల తేదీని డిసెంబర్ 23, నకు మార్చబడెను. ఆలోగా మహాత్మాగాంధీ గారు సత్యాగ్రహోద్యమము నాపు చేయుటకు ఉద్యమకర్తలను కోరియుండిరి. అలాంటి సందర్భంలో సత్యాగ్రహము ప్రారంభించుట జేలుపాలగుట కాంగ్రెస్ నియమావళికి విరుద్ధమని రెడ్డిగారెంత వాదించినా మందములవారు వినిపించుకొనలేదు. అందువలన రెడ్డిగారికీ తదితర ఉద్యమోద్యుక్త కార్యకర్తలకూ

మధ్య భేదాభిప్రాయములు తలయెత్తినవి. వానితో రెడ్డిగారు కలతజెంది తదాదిగా రాజకీయాలకు దూరదూరంగా ఉండడం ప్రారంభించారు. దీనికి తోడు ఆంధ్ర మహాసభలో చీలికలు రావడము, నిజామాబాద్‌లో జరిగిన ఆంధ్ర మహాసభలో జరిగిన సంఘటన దృష్ట్యా అభివృద్ధిపక్ష స్థాపన మొదలగు సంఘటనల వలన రెడ్డిగారు రాజకీయాలకు విముఖతను కనబరచినారు.

1937 లో నిజామాబాద్‌లో జరిగిన ఆంధ్ర మహాసభకు మందుముల నర్సింగరావుగారు అధ్యక్షత వహించారు. సభలో ఒక ముస్లిమ్ సోదరుడు ఉర్దులో ప్రసంగించడానికి అధ్యక్షుల అనుమతి నర్థించాడు. మందుముల వారు బూర్గులవారిని సంప్రతించారు. బూర్గులవారు లౌకికుడగు నియోగిబిడ్డ కాబట్టి, భాషలో ఏమున్నది! భాషయెడ సంకుచితత్వము కనబరచరాదు కనుక ఉర్దులో ప్రసంగించుటకు సదరు వ్యక్తికి అనుమతి నియ్యవలసిందిగా మందుముల వారికి సలహా ఇచ్చారు. అధ్యక్షులవారు అతనికి ప్రసాదించారు. సభలోనున్న యువకరక్తం వెల్లుబికింది. అధ్యక్షుడి అనుమతిని సవాలు చేసింది. ఆంధ్ర మహాసభలో ఉర్దుప్రసంగాలు సంప్రదాయ విరుద్ధమనియు, ఆంధ్రమహాసభ ఉద్దేశాలకు వ్యతిరేకమని గోల ప్రారంభించినది. శ్రీ వి. బి. రాజుగారు కూడ అలా వ్యతిరేకించిన వారిలో ఒకరు. యువకు లంతా సభను బహిష్కరించి వెడలిపోయి, వేరొకచోట సమావేశమై సభా కార్యక్రమాలు నిర్వహించారు. ప్రతాపరెడ్డిగారిలో భాషాభిమానం, దేశాభి మానం అధికపాళంలో ఉంది కనుక వారు యువలోకానికి అండగా నిలిచారు. అదికూడ కొందరు పెద్దలకు కంటకప్రాయ మైనది. అయినా ముక్కుకు సూటిగాపోవు మనస్తత్వం రెడ్డిగారిది కనుక తత్పర్యవసానముల లోతు పాతుల నరయక తనకునచ్చిన పనికి పూనుకొని, నాటినుండి "అభివృద్ధి పక్షాని"కి నాయకత్వం వహించారు.

వాడి భావాలు, వేడిరక్తం ఉరకలు వేయువారంతా "అభివృద్ధి పక్షం" లోచేరి నిజామాబాద్ సమావేశంపై వ్యాసాలతో, పద్యాలతో, చెణుకు

అల సహకారం చేసినారు. వారి ఉత్సాహానికి, ఆకాంక్షలకు రెడ్డిగారు పట్టు గట్టిగా నిలిచారు. యువతరపు టుత్సాహం ఎక్కడ ఉరకలువేస్తే అక్కడ ప్రతాపరెడ్డిగారు ఆశీస్సులు ఉండేవి. అభివృద్ధిపక్షం ఉద్ధృతంగా పనిచేసే రోజుల్లో గోలకొండ పత్రికలో నిజామాబాద్ మహాసభ గొడవలు పుంఖానుపుంఖంగా పద్య గద్య వ్యంగ్య హాస్య ధోరణిలో ప్రచురింపబడుతుండేవి.

రెడ్డిగారు యువతరానికి ఎంత సన్నిహితంగా ఉండేవారోనని తెలుపుటకు మరొక ఉదాహరణ చాలును. ఆంధ్ర సారస్వత పరిషత్తుయొక్క ఏనమిదవ సాహితీ సభలు ఫిబ్రవరి, 1950 సంగులో మంచిర్యాలలో జరిగినవి. యావదాంధ్ర దేశంనుండి సాహితీ బంధువులు మంచిర్యాలసభ నలంకరించారు. తెలంగాణ యువకవి పండితులలో ప్రముఖులగు కాళోజీ, దాశరథి, బి. రామరాజు ప్రభృతులుకూడ పాల్గొనియుండిరి. రామరాజుగారు జానపద సాహిత్యంపై చక్కని వ్యాసంవ్రాసి, సాహితీ బంధువులకు వీనుల విందొనరించిరి. దాశరథిగారు సభలో పద్యరత్నముల వెదజల్లిరి. సభ పరిసమాప్తమైనాక దాశరథిరామరాజాదులు తమబస చేరుకొనిరి. ప్రతాపరెడ్డిగారు వారి విడిదిని వెతుక్కుంటూవచ్చి రామరాజుగారి భుజంతట్టి, మరల నొకమారు వారిచేత వ్యాసం చదివించి, అభినందించి, అందందు దొరలిన పొరపాట్లను సవరించి, తమ విలాసమునిచ్చి వెడలిపోయారు. రామరాజుగారి ప్రవృత్తిని గమనించిన రెడ్డిగారు అతడిని లక్ష్మణరాయ పరిశోధనమండలి వైపు నడిపి, పరిశోధనయందాసక్తి కలిగించి, జానపద వాఙ్మయమున నోలలాడించి, విజ్ఞానవర్ధినీ పరిషత్తులో సభ్యత్వమునిచ్చి ప్రోత్సహించినది ప్రతాపరెడ్డిగారే!

రజాకార్ల దమనకాండ కారణంగా హైదరాబాద్ రాష్ట్రంపై కేంద్ర ప్రభుత్వం సెప్టెంబర్ 13, 1948 నాడు పోలీసుచర్య గావించినది. తురక ప్రభుత్వపు బారినుండి రాష్ట్రప్రజలు విముక్తిపొందినారు. ప్రజలు స్వతంత్రులైనారు. యావద్భారత దేశంలో జరిగినట్లే హైదరాబాదు రాష్ట్రంలోకూడ సాధారణ ఎన్నికలు జరిపించబడినవి. కాంగ్రెస్ పార్టిపక్షాన మాడపాటివారు

సురవరంవారు పోటీచేశారు  కాని ఓడిపో
రెడ్డిగా  నియోజకవర్గం నుండి పోటీచేసి ఎన్నుకోబడినారు. గురువుగారి ఓటమి రెడ్డిగారికి బాధాకరంగా పరిణమించినది. ఆ విషయాన్ని తమ మిత్రులగు చెలమచెర్ల రంగాచారి గారికి వ్రాసిన లేఖలో విదితం చేసి యుండిరి ప్రతాపరెడ్డిగారి  విజయం సారస్వతాభిమానులకు, అభిమానవర్గానికి సంతృప్తి కలిగించింది. రెడ్డిగారు మంత్రివర సభ్యులై విద్యాశాఖాధిపతు లవుతారని అభిమానులంతా ఆశించారు. కాని అలా జరుగలేదు. అంతా హతాశులైనారు. కాని మన ప్రతాపరెడ్డిగారు మాత్రం ఎప్పటి ప్రతాపరెడ్డిగారే! ''ఎన్నికల్లో గెలుపొందడం పద్మవ్యూహ భేద్యం లాంటిదనీ, కేవలం పెద్దల ఆశీస్సులు, దైవానుగ్రహమే తన విజయానికి కారణమనీ, తాను మంత్రి పదవి నాశింపలేదనీ, అది రానందుకు విచారం లేదనీ— రాజకీయపు చీకటి బజారులో తనూ, తనబోటివారు ఏమీ పనికి రారనీ...'' శ్రీ రంగాచార్యులకు వ్రాసిన లేఖలో విశదంచేశారు. రాజకీయ రంగంలో ముక్కుకుసూటిగా పోయే ప్రతాపరెడ్డిగారి లాంటి వ్యక్తులు సరి పడరని అవిభక్త హైద్రాబాదు ముఖ్యామాత్య పదవి నలంకరించిన బూర్గుల రామకృష్ణారావుగారే అంగీకరించారు. అందుకే రెడ్డిగారికి రాజకీయాలు-రాజ కీయాలకు రెడ్డిగారు దూరదూరంగా ఉండిపోయారు.

ఉస్మానియా విశ్వకళాపరిషత్తును కేంద్రప్రభుత్వానికి సమర్పించి దానిని హిందీ విశ్వ విద్యాలయంగా మార్చుటకు కేంద్రప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాన్ని అర్థించియుండెను. రాష్ట్రప్రభుత్వం వారి కోరికను పరిశీలించు టకు ఒక సలహాసంఘాన్ని నియమించినది. అందులో బూర్గుల వారితోపాటు రెడ్డిగారు మరోముగ్గురు సభ్యులుగా నుండిరి. హిందీ భాషావ్యాప్తికి మరియు దానిని రాజభాషగా మార్చుటకు అనుకూల వాతావరణమును కల్పించుటకు గాను కేంద్రప్రభుత్వం ఇలాంటి ఆలోచనచేసినదని రాష్ట్రప్రభుత్వానికి తెలియ చేయబడినది. హిందీ భాషావ్యాప్తికి గాని, దానిని రాజభాషగా మార్చుటకు గాని ఉస్మానియా యూనివర్సిటీని కేంద్రమునకు సమర్పించనవసరం లేదని

ప్రతాపరెడ్డిగారి వాదము. హిందీ భాషావ్యాప్తికి రెడ్డిగారు వ్యతిరేకులని అప్పుడే కొందరు పెద్దలు ప్రచారంకూడ ప్రారంభించారు. రెడ్డిగారు హిందీ భాషాభిమాని జభాషగా భారతదేశంలో ఏదో ఒక దేశభాష ఉండా లని రెడ్డిగారి అభిమతము. హైదాబాదు హిందీ ప్రచారసంఘ కార్యవర్గం లోను, హిందీ ప్రేమీ మండలిలోను రెడ్డిగారు సభ్యులు. హిందీ భాషా వ్యాప్తికిగాను ఉస్మానియాను కేంద్రప్రభుత్వానికి సమర్పించగూడదన్న అభిప్రాయమును హిందీ ప్రచార సంఘంకూడ అభివ్యక్తంచేసింది. హిందీ భాషావ్యాప్తికి మార్గాలు వేరేఉన్నవి. ఉన్న ఒక్క విశ్వవిద్యాలయాన్ని కూడ తెలంగాణ ప్రజలకు మిగల్చకుండా కేంద్రప్రభుత్వానికి దత్తంచేసి, వారి దయాధర్మాలకు అర్రులుచాచడం భావ్యంకాదని రెడ్డిగారి అభిప్రాయము. అంతగా కావాలనుకుంటె హిందీకొక విశ్వవిద్యాలయాన్ని కేంద్రంవారు భవననిర్మాణం చేసి భాషావ్యాప్తికి ప్రచారం చేయవచ్చు. అంతేగాని తయా రుగాఉన్న ఉస్మానియా భవనరాజమును కేంద్ర కైవసం చేసుకొని, మీకు వేరే విశ్వవిద్యాలయాన్ని నిర్మిస్తామని ప్రకటించడం సమంజసంగాను, సహేతుకంగాను లేదని రెడ్డిగారి వాదనము. ఆ రోజుల్లో ముక్కోటిప్రజలకు మూడు ప్రాంతాల్లో మూడే విశ్వవిద్యాలయాలుండేవి. రెడ్డిగారి అభి ప్రాయంతో ఏకీభవించువారు సలహా సంఘంలో కూడ కొరవడుటవలన రెడ్డిగారి మనస్సు బాధపడేది. పార్టీ క్రమశిక్షణకు బద్ధులై సలహాసంఘంలో తన ఆత్మప్రేరణకు వ్యతిరేకంగా సభ్యుడుగా ఉండటానికి మథనపడేవారు. అందుకే సలహాసంఘ సభ్యత్వానికి రాజీనామా ఇస్తామని బూర్గులవారికి తెలియజేసారు. అలా చేయడంవలన తమవాదానికే విఘాతం కలుగుతుందని బూర్గులవారు నచ్చచెప్పడం వలన గంభీరించెడివారు. ఎట్టకేలకు రెడ్డిగారి అభీష్టానుసారంగానే రాష్ట్రప్రభుత్వం నిర్ణయం తీసుకొని కేంద్రప్రభుత్వానికి తెలియజేసింది.

అలనాడు నిజాము నవాబు తెలంగాణానుండి తెలుగు భాషనే తుడిచి వేద్దామని ప్రయత్నం చేస్తే, రెడ్డిగారు గోలకొండద్వారా నిజాంప్రభుత్వంపై

ధ్వజమెత్తి వారి సంకుచిత తత్వాన్ని ఖండిస్తూ పుంఖానుపుంఖంగా సంపాద కీయాలు, వ్యాసాలు వ్ర స్వాతంత్ర్య సముపార్జనానంతరం కేంద్ర ప్రభుత్వంతీసుకున్న పాక్షిక దృక్పథాన్నికూడ ఖండించడానికి రెడ్డిగారు వెనుకంజ వేయలేదు. ఇంకా కొద్దిరోజులకు కన్నుమూస్తారనగా చెలమచర్ల వారికి లేఖవ్రాస్తూ, ''నా గ్రామ మిప్పుడు నీళ్ళులేని ఇటికేలపాడు కాదు, కృష్ణాతీరమందుగల చందూరు గ్రామము. అన్నదమ్ములము ఆస్తిని పంచు కున్నాము. చందూరులోగల భూములు నాకు లభించినవి. నేనిప్పుడు కొత్త పుస్తకాలేవీ వ్రాయడం లేదు — వ్రాసిన రెండు మూడు ఇంకా అముద్రితాలే! ఇక వ్రాసిన లాభమేమి? ఇంక కలము దించుతున్నాను. నేనే కొలదికాలంలో దిగిపోవుట జరుగునేమో! దానికి సిద్ధముగా ఉండ వలెనుగదా! ఇది సంతాపముతో తెలుపుటలేదు, నిర్లిప్తంగానే తెలుపు తున్నాను...'' అంటూ వ్రాశారు. తాను వచ్చినపని శక్తివంచన లేకుండా నిర్వహించి నిర్లిప్తుడుగానే కన్నుమూసిన కర్మయోగి. ఏబదియేడు వసంతాలు నిండీనిండకుండానే తన కార్యమును ముగించుకొని నిష్కామ యోగిలా వెడలిపోయిన పావనమూర్తి. ఆగష్టు 25, 1953 సం॥లో తన స్వగృహంలో గుండెపోటువల్ల ప్రశాంత వాతావరణంలో కన్నుమూసినారు.

నిద్రాణమైన తెలంగాణమునకు మేలుకొలుపు పాడిన ప్రథమ వైతాళికునికి, మహాకవి దాశరథిగారు తమ ''మహాంధ్రోదయం''అను కావ్య కన్యకను అంకితమిచ్చి ఋణవిముక్తులైనారు. శ్రీ గంగాపురం హనుమచ్ఛర్మ గారుకూడ తమ ''దుందుభి''యను పద్యకావ్యమును ఉత్తమ దేశికుడు, నిష్కళంక దేశభక్తుడగు సురవరం ప్రతాపరెడ్డి గారికి అంకితమిచ్చి తమకు రెడ్డిగారిపైగల అకలంక భక్తిప్రపత్తులను సార్థకం చేసుకోవడమే కాక, వారిపై నవరత్న పద్యరాజములనల్లి తమ కవితామతల్లిని సార్థకం చేసు కున్నారు. ఇలా ఎందరో కవిపండితులు తమ కవితలచే రెడ్డిగారి సంస్మృతికి స్మృత్యంజలిని ఘటించారు.

# 10

# గ్రంథాలయోద్యమము

ప్రతాపరెడ్డిగారి ప్రమేయంలేని సంస్థ, చేపట్టని ఉద్యమం, కలం నడువని సాహితీక్షేత్రం అరుదంటె అతివ్యాప్తి కాదేమో ! వారు నడుముకట్టి నిర్వహించిన కార్యక్రమాలన్నిటికీ నూతన స్ఫూర్తిని, తేజస్సును, ఓజస్సును చేకూర్చాడు సాహితీ సంస్థలతో వారికున్న అవ్యాజానురాగం కారణంగానే గ్రంథాలయోద్యమ వ్యాప్తికి యావదాంధ్ర దేశంలో సారథ్యం వహించడం జరిగింది గాడిచెర్ల హరి సర్వోత్తమరావుగారిపట్లగల గౌరవాభిమానములు, గ్రంథాలయోద్యమ వ్యాప్తికి వారు చేసిన సేవ కారణంగానే రెడ్డిగారి కుండెడివి. 1941 సం॥లో హైద్రాబాదులో జరిగిన ప్రాచ్య పరిషన్మహాసభకు యావద్భారత దేశంనుండి ఆర్షభాషాకోవిదులు హాజరైనారు. పాతూరి నాగభూషణంగారు ఆ సభలో రెడ్డిగారిని ప్రథమంగా కలుసుకొని ఇరువై మూడవ గ్రంథాలయ మహాసభకు అధ్యక్షత వహించవలసిందిగా ఆహ్వానించారు. రెడ్డిగారు వారి ఆహ్వానాన్ని అంతగా పట్టించుకోలేదు. అందుచేత నాగభూషణంగారు హరి సర్వోత్తమరావుగారిచేత రెడ్డిగారి కొక లేఖ వ్రాయించారు. ఆ లేఖ నందుకున్న రెడ్డిగారు తెనాలి తాలుకా పెద్దపాలెంలో జరుగు గ్రంథాలయ మహాసభకు మే 26, 1942 నాడు హాజరైనారు. పెదపాలెంలో మూడురోజులు ముచ్చటగా జరిగిన కార్యక్రమానికి రెడ్డిగారు అధ్యక్షత వహించారు.

రెడ్డిగారు తమ అధ్యక్షోపన్యాసంలో గ్రంథాలయోద్యమ చరిత్రను స్థూలంగా వివరించి పాశ్చాత్య దేశాల్లో గ్రంథాలయోద్యమముయొక్క వ్యాప్తి చరిత్రను విపులంగా విశదీకరించి, కార్యకర్తలు ఉద్యమ వ్యాప్తి సందర్భంలో గ్రామాలకు వెళ్ళినపుడు అక్కడి జానపద గేయాలను, గాథ

లను సేకరించి, మరుగుపడిన తెలుగు సంస్కృతీ సంపదలను పునరుద్ధరించ వలసిందిగా సలహా ఇచ్చారు. ముఖ్యంగా భాషా సేవకులు, పరిశోధకులు పరిసర ప్రాంతాల భాషలను అవగతం చేసుకొని ఆయా సాహిత్యాల్లో నిక్షిప్తమైయున్న సాహితీ సంపదలను మాతృభాషలోకి అనువదించి తెనుగు బాసను సుసంపన్నము చేయవలసిందిగా అర్థించారు. పూర్వకాలంలో దేవాలయాలు భారతీయ సంస్కృతీసంపదలకు ఆలవాలమైనట్లు, నేటి గ్రంథాలయాలు గ్రామవికాసకేంద్రాలుగా విరాజిల్లవలె నన్నారు. పత్రికా పఠన కార్యక్రమాలకు తోడుగా గ్రంథాలయాల ఆవరణలో వ్యాయామ శాలలు అభివృద్ధి చెందవలెనని రెడ్డిగారు తమ ఉపన్యాసంలో సూచించారు. ఆ సందర్భంలోనే రెడ్డిగారిని గ్రంథాలయ సంఘానికి ఉపాధ్యక్షులుగా ఎన్నుకొనడం జరిగింది.

1943 సం॥లో ఖమ్మంలో జరిగిన గ్రంథాలయ మహాసభకు రెడ్డిగారే అధ్యక్షత వహించారు. 1944 సం॥లో సుమారు పదిహేను స్థలాలనుండి గ్రంథాలయ మహాసభల కార్యక్రమాల నిర్వహణకుగాను రెడ్డిగారికి పిలుపు వచ్చింది. అందు ముఖ్యంగా నెల్లూరు, గుంటూరు, మద్రాసు, నంద్యాలవంటి ప్రదేశముల పేర్లు సంస్మరించదగినవి. కాని రెడ్డిగారి అనారోగ్య కారణాల వల్లనూ, ప్రయాణపు అసౌకర్యములవల్ల కలుగు ఇబ్బందుల దృష్ట్యా రెడ్డి గారు వారి ఆహ్వానములను నమ్రత పూర్వకంగా తిరస్కరించడం జరిగింది.

1944 సం॥ ఆగస్టులో జరిగిన గ్రంథాలయోద్యమ రజతోత్సవ మహా సభ సింగరేణి కాలరీస్‌లో ఏర్పాటు చేయబడింది ఆ సమయంలో రెడ్డి గారు నారి కురుపుతో బాధపడుతున్నందువల్ల రజతోత్సవ కార్యక్రమాల్లో పాలు పంచుకొన లేకపోయారు కాని తమ సందేశాన్ని మహాసభకు వ్రాసి పంపించారు. 1946 సెప్టెంబర్‌లో ఇరువది యారవ గ్రంథాలయ మహాసభ అలంపురంలో ఏర్పాటు చేయబడింది. గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారు, పాతూరి నాగభూషణంగార్లను ప్రతాపరెడ్డిగారు ఆహ్వానించి స్వయంగా అన్ని ఏర్పాట్లు చేయించారు. సభాస్థలిని అచటినుండి క్యాతూరు గ్రామానికి

మార్పించి తమ అగ్రజుడగు సురవరం రంగారెడ్డి గారికి కార్యనిర్వహణ బాధ్యత నప్పగించి, రెడ్డిగారు సభా నిర్వహణ కార్యకలాపాలలో నిమగ్నులై వ్యవసాయ, ఆరోగ్య, పశువైద్య శాలల ప్రదర్శనాలనుకూడ ఏర్పాటు చేయించి సభా కార్యక్రమాల కొక నూతన స్ఫూర్తిని కలిగించారు. క్యాతూరు గ్రంథాలయ మహాసభకు రాజా బహద్దర్ వెంకటరామారెడ్డిగారిని అధ్యక్ష పదవి నలంకరింప జేయడం ఒక విశేషముగా పేర్కొనవచ్చు.

1948 సం॥ సెప్టెంబర్ 13 వ తేదిన పోలీసు చర్య జరిగిన అనంతరం నవంబర్ ఏడవ తేదినుండి నాలుగు దినములు నల్లగొండ జిల్లా యొక్క సూర్యాపేటలో గ్రంథాలయ మహాసభలు వైభవోపేతంగా జరిగినవి. ఈ మహాసభల్లో పాల్గొన్నంత మహాజనం ముందెన్నడూ ఏ సభల యందునూ పాల్గొనలేదంటే అతిశయోక్తిలేదు. అదే సమయంలో ప్రతాపరెడ్డి గారు అలంపురంలో జరిగిన రైతు మహాసభలలో పాల్గొనడంచేత సూర్యాపేటకు హాజరు కాజాలక పోయారు కాని ఆ సభా నిర్వాహకుల కొక సందేశాన్ని అంపుతూ గ్రంథచౌర్యము పంచమహాపాతకాల్లో ఒకటనీ, పుస్తక చోరుడు ఆతతాయులలో నొకడుగా పరిగణింప బడునట్లు ప్రజలకు విజ్ఞప్తి చేశారు.

1950 సం॥లో కర్నూలు జిల్లా చాగలమర్రి గ్రామంలో ఇరువై ఎనమిదవ గ్రంథాలయ మహాసభ ఉయ్యూరు సంస్థానాధీశులగు మేకా రంగయ్యప్పారావుగారి అధ్యక్షతన జరిగింది. ప్రతాపరెడ్డిగారా సభలో పాల్గొని పుస్తక ప్రదర్శనమును ఆవిష్కరించారు. రెడ్డిగారు ఆ సభా సదస్యులకు ఆంధ్రుల సాంఘిక జీవన విధానమునుగురించి స్థాలీపులాక న్యాయముగా ముచ్చటించిచెబుతూ మన తాత ముత్తాతలు ధరించిన ఆయుధాలు, వేసుకున్న వస్త్రాభరణములు, ఆడిన ఆటపాటల అంతర్యాన్ని వివరిస్తూ పురాతన వస్తు సామాగ్రిని సేకరించి ప్రజానీకంలో జిజ్ఞాసను, ఉబలాటమును పెంపొందింప జేయవలసిందిగా సభికుల నర్థించారు.

1953 సం॥ అక్టోబర్ మాసంలో జరిపిన తొమ్మి దవ మహాసభ నాటికే ప్రతాపరెడ్డిగారు సభ ముఖద్వారము రెడ్డిగారి సంస్మరణ కు అంకితం గావించి జనగామ గ్రంథాలయ మహాసభలకు జరిగిన మౌన గంభీర ము కిత వదనాలే రెడ్డిగారి అకాల నిర్యాణానికి నిదర్శనంగా నిలిచి వారి నిష్కామ సేవా తత్పరతకు ప్రగాఢ నీరాజనము లర్పించినవి.

రెడ్డిగారు గ్రంథాలయోద్యమ సంఘ ఉపాధ్యక్ష పదవితోపాటు, 1948 నుండి గ్రంథాలయ సర్వస్వ సంపాదకవర్గంలో సభ్యుడుగా ఉంటూ త్రికరణశుద్ధితో విధి నిర్వహణ కవరోధం కలుగకుండా పాటుపడిన కర్మ యోగి.

"గ్రంథాలయోద్యమము" అను పేర 64 పేజీల చక్కని విషయ సంపన్నమగు పుస్తకాన్ని కూడ రచించారు. ఈ పుస్తకంలో ప్రపంచరాజ్యా లలో గ్రంథాలయోద్యమ వ్యాప్తికి తీసుకున్న చర్యలను క్లుప్తంగా విశదీక రించడం జరిగింది. గ్రంథముల సేకరణ, భద్రత, ప్రచురణ మున్నగు అంశాలపై తమ అమూల్యాభిప్రాయములను గ్రథనం చేశారు. ఎమర్సన్ (Emerson) అను ఆంగ్ల పండితుడు గ్రంథాలయాలపై రచించిన గ్రంథాన్ని తెలుగులోకి అనువదించి ప్రచురించిన ఎంతో ఉపయుక్తంగా ఉంటుందని ఉద్ఘాటించారు.

# 11

# కుటుంబ కల్లోలములు

సురవరం ప్రతాపరెడ్డిగారు గర్భశ్రీమంతులు. వారు పట్టభద్రులగు నాటికే ఇద్దరు కొడుకుల తండ్రి. పద్మావతీ ప్రతాపుల దాంపత్య జీవనం అనురాగాల వల్లరియై, అన్యోన్యానురాగ సౌరభ సంపన్నమై అలరారినది. ప్రతాపరెడ్డిగారి అభిరుచులకూ, సాహితీ వ్యాసంగమున కెన్నడూ అడ్డురాని ఆదర్శగృహిణి శ్రీమతి పద్మావతీదేవి. పదుగురు పిల్లల తల్లియై, సంసార యాతనలో పడరాని పాట్లుపడుతూ, గుంభనగా కుటుంబ భారమును భరిస్తూ, పరోక్షంగా భర్తగారి సాహిత్య సేవాభినిరతికి ఎనలేని దోహదం చేసిన సాధ్వీమతల్లి. ప్రతాపరెడ్డి దంపతులకు కలిగిన పదుగురు సంతానంలో ఇద్దరు కుమారులు 1939 సంవత్సరంలోనే అకాలమృత్యువాత బడ్డారు. జీవించియున్న ఎనమండుగురు సంతానంలో నలుగురు పుత్రులు, నలుగురు పుత్రికలు గణనీయులు. కొడుకులలో సురవరం నారాయణరెడ్డి జ్యేష్ఠుడు. వారి అనంతరం హరిశ్చంద్రారెడ్డి, విష్ణువర్ధన్‌రెడ్డి, కృష్ణవర్ధన్‌రెడ్డి జన్మించారు. కుమార్తెలపేర్లు వరుసగా సరోజిని, లక్ష్మీకాంతమ్మ, అనసూయమ్మ, ప్రభారాణి. ఒక్క కృష్ణవర్ధన్‌రెడ్డి తప్ప అందరూ వివాహితులే. సురవరం నారాయణరెడ్డిగారు (వీరినే ఎన్. ఎన్. రెడ్డి అంటారు) ప్రభుత్వోద్యోగి. తండ్రికి తగిన తనయుడు. తండ్రిగారి ముద్రితాముద్రిత గ్రంథాల పునర్ముద్రణ మరియు ప్రచురణ కార్యక్రమాలకు ఎంతో సహకరిస్తూ తండ్రిగారి ఋణం తీర్చుకుంటున్నాడు.

శ్రీమతి పద్మావతి మేనరికపు అమ్మాయి కనుక చిన్ననాటి నుండే మన కథానాయకునికి పద్మావతి యెడ ప్రేమానురాగాలు చివురించినవి. అవి రానురాను ప్రణయానుబంధమై వైవాహిక బంధానికి దారితీసింది.

తల్లికి సమ్మతం కాకున్నా ప్రతాపరెడ్డిగారు పంతంతో పట్టినపట్టు విడువ కుండా పద్మావతినే, తనను వలచి, తననే విశ్వసించిన అనుంగు పద్మావతినే పెండ్లియాడి ప్రేమను సార్థకం చేసినారు.

అధిక సంతానం కలుగడం వలన కాబోలు పద్మావతిగారి ఆరోగ్యం అనుదినం క్షీణిస్తూ వచ్చింది. 1938 లో పద్మావతిగారి ఆరోగ్యం చాల క్షీణించుట వలన ఆవిడ నివసిస్తున్న పెరూరు గ్రామానికి వెళ్ళి రెడ్డిగారు కొన్నాండ్లపాటు అక్కడే ఉండి దేశీయ వైద్యం చేయించారు. రెడ్డిగారికి వారి జ్ఞాతులు ఇవ్వవలసిన డబ్బును రాబట్టుకొనుటకుగాను వకీలును ఏర్పాటు చేసి, తదుపరి హైద్రాబాదు చేరుకుని సాంఘిక రాజకీయ కార్యకలాపాల్లో నిమగ్నమైనారు.

1939 సం॥లో రెడ్డిగారి తరుణ వయస్కులగు కుమారులు ఇద్దరూ ఒకరి వెంట ఒకరుపోవడం వలన పద్మావతమ్మ తీరని మనస్తాపంతో మంచం పట్టింది. ఆవిడ ఆరోగ్యం అనుదినం తీసికట్టు కావడం వలన క్షయవ్యాధి సోకియుండ వచ్చునని గ్రామవైద్యులు సెలవిచ్చారు. దానికి తోడుగా పిల్లల ఆరోగ్యం కూడ జలుబులు జ్వరాలతో దెబ్బతినుట వలన కుటుంబ సభ్యులనందరినీ తీసికొని రెడ్డిగారు కర్నూలు చేరుకున్నారు. అక్కడొక నెలరోజులుండి వైద్యులచేత కొంత నయం చేయించుకున్నాక, కుటుంబ సమేతంగా హైద్రాబాదు బయలు దేరినారు. హైద్రాబాదులో మూడు నెలలుండి డాక్టర్లచేత చికిత్స చేయించారు. ఆరోగ్యం కుదిరిందిగాని ఆదాయం తరిగి వ్యయభారం అధికమైంది. ఏదో విధంగా పబ్బం గడుపుకొని బయట పడ్డారు. 1944 లో మళ్ళీ రెడ్డిగారి ఆరోగ్యం క్షీణించడం వలన, భాగ్యనగరం నగరం వదలి కంచుపాడు గ్రామంలో కొంతకాలం నివసించి, అక్కడొక ఇంటి నిర్మాణానికి శంకుస్థాపనచేసి స్థిరనివాసం చేయాలనే సంకల్పంతో రెడ్డిగారుండిరి కాని వారి ఆశయం భగవంతుడు యీడేర్చలేదు. 1945 సంవత్సరారంభంలో మళ్ళీ హైద్రాబాదు చేరుకుని గోలకొండ పత్రికలో కాలక్షేపం చేశారు. 1945 సంవత్సరపు వర్షఋతు

వులో మూడుమాసములు సన్నని జ్వరం, చిన్న దగ్గుతో బాధపడుట వలన డా॥ రంగారెడ్డిగారితో (Reddy Hostel fame) పరీక్ష చేయించుకున్నారు. డాక్టరుగారు అది మలేరియా జ్వరమని నిశ్చయించి వెంటనే రెడ్డిగారున్న ఇల్లు కాళీచేయమని ఆజ్ఞాపించారు. డాక్టరుగారి ఆజ్ఞను తల దాల్చి రెడ్డిగారు ఇల్లు ఖాలీచేసి, ఒక మిత్రుని ఇంట్లో చిక్కడపల్లిలో నివసించసాగినారు. అప్పుడక్కడ కలరావ్యాధి వ్యాపించి యుండెను. ఒక వారం రోజుల తర్వాత నొక ప్రాతఃకాలమున మసక చీకటిలో భేదులు ప్రారంభించినవి. ప్రతి అరగంట కొక విరోచనము రావడము ప్రారంభ మగుటవలన అయిదారు విరోచనాల అనంతరం లేవ సత్తువలేక మంచం లోనే ఒరిగి పోయి నోరెండి యుండుటవలన కాస్త మజ్జిగ సేవించారట. ఇంకేముంది! తత్‌క్షణమే వాంతులు లంకించుకున్నవి. చేయునదిలేక ఉన్న గదిలోనే తట్టి కట్టించుకొని అక్కడే విసర్జనాదులు విడువనారంభించారు. రెడ్డిగారి ఆకస్మిక పరిణామమునకు పరితపిస్తున్న పద్మావతీదేవి కంట తడి బెట్టుకుంటూ పరిచర్యలు చేయప్రారంభించినది. ఈలోగా ఒక సైకిల్ సవారీని డా॥ రంగారెడ్డిగారి వద్దికి పంపించారు. వారు కబురు చేసిన రెండు గంటలకు విచ్చేసి వెంటనే పరీక్షించి కలరాగా నిర్ధారించి కలరా ఆస్పత్రికి (Isolation Hospital) ఫోనుచేసి అంబులెన్స్ తెప్పించి, రోగిని దవాఖా నాలో చేర్పించారు. కలరా ఆస్పత్రిలో రెడ్డిగారొక వారం రోజులుండి మందులు సేవించి, ఇంజక్షన్లు పుచ్చుకొని ఆరోగ్యం కుదుర్చుకున్నారు. ఆస్పత్రినుండి ఒక మిత్రునింట వారంరోజులున్న తర్వాత ఇటికేలపాడుకు వెళ్ళిపోయారు. ఇటికేల పాడులో నాలుగు మాసాలుండి హైద్రా బాదు తిరిగి వచ్చారు. ఇంతకాలం నుండి కుటుంబ సభ్యుల ఆరోగ్యం చెడుట వల్లనూ, తన శరీరం స్వస్థతగా లేకుండుట చేతను డాక్టర్ల ఫీజులు, మందుల వ్యయభారం పెరిగిపోయింది. ఇటు గోలకొండ పనికూడ కుంటుబడి పోయింది. 1946 సం॥లో రెడ్డిగారి ఆరోగ్యం మళ్ళీ చెడిపోయింది. గోపాల పేట రాణిగారగు శ్రీమతి లలితాదేవిగారివెంట 15 రోజులు వారి సంస్థానపు

గ్రామాలు తిరగడం వలన, వర్షంలో ఎడతెరపి లేకుండా తడిసిపోవడం వలన, ఇటికేలపాడు చేరుకోగానే మళ్ళీ చలిజ్వరం లంకించుకుంది, భేదులు ప్రారంభమైనవి; నడువలేని పరిస్థితి దాపురించడం వలన, వారి అన్నగారగు రంగారెడ్డిగారి కుమారుడు డా॥ వెంకటరెడ్డిగారు ప్రతాపరెడ్డిగారిని తీసుకొని క్యాతూరుకు పోయి మందులిచ్చి ఆరోగ్యాన్ని ప్రసాదించారు. ఈ విధంగా ప్రతాపరెడ్డిగారు, వారి కుటుంబ సభ్యులు 1938 నుండి 1946 సంవత్సరాంతం వరకు ఎనలేని శారిరక అస్వస్థతలకు గురియై, ఆర్థిక ఇబ్బందులకు లోనై, పడరానిపాట్లు పడి, బాధలకు గురియైనారు.

# 12

# సారస్వత విద్యాసంస్థల స్థాపన

ప్రతాపరెడ్డిగారొక వ్యక్తి కాదు, అతడొక సంస్థయని బూర్గుల రామకృష్ణారావు గారొక తడవ అన్నారు. వారి మాట అక్షర సత్యము. ఎన్నో సారస్వత విద్యా వైజ్ఞానికసంస్థలకతడు మూలపురుషుడు, ఆయువు పట్టు. అతడు అండగా నిలువని సారస్వత సంస్థలు, చేపట్టని ఉద్యమాలు ఆరోజుల్లో లేవంటే అతిశయోక్తి లేదు. పద్మ విభూషణ మాడపాటి హనుమంతరావుగారి తదుపరి అన్ని విషయాల్లో అగ్రగామిగా నుండి, అన్నిటికీ అండదండల నిచ్చి ఆదుకున్నవాడు హైద్రాబాదు రాష్ట్రంలో సురవరం ప్రతాపరెడ్డిగారే గణనీయులు. రెడ్డి జనసంఘము, యాదవ సంఘము, ముదిరాజ సంఘము, గౌడసంఘము వారి సేవాభాగ్యమునకు నోచుకున్నవి. ఆంధ్ర సారస్వత పరిషత్తు, తెలంగాణా రచయితల సంఘం, విజ్ఞాన వర్ధినీ పరిషత్తు, లక్ష్మణరాయ పరిశోధక మండలిలాంటి సారస్వత వైజ్ఞానికసంస్థలపై వారి సారస్వత కృషిచంద్రికలు ప్రసరించినవి. శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషా నిలయము, వేమనాంధ్రభాషానిలయము, గ్రంథాలయోద్యమములన్నీ నిస్వార్థసేవలకు ప్రతీకలు. ఆంధ్రవిద్యాలయము, బాలికోన్నత పాఠశాల, ఎక్సెల్సియర్ మాధ్యమికోన్నత పాఠశాల, ఆయుర్వేద విద్యాలయము, సంస్కృత విద్యాలయములాంటి విద్యా వైజ్ఞానికాయుర్వేదార్ష భాషా సంస్థలు వారి ప్రాపకముతో ప్రాణము పోసుకొని వర్ధిల్లినవి. ఇలా ఎన్ని సంస్థలనైనా పేరు పేరునా పేర్కొనవచ్చు. ఈనాడు మూడుపూలు ఆరుకాయలుగా వర్ధిల్లుతున్న సాంఘిక, విద్యా, వైజ్ఞానిక, సారస్వత సంస్థలన్నీ అంతో ఇంతో వారి అవ్యాజసేవా భాగ్యమును చూరగొన్నట్టివే!

*1. విజ్ఞానవర్ధినీపరిషత్తు* :— రెడ్డిగారికి సారస్వత జ్ఞానసంస్థలపై అభిమానము అధికము. తెలంగాణములో తెలుగు రచయిత లేరను అపప్రథను ఖండించుటకుగాను రెడ్డిగారు 1941, నవంబర్ 27 వ, తేదిన గోలకొండ పత్రికాలయంలోనే విజ్ఞాన వర్ధినీ పరిషత్తునకు శంకుస్థాపన చేసినారు. విద్య మరియు విజ్ఞానము మానవునికి ఔన్నత్యమును, ఆనందమును చేకూర్చు కల్పతరువులు. విజ్ఞాన వర్ధినీ పరిషత్తు సంస్థాపనకాలం నుండి రెండు సంవత్సరాలపాటు రెడ్డిగారే తత్సంస్థ కార్యదర్శిగా ఉండి కార్యకలాపములు కొనసాగించారు. అనంతరం దాని కధ్యక్షులై చెలమచర్ల రంగాచార్యులు గారిని కార్యదర్శిగా ఎన్నుకున్నారు. తదనంతరం కేశవపంతుల నరసింహశాస్త్రిగారు కార్యదర్శిగా నియుక్తులై 1952 వరకూ కార్యభారమును నిర్వహించారు. విజ్ఞానవర్ధినీ పరిషత్తులో సభ్యులుగా నుండుటకు అందరకూ అర్హత లేకుండెడిది. విద్యా విజ్ఞానముల లోతుపాతుల నరసి, చక్కని రచనా పాటవమును కలిగిన సారస్వత వేత్తలే విజ్ఞానవర్ధినీ పరిషత్సభ్యులగుటకు అర్హులు. అంతటి హేమాహేమీలు వి. వ. పరిషత్తులో సభ్యులుగా నుండుటచేతనే కాబోలు రెడ్డిగారొకతడవ పరిషత్తు తనకు ప్రాణాధికమని ఉగ్గడించి యున్నారు.

శ్రీయుతులు చెలమచర్ల రంగాచార్యులు, కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, కేశవపంతుల నరసింహశాస్త్రి, మాడపాటి హనుమంతరావు, బి.వి. రమణారావు, చిదిరెమఠం వీరభద్ర శర్మ, పెండ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రి, డా॥ బి. రామరాజులాంటి మహామహులు వి. వ. పరిషత్సభ్యులు. విద్వద్గోష్ఠిలో పాల్గొనువారందరూ ఏదేని ఒక సమస్యపై లేదా విషయముపై కూలంకషంగా చర్చలు జరిపి నిగ్గును తేల్చు నంతటి మహిమాన్వితులు, సారస్వత నిధులు, భిషగ్వరులు. వి. వ. పరిషత్తు స్థాపించిన దాదిగా ఏడు చక్కని పుస్తకరాజములను ప్రచురించి భాషామతల్లికి సేవయొనర్చినది. "మృత్యు సిద్ధాంతము" "రామాయణ విశేషములు" "ప్రతాపరుద్ర యశోభూషణము" "అలంకార వసంతము" "గంగాపుర మాహాత్మ్యము"

''ఆంధ్రలిపి సంస్కరణము'' "యువజన విజ్ఞానము" లాంటి గ్రంథముల ప్రచురణమే వి. వ. పరిషత్తు స్థాయిని, స్తోమతను చాటి చెప్పగలదు.

దురదృష్టవశాత్తు రెడ్డిగారి మరణానంతరము వి. వ. పరిషత్తు, కార్యకలాపములు నామమాత్రావశిష్టము లైనవి. తగిన ఆదరణ, పోషణ, అలంబన లేకుండా ఎంతటి ఉత్కృష్ట సంస్థలకు కూడ పతనము తప్పదు. వి. వ. పరిషత్తువారు ప్రచురించిన పుస్తకము లైనను నేడు పుస్తక విక్రయ శాలల్లో కూడ లభ్యమగుట లేదు. కనీసం సాహిత్య సంస్థలైనా పూనుకొని, అట్టి కొరతను పూరిస్తే ముదావహము. వి. వ. పరిషత్తులాంటి ఆశయము గల సారస్వత సంస్థలు యీనాడు ఆంధ్రప్రదేశ్‌లో లేవనిన విస్మయము చెందనవసరంలేదు. అలాంటి సంస్థల అవతరణ భాషామతల్లి ఆలంబనకు ఎంతైనా అవసరము.

2. *ఆంధ్ర సారస్వత పరిషత్తు* :— ఆ. సా. పరిషత్తు అవతరణ కూడ గోలకొండ పత్రికాలయంలోనే జరిగింది. దాని శంకుస్థాపనకు కారకు లైన వారిలో సురవరంవారు, మాడపాటివారు, బూర్గులవారు, దేవులపల్లి వారు మూలపురుషులు. 1943 మేనెల 23 తేదిన ఆ. సా. పరిషత్తు అవత రించినది. పరిషత్తు ప్రథమ అధ్యక్షులుగా శ్రీ లోకనంది శంకరనారాయణ రావుగారు ఎన్నుకొన బడిరి. ప్రథమ కార్యదర్శిగా బూర్గుల రంగనాథరావు గారు నియుక్తులైనారు.

ఆ. సా. పరిషత్తు ఆశయములలో గణింప దగినవి ఆంధ్రమహా జనులకు మాతృభాషాభినివేశము కలిగించి, విజ్ఞాన వంతులుగా తీర్చిదిద్దుట. వివిధాంశములపై పండితులచేత, పరిశోధకాగ్రేసరులచేత చక్కని పుస్తక ములు వ్రాయించి ప్రచురించుట, తెలుగులో భాషాభిరుచిని పెంపొందింప జేయుటకు ప్రవేశ, విశారదలాంటి పరీక్షలను మారుమూల గ్రామములందు సైతము నిర్వహించి సారస్వత ప్రచారము గావించుట ముఖ్యములు. సార స్వత పరిషత్తు వార్షికోత్సవముల నిర్వహించి ఆంధ్రమహాజనులకు సాహిత్య,

చారిత్రక, వైజ్ఞానిక, బాలవాఙ్మయ, జానపద, వయోజన విద్యావ్యాప్తికి దోహదము చేయుచున్నది.

తెలుగుభాషనే తుడిచివేయ సంకల్పించిన అలనాటి తురక ప్రభువుల హైద్రాబాదులో మాతృభాషాభివృద్ధికి కృషిచేయడం అనుకున్నంత తేలిక పనికాదు. అడుగడుగునా అనుకోని ఇబ్బందుల నెదుర్కొంటూ ఆ. సా. పరిషత్తు తెలుగు మాగాణంలో తెలుగుభాషాభివృద్ధికి ఎనలేని కృషిచేసిన దనుటలో అతిశయోక్తి లేదు. ఈ సంస్థ వార్షికోత్సవాలు 1953 వరకు హైద్రాబాదు, వరంగల్లు, నల్లగొండ, మహబూబ్‌నగరం, తూపురాన్, మంచిర్యాల, అలంపురం ప్రదేశాల్లో జరిగినవి. సారస్వత పరిషత్తునకు ప్రారంభకాలం నుండి యీనాటి వరకు అధ్యక్షులుగా సేవ చేసిన వారిలో శ్రీయుతులు లోకనంది శంకరనారాయణరావు, సురవరం ప్రతాపరెడ్డి, బుర్రా వెంకట సుబ్బారాయుడు, ఇల్లిందల రామచంద్రరావు, పర్సా వెంకటేశ్వరరావు, దేవులపల్లి రామానుజరావు, నూకల నరోత్తమరెడ్డి ప్రభృతులు కలరు.

ఆంధ్రసారస్వత పరిషత్తునకు ప్రారంభంనుండి యీనాటి వరకు నిరవధికంగా సేవచేస్తున్న వారిలో దేవులపల్లి రామానుజరావుగారిదే అగ్ర తాంబూలము. ప్రతాపరెడ్డిగారి సాహిత్య కృషికి చేదోడువాదోడుగా ఉంటూ ఎన్నో వ్యయప్రయాసల కోర్చి వారు రచించిన "ఆంధ్రుల సాంఘిక చరిత్రను ప్రచురించిన ఘనత కూడ ఆ. సా. పరిషత్తుకే దక్కింది.

ప్రథమాంధ్ర సారస్వత పరిషత్తు మహాసభకే రెడ్డిగారు అధ్యక్షత వహించ వలసియుండిరి కాని కార్యాంతర నిమగ్నత వలన రాలేకపోయినా, రెండవ మహాసభ ఓరుగంటిలో జరిగినపుడు అధ్యక్షత వహించారు. తదాది నుండి ఆ. సా. పరిషత్తు మహాసభలు ఎక్కడ జరిగినా, అదియే కార్యక్రమాన్ని చేబూనినా, అందు రెడ్డిగారికి ప్రమేయము ఉండెడిది. మంచిర్యాలలో 1950 ఫిబ్రవరి నెలలో ఇల్లిందల రామచంద్రరావుగారి అధ్యక్షతన

జరిగిన సారస్వత సభ చరిత్రాత్మకమైనది. ఆ మహాసభలో యావదాంధ్ర దేశం నుండి సాహితీ బంధువులు పాల్గొన్నారు. తెలంగాణనుండి పాల్గొన్న కవి పండితులలో కాళోజీ, దాశరథి, రామరాజు ప్రభృతులు గణనీయులు. ప్రతాపరెడ్డిగారు పాల్గొన్న సారస్వత పరిషత్తు వార్షిక మహాసభలలో మంచిర్యాల సభయే అంతిమ సారస్వత సభగా పరిగణింప వలసి యుంటుంది.

సారస్వత పరిషత్తు చేసిన సాహితీ కృషిని గూర్చి చెబుతూ బూర్గుల రామకృష్ణారావుగారు, సూర్యుని వెలుతురువలె పరిషత్తుయొక్క వయోజన విద్యావ్యాప్తి కార్యక్రమాలు ప్రతిపల్లెలో వికసిస్తూ సామాన్య ప్రజానీకాన్ని విజ్ఞాన విలసితం చేస్తున్నాయని ఉద్ఘాటించారు. ఆంధ్ర పితామహులు కూడ తమ "ఆంధ్రోద్యమ చరిత్ర" ద్వితీయ సంపుటంలో పరిషత్తు యొక్క బహుళార్థసాధక కార్యక్రమాల నుగ్గడిస్తూ ఆ. సా. పరిషత్కార్యక్రమాలు మహోద్యమంవలె గ్రామగ్రామాన పరివ్యాప్తిచెందుతూ వికసిస్తున్నాయన్నారు. ప్రతాపరెడ్డిగారు ప్రారంభించిన సంస్థలన్నీ చిలువలు పలవలై తెలంగాణపు మాగాణమును చైతన్యవంతం చేస్తున్నవి.

*3. ఆంధ్రవిద్యాలయ అవతరణ :—* తెలుగు మాట్లాడువారికి తెలుగులోనే విద్యాబోధన జరగాలని విశ్వసించిన వారిలో ప్రతాపరెడ్డిగారు ప్రథములు. నిజాం ప్రభుత్వ యాజమాన్యంలో గల విద్యాలయాల్లోను ఉర్దూను బోధనా భాషగా ప్రవేశపెట్టి తెలుగు భాషకు తెలుగుజాతికి తీరని నష్టం వాటిల్లినదని రెడ్డిగారెంతగానో పరితపించెడివారు. పేదవాని కోపం పెదవికి చేటన్నట్లు చేయునదిలేక తనవద్దగల కలం వాడితో ఎన్నో వేడి వ్యాసాలు వ్రాసి గోలకొండలో ప్రచురించి తమ అసమ్మతిని తెలిపారు. చెవిటివాని ముందు శంఖం ఊదినట్లు వారి వ్రాతలు నాజీల ధోరణిని మార్చలేక పోయినవి. ఎలాగైనా ప్రయత్నించి తెలుగుబోధనా భాషగల విద్యాలయాన్ని స్థాపించ సంకల్పించారు. ఈలోగా హైద్రాబాదులోగల ఇద్దరు ముగ్గురు మహారాష్ట్ర సోదరులు కలిసి ఎక్సెల్సియర్ మిడిల్ స్కూల్‌ను స్థాపించారు. దానికి నిజాం ప్రభుత్వం నెలకు 160 రూపాయల గ్రాంటును

కూడ ప్రకటించింది దానినే ఆంధ్రవిద్యాలయంగా మార్చి నడుపవలసిందిగా సదరు మహారాష్ట్ర సోదరులు రెడ్డిగారి నర్థించి యుండిరి. వారి అభ్యర్థన ననుసరించి రెడ్డిగారు పదిహన్నెండు సంవత్సరాలు ఎక్సెల్సియర్ పాఠశాలకు కార్యదర్శిగా ఉంటూ కార్యభారమును నిర్విఘ్నంగా నెరవేర్చారు.

కొంతకాలానికి కార్యవర్గ సభ్యులు కొందరు కూడబలుక్కొని రెడ్డి గారిని మూడుసంవత్సరాలు కార్యదర్శి పదవినుండి తొలగించి తమలో ఒకరిని నియమించుకున్నారు. మళ్ళీ కొన్ని నెలలకు వారే రెడ్డిగారి నాహ్వా నించి ఎప్పటివలె కార్యదర్శిగా నియమించారు. మళ్ళీ మహారాష్ట్ర సోదరుల బుద్ధి ఎటుమరలిందో కాని రెడ్డిగారిని కాదన్నారు. ఇలా వారి దయా ధర్మా లకు తల ఒగ్గడం భావ్యం కాదని ఎంచి తానే స్వయంగా పూనుకొని ఆంధ్ర విద్యాలయ స్థాపనకు కంకణం ధరించారు. రెడ్డిగారే ముహూర్తాన ప్రారంభిం చారోకాని పెద్దలంతా వారి ఆశయానికి అండగా నిలిచారు. 1944 సం॥ మేనెలలో మొదట ఆంధ్ర మాధ్యమిక పాఠశాల నెలకొల్ప బడింది. ఆ విద్యాలయానికి రెడ్డిగారే మొదట కార్యదర్శిగా నియుక్తులై కార్యభారాన్ని నిర్వహించారు. రెడ్డిగారి సంకల్పానికి అండగా నిలిచి వారి కృషిని ఫల ప్రదము చేసిన ఘనత బ్యారిష్టర్ శ్రీ ఆర్. దామోదరరెడ్డిగారికే దక్కినది. ఆంధ్ర విద్యాలయాన్ని ఉస్మానియా విశ్వవిద్యాలయం పరిగణించక పోవడం వలన పూనా విశ్వవిద్యాలయానికి అనుబంధ సంస్థగా రూపొందించబడింది. 1950 లో ఆంధ్రవిద్యా సంస్థ విద్యాశ్రేణిని ఉన్నత విద్యాలయంగా మార్చినది.

రెడ్డిగారు ఆంధ్రవిద్యాలయమునకు చాల శ్రమించి వేలు ప్రోగుచేసి విద్యాలయాన్ని స్వయంపోషక సంస్థగా రూపొందించారు. రెడ్డిగారు విద్యా లయ నిధికి అర్థించిన పెద్దలందరూ 500, 1000 రూపాయలకు తగ్గని డబ్బునిచ్చి సహకరించారు. అలా దివారాత్రములు శ్రమించి తగినంత డబ్బు ప్రోగుజేసి ఆంధ్ర విద్యాలయ సంస్థను ఆదర్శ విద్యా సంస్థగా తీర్చిదిద్దిన

ఘనత ప్రతాపరెడ్డిగారికే దక్కుతుంది. దినదిన ప్రవర్ధమానమై ఆంధ్ర విద్యాలయ మీనాడు కళాశాలగా మారినది.

*4. అభివృద్ధి పక్షము* :— నిజామాబాదు ఆంధ్రమహా సభలలో తెలుగులో కాక ఉర్దులో ఉపన్యసించుటకు అధ్యక్షులవారు అనుమతించి నందులకు నిరసన సూచకంగా ఆంధ్రయువకులు కొందరా సభను బహిష్కరించి "అభివృద్ధి పక్షము"గా రూపొంది తమ కార్యక్రమాలను తెలుగులో నిర్వహించుకొనిరి. అభివృద్ధిపక్షము యొక్క స్థాపన రాజకీయ కక్షతో లేదా కారణములతో ఆంధ్రమహాసభనుండి వైదొలగిన ప్రతిపక్షపార్టి కాదు. ఆంధ్రభాష, ఆంధ్రదేశము అను అభిమానము కల యువకులు కొందరు రెడ్డిగారి ఆధ్వర్యములో "అభివృద్ధి పక్షమును" స్థాపించుకొని ఆంధ్రదేశ భాషాభినివేశమును చాటుకొనిరి.

దేశాభిమానము, భాషాభిమానమును గూర్చిన ప్రసక్తి యీనాటి యువతరానికి పేలవంగా గోచరిస్తుందేమోకాని అలనాడు హైద్రాబాదు నడి గడ్డపై ఒకానొక సభలో అందరూ అన్ని భాషలలో ప్రసంగించుటకు అనుమతి లభించిందిగాని తెలుగువాడు తెలుగులో మాట్లాడుతానంటే వల దని అధ్యక్షులవారు శాసించిన కారణంగా "హిందూ సంస్కారసభ" అవతరించినది. తత్పర్యవసానంగా తెలుగువాడు తెలుగు గడ్డపై తెలుగులో తప్ప ప్రసంగించ కూడదన్న పట్టుదల నాటి తెలుగువారిలో ప్రబలిపోయింది. అలాంటి వాతావరణము తెలంగాణలో అలముకున్న రోజులలో ఆంధ్రమహా సభలో నిజామాబాదులో తెలుగు తప్ప అన్యభాషలో ప్రసంగిస్తే తెలుగు యువతరం ఊరుకుంటుందా? భాషాభిమానము, జాతీయాభిమానము ఉరకలు వేస్తున్న యువలోకాన్ని ఆదుకొని వారి ఉత్సాహాన్ని, కార్యదీక్షా పరత్వ మును "అభివృద్ధి పక్ష" స్థాపన ద్వారా నిర్మాణాత్మకంగా మలచిన ప్రతాప రెడ్డిగారి దృక్పథాన్ని, రాజకీయ సంకుచితత్వ ధోరణిగా మలచి రంగులు పూయడం క్షంతవ్యము కాదు.

అభివృద్ధిపక్షం సభ్యులు ఎంతో ఉత్సాహంతో గోలకొండ పత్రిక ద్వారా తమ కలం బలాన్ని ప్రదర్శించారు. పద్యాలు, వ్యాసాలు, విమర్శలు ప్రతివిమర్శలు ఘాటుగా వ్రాసి అభివృద్ధిపక్షం అభివృద్ధి నిరోధకులకు కనువిప్పు కలుగజేసింది. వాడి భావాలు, వేడిరక్తము పొంగి పరవళ్ళు తొక్కుతున్న యువతరానికి నాయకత్వం వహించి, వారి భావాలకు, ఆవేశాలకు క్రమ పంథాను ప్రసాదించిన ప్రతాపరెడ్డిగారు అభినందనీయులు. రెడ్డిగారు పైనుదాహృత సంస్థలకే కాకుండా లక్ష్మణరాయ పరిశోధక మండలికి, గ్రంథాలయోద్యమ వ్యాప్తికి, గ్రంథాలయాల సంస్థాపనకు, విద్యాలయముల నెలకొల్పుటకు, వాటి సక్రమ నిర్వహణకు వారు చేసినసేవ అగణితము. పుస్తక భండారములు యువజనులలో అక్షరాస్యతను పెంపొందించగలవని విశ్వసించి 1940 నాటినుండి ఆజన్మాంతం శ్రమించి కృతకృత్యులైన మహానుభావులలో రెడ్డిగారొకరు. శిల్పకళ, చిత్రకళ, ఆయుర్వేదమును అభిమానించి చేయూత నిచ్చిన వారిలో రెడ్డిగారిదే అగ్రతాంబూలము.

స్త్రీజనాభ్యుదయమునకై, వారి సర్వతోముఖ వికాసానికై అహరహము కృషిచేసి వారిలోగల ఛాందసాచారములను ముఖ్యంగా పర్దాపద్ధతిని బాల్య వివాహాలను ఖండించి, వనితాలోకానికి స్వేచ్ఛావాయువులనుప్రసరింపజేసినది రెడ్డిగారే! ఆంధ్ర మహాసభలలో జరుగు చర్చాగోష్ఠులలో రెడ్డిగారు స్త్రీవిద్యా వ్యాప్తికి గాను జిల్లాకొక బాలికల విద్యాలయ స్థాపనకు కృషిచేసి ప్రభుత్వపు అభిప్రాయాన్ని సుముఖం చేసిన ఘనత రెడ్డిగారిదే! మహిళాభ్యుదయ కార్యక్రమ నిర్వహణకూడ రెడ్డిగారు లేని మినహా జరుగకుండెడిది.

ఖమ్మంలో జరిగిన ఆంధ్రమహాసభలో సనాతన ధర్మపరాయణులు కొందరు బాల్యవివాహ నిషేధపు తీర్మానమును మహాసభ కార్యక్రమ నియమావళి నుండి తొలగించుటకు విఫలప్రయత్నము చేసి, విసిగిపోయి తుదకు ఖమ్మం తాలుక్దారుగారికి షికాయతుచేసి ఆంధ్రమహాసభను నడువకుండా చేయుటకు శతధా ప్రయత్నించి విఫలమనోరథులైరి. స్త్రీలకు నాటి సమాజంలో జరుగు అత్యాచారములను పత్రికాముఖమున ఎత్తి చూపి, వాటి

నిర్మూలనకు త్రికరణశుద్ధితో కృషిచేసి మహిళా లోకపు అభినందనలకు పాత్రులైనారు.

రెడ్డిగారు పాల్గొన్న ఏడెనిమిది ఆంధ్రమహాసభ కార్యక్రమాలలో ఉపన్యసించి, సలహాలనిచ్చి, సహకరించి, పత్రికాముఖమున ప్రచారసాధన ముల నొనగూర్చి, ప్రభుత్వపు దృష్టినాకర్షించెడివారు. సాంఘిక విద్య, స్త్రీజన విద్య, అంటరాని తనము నిర్మూలన, మద్యపాన నిషేధము, బాల్య వివాహముల రద్దు, వితంతూద్వాహము మున్నగు సాంఘిక సంక్షేమ కార్య క్రమములపై అమితంగా రెడ్డిగారు తమ శక్తియుక్తులను ధారవోసెడివారు.

మహాకవి దాశరథిగారన్నట్లు, రెడ్డిగారు "చీకటిలో దివ్వె అతడు, ఆకసమున అరుణుడతడు, అతడాంధ్రుల హృదయాంతరాన, దాగిన మహదాశయమ్ము".

ప్రతాపరెడ్డిగారు తెలంగాణమును మేలుకొల్పిన వైతాళికుడు, ఆడంబ రాల నిరసించిన నిరాడంబరమూర్తి, స్వార్థమును చేరనీయని నిస్స్వార్థ జీవి. వారి పట్టుదల, సచ్ఛీలము, నిష్కామసేవాదీక్ష, ఆంధ్రమహాజనులు అల వరచుకొనవలసిన ఉత్తమ గుణములు.

# 13

# గుణవిశేషములు

ప్రతాపరెడ్డిగారు చిన్ననాటి నుండి ముక్కుసూటిగాపోయే వ్యక్తులుగా పేరుగాంచిరి. ఉన్నతపాఠశాల ప్రధానోపాధ్యాయులు రెడ్డిగారిని గురించి స్కూలు రికార్డులో వ్రాసిన అంశము లిందుకు ప్రబల తార్కాణములు. తనకు నచ్చిన, తనను మెచ్చిన, తనపైననే ఆశలు పెట్టుకున్న వనితను వివాహం చేసుకొనుటకు కన్నతల్లి కోర్కెను సైతం కాతరు చేయని వ్యక్తి శ్రీసురవరము. తనను పెంచి పెద్దచేసి, విద్యాబుద్ధులు నేర్పించి ప్రాణ ప్రదంగా చూచుకున్న చిన్నాయనగారి మాటను సైతం కాదని వకాలతుచేయ నిరాకరించిన నిర్మోహమాటి, తన మాటనే రాజాబహద్దర్ వెంకటరామారెడ్డి గారిచేత ''అవు'' ననిపించుకుని, తన అభిమతానికి అనుకూలంగా త్రిప్పు కున్న కఠోర సత్యవ్రతుడు శ్రీరెడ్డి. గోలకొండ పత్రికయే తానుగా తానే గోలకొండ పత్రికగా మసలుకొని, అహోరాత్రములు దాని పురోభివృద్ధికై పాటుపడి నిరాడంబర జీవితం గడపిన సచ్ఛీలుడు. రాజకీయపు కీచులాటలు, అంతఃకలహాలు రుచించక వాటికి దూరదూరంగా ఉంటూ యథాశక్తి సాహిత్య సేవ చేసిన సరళహృదయుడు. సజ్జనసాంగత్యం, సత్సహవాసం, సత్కథా కాలక్షేపములతో సాహితీ వేత్తలతో సహవాసం చేసి, అజన్మాంతం పేద వాడుగానే ఉండిపోయిన సద్గుణరాశి శ్రీప్రతాపరెడ్డి.

పుట్టింది ఉత్తమ సంస్కారంగల వంశమున, పెరిగింది రామకృష్ణా రెడ్డిగారి లాంటి సహృదయుని ఆధ్వర్యమున; విద్యనభ్యసించినది వెల్లాల శంకరశాస్త్రి, వేదం వెంకటరాయశాస్త్రిగార్ల వంటి పండిత ప్రకాండులవద్ద; సన్నిహిత సహవాసం చేసింది రాజాబహద్దర్ వెంకటరామారెడ్డి, మాడపాటి హనుమంతరావుగార్లవంటి మహానుభావుల తోడ; వీటికి తోడు అజన్మాంతం

ఉదయాస్తమానములు కవిపండిత లోకంతో కాలక్షేపం చేసిన రెడ్డిగారి గుణములకేమి వంక ఉంటుంది : ఉండడాని కాస్కారమెలా ఉంటుంది ?

ఆర్షవిద్య నభ్యసించుటకుగాను గురువుల ఆజ్ఞకు బద్ధుడై మాంస భక్షణ విసర్జించి, వేషభాషలతో, ఆచార విచారములలో, ద్విజన్ముడి వలె మసలుకున్న పవిత్ర హృదయుడు రెడ్డిగారు. ఆంధ్ర పితామహుల సహవాసంతో, రాజాబహద్దర్‌వారి సత్సాంగత్యంతో కాపురం చేసిన రెడ్డిగారు మాంస భక్షణమేకాదు, మధుపానము, ధూమపానమును కూడ దూరంగా ఉంచిన సాధుమూర్తి.

మాట పెళుసు మనసు మెత్తగానున్న రెడ్డిగారిని కొందరు అపార్థం చేసుకునేవారు. కరుకుగా, వ్యంగ్యంగా మాట్లాడుతాడని కొందరాతనిని సమీపించెడివారుకాదు. అసలే రెడ్డిగారి స్వభావం సౌమ్య గంభీరం, అందునా అపరిచితులతో మాట్లాడుటయే అపురూపము; పలుకరిస్తె వెటకారము కరుకుదనము కొట్టవచ్చినట్లు గోచరించెడిది. అది రెడ్డిగారి నైజగుణము. అలా సంభాషించ ఎదుటివారి మనస్సు నొప్పించాలనే తలంపు వారి స్వభావానికి విరుద్ధము. "నిండు మనంబు నవ్యనవనీత సమానము, పల్కు దారుణాఖండల శస్త్రతుల్య" మన్నట్లు ప్రవర్తించెడివారు. వారి అంతర్యాన్ని ఒకసారి పసిగట్టిన విజ్ఞులు, వలదని వారించినా రెడ్డిగారి సహవాసాన్ని వదలెడివారుకాదు. వేములోని తియ్యదనాన్ని గుర్తించు పెద్దలకు రెడ్డిగారి హృదయ నైర్మల్యము, మనంబు నవనీతత్వము అవగత మయ్యేడిది.

అపకారం చేయనంతవరకు అందరూ నావాళ్ళేనని పూసుకొని తిరుగువారు. అవసరం వచ్చినపుడు హిమవన్నగాన్ని సైతం ఢీకొను ధీరోదాత్తుడి స్వభావం రెడ్డిగారిది. అలనాడు నిజాం ప్రభుత్వం ప్రాంతీయభాషలపై దాడి సలిపి వాటిని తుడిచి పెట్టాలని భీష్మించినపుడు రెడ్డిగారు అపర భీష్ముడిలా కలాన్ని ఝళిపించి గోలకొండ పత్రిక ద్వారా తురక ప్రభువుల కుటిల నీతిని సంపాదకీయాల్లో, వ్యాస పరంపరలలో ఎత్తిచూపిన అకుంఠిత ధైర్య

సముపేతుడు. స్వాతంత్ర్యానంతరము కేంద్ర ప్రభుత్వము హిందీభాషా వ్యాప్తికి ఉస్మానియా విశ్వవిద్యాలయాన్ని కైవసం చేసుకోవాలని యత్నించిన పాక్షిక దృక్పథాన్ని సైతము ఏమరక ఎత్తిచూపిన ఘనత రెడ్డిగారికే దక్కుతుంది. "గిల్లి కజ్జాలు తెచ్చుకునే" స్వభావం ప్రతాపరెడ్డిగారి కుండెడిది. దారిన పోయే దానయ్యలతో కాదుసుమా! దుష్టస్వభావము మచ్చుకైనాలేని పండిత ప్రకాండులతో దెబ్బవాటకు దిగెడివారు. వాద ప్రతివాదాల వినోదాలతో విందు చేసుకొనెడివారు. సత్యాన్వేషణా లక్ష్యంతో వాదోపవాదములు జరుగవలెనను తలంపు రెడ్డిగారిది. వాదోపవాదాల్లో సత్య దృష్టి నెన్నడూ విడనాడని సత్యసంధుడు. వారి రచనల్లో ఎక్కడా వ్యక్తి దూషణగాని, పరుషపదాలు గాని మచ్చునకైనా ఉండెడివికాదు. వారికి పండితులయెడ అపార గౌరవము, ప్రేమాదరములే యుండేవి. సరదా కొరకు తరచూ తమ మిత్ర బృందంతో "బ్రాహ్మణుల సహవాసంతో భ్రష్టుడ నైనానని" పలుకుతుండేవారు. వారి ఆ మాటల్లో ఎంత గర్వము, ఎంతటి హుందాతనము ఇమిడి యుండెడిదో విన్నవారికి విదితమే!

గురువర్యుల యెడ రెడ్డిగారికి గల అభిమానము అపారము వెల్లాల శంకరశాస్త్రిగారి షష్టిపూర్త్యుత్సవమును వైభవోపేతంగా జరిపి గురుభక్తిని చాటుకున్న అభిమానధనుడు. ఆమాటకొస్తే గురుతుల్యులైన పండిత వరేణ్యుల నెందరి పట్లనో రెడ్డిగారికి పూజ్యభావముండెడిది. వేదం వెంకటరాయ శాస్త్రి, మానపల్లి రామకృష్ణకవి, ఏలూరిపాటి రామభద్ర చయనులు, చిదిరెమఠం వీరభద్రశర్మ, ఈయుణ్ణి వీరరాఘవాచార్యులు, అనుముల సుబ్రహ్మణ్యశాస్త్రిగారలయెడ రెడ్డిగారికి పూజ్య భావముండెడిది. గోలకొండ పత్రికాలయం ఆనాడొక పవిత్రాలయం, యువకులకు కవి పండితుల కది ఆరాధనాలయము.

తన జీవిత సర్వస్వాన్ని ఆంధ్రమహాజమల సేవకై నీరాజనమిచ్చిన యశస్వి శ్రీసురవరం. మల్లంపల్లి వారన్నట్లు ఆయనలాంటి మిత్రుడిని, విద్వద్వర్యుని, రసజ్ఞుని, కళాభిమానిని అరుదుగా దర్శిస్తాము. బూర్గులవారి

మాటల్లో రెడ్డిగారొక ఉత్కృష్ట సంస్కృతికి నిలయము. అంతటి సద్భావం, సహృదయత్వం, సత్ప్రవర్తన కలిగిన వ్యక్తులు క్వాచిత్కంగా లభ్యమవు తారు. రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారి నానుడిప్రకారం, రెడ్డిగారిది చాల సంస్కృతమైన పవిత్ర జీవితము. విశాల మానవ ధర్మమునకై, తన సర్వ స్వమును సమర్పించిన త్యాగి రెడ్డిగారు. సత్యధర్మము లెందున్నను వానికి తలవంచు నిర్మల హృదయుడు. తన లోపములను బహిరంగముగా అంగీ కరించు వినయము, ఆయనకున్నంత కలవారి కరుదు."

# 14

# రచనలు : రచనా పాటవము

ప్రతాపరెడ్డిగారికి తెలుగు సంస్కృత సాహిత్యములం దెట్లభిరుచి కలిగెనో, వాని నభివృద్ధి పరచుకొనుటకు రెడ్డిగారెట్లు ప్రయత్నించి ఎంత వరకు సఫల మనోరథులైరో తెలిసికొనుట ఆసక్తిదాయకంగా ఉండగలదు. రెడ్డిగారు తొమ్మిదవ తరగతిలో ప్రవేశించు వరకు వారికి తెలుగులో ప్రవేశమే లేదట, నాల్గవ తరగతి వరకే తెలుగు నభ్యసించి, ఐదవ తరగతిలో అందరితోబాటు కోల్స్ మెమోరియల్ స్కూల్‌లో ప్రవేశించినపుడు తెలుగును ద్వితీయ భాషగా తీసుకున్నారట. ఆ కాలంలో కోల్స్ విద్యాలయంలో సంస్కృతమును బోధించుటకుగాను భావనాచార్యులు, కృష్ణమాచార్యులు, అనువారుండిరి. వారి బలవంతముచేతనే రెడ్డిగారు తెలుగు తరగతిని వదలి సంస్కృత తరగతిలో ప్రవేశించినారు. అందుచేత రెడ్డిగారికి తెలుగు పరిచయము అంతంత మాత్రముగా నుండెను. దేశభాషలందు తెలుగు లెస్స అనునానుడిని విన్నవాడగుటచేతను, రెడ్డిగారు మాతృభాషను అభివృద్ధి పరచుకొనుటకు సంకల్పించెను. తెలుగుభాషను క్షుణ్ణంగా అవలోడనచేసి అందు రచనలు సాగించనిదే తన జీవితము నిరర్థకము అను నిశ్చయానికి వచ్చిన రెడ్డిగారు ఆత్మప్రేరణ కారణంగా తెలుగు సాహిత్యమును తిరుగ వేయడం ప్రారంభించారు. రెడ్డిగారు అదే సంకల్పంతో తొమ్మిదవ తరగతిలో నున్నప్పటి నుండియే తెలుగు గ్రంథాలను చదువ నారంభించిరి. ఆరోజుల్లోనే ఆంధ్రదేశంలో గ్రాంథిక వ్యావహారిక భాషావాదముల దుమారము తీవ్రముగా నుండెను. మొదట రెడ్డిగారు చిలకమర్తి లక్ష్మీనరసింహముగారివి చదివి, అనంతరము కందుకూరి వీరేశలింగంగారి కవుల చరిత్రను తిరుగవేసినారట, ఇక పద్యకావ్యాల్లో మొదట చేమకూర వెంకట కవిని

చేపట్టి వారి ''సారంగ ధరను'' పలుసార్లు పఠించి నగం పద్యాలను కంఠస్థం చేసి, ప్రబంధాలపై దృష్టి సారించారట. ఒక నిఘంటువు సహాయంతో ప్రబంధాలన్నిటి సారాన్ని సంగ్రహించినాక, ఛందస్సును, వ్యాకరణమును వల్లించి, రచనా కార్యక్రమాని కుపక్రమించినారట. తెలుగు సాహిత్యాన్నంతా స్వశక్తితో, ఆత్మ విశ్వాసంతో, పట్టుదలతో, ఆపోశనం పట్టి కలం చేతబూనినా రనవలసియున్నది ప్రతాపరెడ్డిగారు.

1. రెడ్డిగారి మొట్టమొదటి రచన ఒక అనువాదగ్రంథము. 1915 సం॥లో రెడ్డిగారు బూత్బీ (Boothby) యను ఆంగ్లేయుడు రచించిన ''In freedom's cause'' అను నవలను తెనిగించారు. అలా అనువదించిన చిత్తు ప్రతిని కర్నూలులో ఒక బీరువాలో భద్రపరచి స్వగ్రామమగు ఇటికేలపాడు వెళ్ళినపుడు పిల్లలెవరో సదరు బీరువాను తెరచి అన్ని చిత్తు కాగితములతోపాటు అనువదించిన నవలా ప్రతిని కూడ తీసుకొనిపోయి మిఠాయికొట్టు వాడికి విక్రయించి పిల్లకాయలంతా మిఠాయి ఆరగించారట ! పాపం, ప్రతాపరెడ్డిగారికి మిఠాయి కూడ దక్కకుండా పోయింది. మొదటి నవల అలా సార్థకమై రెడ్డిగారి స్మృతికి చిహ్నంగా ఉండిపోయింది.
2. ఇక రెండవ రచన ''శుద్ధాంత కాంత'' యను నొక నవల. దీనిని రెడ్డిగారు ''The mysteries of Hyderabad'' అను గ్రంథములో నొకభాగమగు ''Romance of Zenana'' అను విషయంపై ఆధారపడినట్టి ఇతివృత్తము కలది. 1917 సం॥లో యీ రచన పూర్తి కావింప బడింది. కాని దీని నింతవరకు ఎవరూ ప్రచురించలేదు. ఈనవల పరిసమాప్త మైనాక రెడ్డిగారు కొన్ని చిల్లరమల్లర పద్యగద్య రచనలు చేసినారు. పద్యములలో కొన్ని ''కృష్ణాపత్రిక''లో ముట్నూరి కృష్ణారావుగారిచేత ప్రచురింపబడినవి.
3. 1921 సం॥లో ''ఉచ్ఛల విషాదము'' అను నాటకమును రెడ్డిగారు జనవరి మొదటి తేదిన ప్రారంభించి 13 వ, తేదీలోగా ముగించారట.

ఎవరో మద్రాసులోగల నాటకకంపెనీవారు నాటకాన్ని వ్రాసి తమకు సమర్పిస్తే 500 రూపాయలు బహుమతి నిస్తామని ప్రకటించారట. బహుమతి పొందుదామను ఆసక్తికొలది వ్రాసి అంత త్వరలో వారికి సమర్పిస్తే, రెండు సంవత్సరాలు నాటకాన్ని తమవద్ద ఉంచుకొని తిరిగి రెడ్డిగారికి పంపించారట. రెడ్డిగారు 1938 సం॥లో గోల కొండలో ముద్రించి తమ చిన్నాయినగారికి అంకితం చేశారు.

4. 1924 సం॥లో "భక్త తుకారామ్" నాటకాన్ని రెడ్డిగారు ఇరువది యారు దినములలో వ్రాసి, ఆనాడు మద్రాసునుండి శ్రీరాజమన్నారు గారి సంపాదకత్వమున వెలువడు "కళ" యను మాస పత్రికలో మూడంకముల నాటకంగా వ్రాసి ప్రచురించినారు. ఈ నాటకమునే సికింద్రాబాదులోగల జగదీశ నాట్యమండలివారు రెడ్డిగారిచేత ఐదంక ముల నాటకంగా పెంచి వ్రాయించుకున్నారు. 1952 లో ఈ నాటక మును రెడ్డిగారు "ప్రజావాణి" ముద్రణాలయంలో ప్రచురించియుండిరి. అనంతరము ఆయా పుస్తక ప్రచురణ సంస్థలవారు ఉల్లేఖింప బడిన పుస్తకములను ప్రచురించారు. కొన్ని పుస్తకములను రెడ్డిగారే గోల కొండ ప్రచురణాలయంలో ముద్రించుకొన్నారు.

5. గ్రామజన దర్పణము 6. ఎల్లోరా శిల్పము 7. పూనా వ్యవసాయ ప్రదర్శనము 8. కర్నూలు రాజుల వంశావళి 9. నిజాము రాష్ట్రపాలనము 10. గ్రంథాలయోద్యమము 11. మద్యపానము — ఈ చిన్ని పుస్తకము మొదట 1920 సంవత్సరములో ఇరవై పేజీ లలో ప్రచురింపబడెను. దాని ఇతివృత్తమునే పెంచి ఒక మిత్రుని కోరికపై 90 పేజీల సైజులో వ్రాసి అతని కిచ్చివేసిరి. అది కూడా ప్రచురింపబడెను. అనంతరము ఆంధ్రజనసంఘము వారి కోరికపై మరొకమారు వ్రాసిరి. అది కూడా ప్రచురింపబడెను. మూడుసార్లు మూడు సందర్భాలలో ఈ చిన్ని పుస్తకం ప్రచురింపబడినా ఏ ఒక్క ప్రతికూడా ప్రస్తుతము లభ్యమగుటలేదు.

12. హిందువుల పండుగలు :— మొదట ఈ గ్రంథం గోలకొండ ప్రచుర ణాలయం ద్వారా ముద్రింపబడెను. అనంతరము కర్నూలు నందు గల బాలసరస్వతి ముద్రణాలయంవారు రెండవసారి ప్రచురించి యుండిరి.

13. హైందవ ధర్మవీరులు లేదా పోలీలు :— ఈ పుస్తకమును ప్రచురిం చిన ఆరుమాసములలోనే పునర్ముద్రణ భాగ్యమునకు నోచుకున్న చక్కని వీరగాథాసంపుటి.

14. సంఘోద్ధరణము :— రెడ్డిగారు అప్పుడప్పుడు వ్రాసి ఆయా పత్రిక లలో ప్రచురించుతూ వచ్చిన వివిధ వ్యాసములనుండి సేకరించి ప్రచురించిన వ్యాససంపుటి. 1925 లో దీని ప్రథమముద్రణ జరిగెను.

15. ప్రతాపరెడ్డి కథలు :— ఇదొక పన్నెండు చిన్నకథల సంపుటి. గోల కొండ పత్రికలో అడపా తడపా గుప్తనామములతో వ్రాసిన కథల నుండి సేకరించి కథలసంపుటిగా గోలకొండ ప్రచురణాలయం ద్వారా ముద్రించబడినది. కాని యీ కథలన్నీ పుస్తకరూపంలో పునర్ము ద్రింపబడలేదు.

16. మొగలాయి కథలు :— ఈ కథలన్నీ ఒక్కొక్కటిగాను, రెండు మూడుకథలను కలిపి అణా గ్రంథమాలవారు ప్రచురించారు. ఎక్కువ కథలను సేకరించి అణా గ్రంథమాల రూపంలో ప్రచురించినది శ్రీవెల్దుర్తి మాణిక్యరావుగారే !

17. ప్రాథమిక స్వత్వములు లేదా ప్రజాధికారములు:— మొదట యీపొత్త మును 1939 సం॥లో దేశోద్ధారక గ్రంథమాలవారు హైద్రాబాదులో ప్రకటించి యుండిరి. అనంతరము 1959 సంవత్సరంలో ద్వితీయ ముద్రణ జరిగెను. అప్పుడు ప్రాథమిక స్వత్వములను పేరును మార్చి అందరికి విదితమగునట్లు "ప్రజాధికారములు" అను శీర్షికతో ప్రచురింపబడెను.

18. రాజా బహద్దర్ వెంకటరామా రెడ్డి జీవిత చరిత్ర :— ఈ గ్రంథమును రెడ్డిగారు ఆంధ్ర బాలికల విద్యాలయ కార్యనిర్వాహక వర్గమువారి కోరికను పురస్కరించుకొని వ్రాసి, ప్రచురణాధికారములతో సహా వారికే దత్తము చేసిరి. కార్యనిర్వాహక వర్గమువారు ఈ పుస్తకమును 1938 సంవత్సరంలో ప్రచురించిరి.

19. చంపకీ భ్రమర విషాదము :— ఇది 250 పద్య సుమముల చిన్న కావ్యము. ఈ కావ్యము కాల్పనికేతివృత్త విరాజితము. కాని దురదృష్ట వశాత్తు దీనిని రెడ్డిగారు ఎక్కడో పోగొట్టియున్నారు. మళ్ళీ లభించలేదు.

20. హరి శర్మోపాఖ్యానము :— ఇది నూరు పద్యముల హాస్యరస ప్రధాన సరసకావ్యము. దీనికి కూడ భ్రమర విషాదమునకు పట్టిన అదృష్టమే సంప్రాప్తించినది. ఇవి రెండు తక్క రెడ్డిగారి పద్యకావ్యాలు పుస్తక రూపంలో లేవు, వ్రాయబడలేదు కూడాను.

21. హంవీర సంభవము :—ఇదొక చిన్ని పద్యకావ్యము. ఒక కాపుకన్యను చిత్తూరు క్షత్రియరాజు వలచి వివాహమాడిన వీర రసాత్మక రసికేతి హాస ప్రధానము. చిత్తూరు యువరాజు ఒక అడవి పందిని తరుము కుంటూ ఒక జొన్నచేనుదాకా వస్తాడు. ఆ సూకరము చేనులో జొరబడుతుంది. చేను కాపరియైన కాపువనిత, తనవద్ద గల కొడవలి సహాయంతో పందిని చంపి రాజకుమారుడి గౌరవ ప్రేమాభిమానములకు పాత్ర మవుతుంది. వారికి వైభవోపేతంగా వివాహ మవుతుంది. హంవీరుడను పుత్రుడు కూడ కలుగుతాడు. చక్కని శైలీపాకమున రెడ్డిగారు ప్రేమగాథను వీరప్రణయేతి వృత్తంగా పదిపేజీలలో రచించిన చిన్ని పద్యకావ్యము.

22. ఆంధ్ర లిపి సంస్కరణము :— ఆంధ్రలిపి సంస్కరణకు సంబంధించి వ్రాయబడిన చక్కని పరిశోధనాత్మక పుస్తకము. రెడ్డిగారు

ఈ పుస్తకంలో సూచించిన సంస్కరణలను సాహితీవేత్తలు, భాషా సంస్కర్తలు సమ్మతిస్తె తెలుగువర్ణమాల చాల వరకు తగ్గిపోతుంది. టైపు టెలిగ్రాపుల సౌకర్యం కూడ సుకరమవుతుంది. ఈ పుస్తక రాజమును విజ్ఞానవర్ధినీ పరిషత్తువారు 1947 సంవత్సరంలో ప్రచురించినారు.

23. యువజన విజ్ఞానము :— పెద్దబాలశిక్షను దృష్టియందుంచుకొని రెడ్డిగారు ఈ యువజన విజ్ఞానమను గ్రంథమును రచించారు. ఇది యువజనులకు, విద్యార్థులకు, పౌరజనులకు కూడ చాల ఉపయుక్తమగునట్టి విజ్ఞానాత్మక గ్రంథము. బాలబాలికలకు పెద్దబాలశిక్ష ఎంత ఉపయుక్తంగా నుండెడిదో యువజన విజ్ఞానము కూడ యువలోకమునకు అంత విజ్ఞాన ప్రదాయకంగా ఉంటుంది. 1947 సంవత్సరంలో ఈ పుస్తకం సంకలనం చేయబడింది. 1951 సంవత్సరంలో సురవరం రంగారెడ్డిగారి షష్టిపూర్తి చిహ్నముగా విజ్ఞానవర్ధినీ పరిషత్తు పక్షాన ప్రచురింపబడింది.

24. రామాయణ విశేషములు :— రెడ్డిగారు సంస్కృత రామాయణమును చదివి ప్రాచ్య పాశ్చాత్య పండితుల చారిత్రక దృక్పథముల నాధారంగా గొని చక్కని విమర్శనాత్మక గ్రంథరాజముగా రూపొందించారు. ఈవిశేషములను తొలుత వ్యాసముల రూపములో ''విభూతి'' అను పత్రికలో ప్రచురించినారు. శ్రీ చిదిరెమఠం వీరభద్రశర్మగారు తమ 'విభూతి' ద్వారా రామాయణ విశేషములనబడు వ్యాసములను అంచెలంచెలుగా 1929 సంవత్సరంలో ప్రచురించినారు. ఈ వ్యాసములను పునర్ముద్రణలో డా॥ బి. రామరాజుగారు ఆంధ్ర రచయితల పక్షమున 1954 సం॥లో చక్కగా విపులంగా ముద్రించి భాషాసేవ చేసినారు.

25. ఆంధ్రుల సాంఘిక చరిత్ర :— రెడ్డిగారి అంతిమ రచనయు, ప్రశస్తమైన రచనయు నిదియే। 1929 సం॥లో ప్రారంభించి 1949 వరకూ

రచింపబడుతూ వచ్చిన యీ ఆంధ్రుల సాంఘిక చరిత్ర రెడ్డిగారి పరిశోధన పాటవమునకు, విమర్శనాత్మక దృక్పథమునకు చక్కని ప్రతీక । సుమారు వేయిసంవత్సరాల ఆంధ్రుల సాంఘిక చరిత్ర, వారి కట్టు, బొట్టు, జుట్టు పద్ధతులు, వారి ఆటపాటలు, వింతలు వినోదాలు, యుద్ధాలు తంత్రాలు, అన్నీ చారిత్రక పంథాలో గుది గుచ్చబడినవి. ఆంధ్రసారస్వత పరిషత్తువారీ పుస్తకాన్ని 1950 సం॥లో ప్రచురించి ఆంధ్రులకు, ఆంధ్రభాషామతల్లికి ఎనలేని సేవ చేసినారు. భారతదేశం స్వతంత్రం అయినాక రచింపబడిన భారతీయ భాషలన్నిటిలోకి అత్యుత్తమ గ్రంథంగా కేంద్ర ప్రభుత్వం దీనిని పరిగణించి 5000 రూప్యముల బహుమతి ప్రదానం చేసినది.

పైన పేర్కొనబడిన రచనలేకాక రెడ్డిగారు సంపాదకుడుగా, పాత్రికేయుడుగా, విమర్శకుడుగా, వ్యాసకర్తగా, కవిగా సుమారొక వేయి రచనలు చేసినారు. ఇందు పద్యాలు, తమాషా ముచ్చట్లు, విమర్శనాత్మక వ్యాసాలు, సాహితీ విమర్శలు దాదాపొకవేయి వరకు గోలకొండ పత్రికలోను, వివిధ పత్రికలలోను ప్రచురింపబడినవి.

అముద్రితంగా ఉన్న పుస్తకములలో "ఆరె వీరులు" అను నవల యొకటి. ఇదిగాక, ఒక సాంఘిక నాటకమును కూడ ముప్పది నలుబది పేజీలవరకు వ్రాసి అసంపూర్తిగా ఉంచారు. కాపుకుల నిర్ణయము అనబడు ప్రశస్తమైన విమర్శనాత్మక గ్రంథము కూడ అముద్రితంగానే యుండిపోయింది. దీనిని రాజా సదాశివరెడ్డిగారు కొంతవరకు వ్రాసి కాలంచేశారు. వారి గ్రంథాన్ని ప్రతాపరెడ్డిగారు పూరించి పూర్తిచేశారు. కాపులన ఎవరు? కర్షకులా? రక్షకులా? రెడ్లా? వైశ్యులా? క్షత్రియులా? శూద్రులా? అను చర్చను ఆసక్తిదాయకంగా సాగించి, సోపపత్తికంగా, హేతుబద్ధముగా, విమర్శనాత్మకంగా కాపులు వైశ్యులేయని నిర్ధారించబడింది. ప్రచురింపబడవలసిన చక్కని విమర్శనాత్మక గ్రంథము.

2. రచనాపాటవము :

రెడ్డిగారొక వ్యక్తికాదు. అతడొక సంస్థ, వివిధ సంస్కృతీ సంస్థలకు విరాట్సంస్థ. నేడు హైద్రాబాదులో మూడు పూలు ఆరుకాయలుగా వికసిస్తున్న వసతి గృహాలతో, విద్యాలయాలతో, సాహితీ పరిషత్తులతో, ప్రచార సంఘాలతో, గ్రంథాలయాలతో, గ్రంథాలయోద్యమాలతో ప్రతాప రెడ్డిగారికి అవినాభావ సంబంధ ముండెడిది. రెడ్డిగారిలో నిబిడమైయున్న అభ్యుదయ భావాలే వారి నాయా సంస్థలతో వీడని సంబంధాన్ని, తెగని బంధాన్ని చేకూర్చినవి. వారికిగల రచనాసక్తి, రచనా శక్తి, ప్రతిభావ్యుత్పత్తులు, పరిశోధనా పాటవములే వారిని పండితలోకము నాకర్షించునట్లు ప్రేరేచినవి.

రెడ్డిగారి రచనలో కర్ణాటక సాహితీ పోకడలు, తెలంగాణపు తేట తెనుగు నుడికారము, ఉర్దూ బాణి బిగువు ద్యోతక మవుతవి. రెడ్డిగారు సంస్కృతాంధ్ర కర్ణాటక హిందీ ఉర్దూ పారసీకాంగ్ల భాషలను అధ్యయనం చేసినారు. వారి పఠన పాటవం అతి విస్తృతము. చేతికందిన ఉత్తమ సాహిత్య పరిశోధన విమర్శనాత్మక గ్రంథాలేవీ వారి దృష్టి నాకర్షించకుండా మిగులలేదు. కనుకనే వారి భాషలో ఆయాభాషల పదజాలము తామరతంపరగా వచ్చి పడుతుంటది. బూర్గులవారన్నట్లు రెడ్డిగారి రచనల్లో కర్ణాటాంధ్ర భాషలకున్న బంధుత్వము బహుళంగా గోచరిస్తుంది. శబ్దజాలపు ఎన్నిక లోను, ప్రయోగంలోను నాటి హైద్రాబాదు రచయితల కుండే విశిష్టత ప్రస్ఫుట మవుతుంది. మల్లంపల్లివారి మాట ననుసరించి రెడ్డి రచనలో ఒక రమ్యత, శైలిలో ఒక ఆవేగము, భావ పరిపుష్టి, ప్రసన్నత, మధురిమ, వాటిని మించిన చురుకుదనము, ఓజస్సు, తేజస్సు ఉన్నవి. వారి పుస్తకం చేత ఉంటేచాలు ముగియు వరకూ అది మనలను వదలదు. పఠనాభిలాష లేని పాఠకుడిని సైతం వారిశైలీ పాటవం అక్షరాస్యుల నాకర్షిస్తుంది. వారి రచనలో పురాణ శైలీపావిత్ర్యంగాని, కావ్యశైలీ గాంభీర్యంగాని గోచ

రించదు. అందు స్ఫురించేది హిమవత్తుంగాపాతభాగీరథీపయోద్వేగము. చెణుకులను విసురునపుడు, మర్యాదాతిక్రమణం లేకుండా హాస్యభరిత పద జాలంతో సున్నితమైన విసురులతో పఠితల హృదయాలను రంజింపజేస్తూ ముందుకు లాక్కు పోతుంది. వారి రచన కున్నంత శక్తి మధురిమ, రసోద్వేగము, కలవారిలో అరుదు. చారిత్రక వ్యాసాలైనా, విమర్శనాత్మక గ్రంథాలైనా, పరిశోధనాత్మక పొత్తములైనా వారి రచనా వైదగ్ధ్యమునకు నికషోపలములే! అంత పొంకంగా, ఇంపుగా భావస్ఫోరకంగా, మృదు మధురంగా రచన చేయువారు ఆంధ్రదేశంలో కూడ అరుదేనన్న అతివ్యాప్తి కాదేమో!

రెడ్డిగారు కవులలో కవి, పండితులలో పండితుడు, నాయకులందు నాయకుడు, పాత్రికేయులలో సంపాదకుడు, పరిశోధకులలో మహాపరిశోధ కుడు, దేశాభిమానులలో దేశాభిమాని, సంస్కర్తలలో సంఘ సంస్కర్త, సహృదయులలో సరసుడు. అటువంటి విద్వద్వర్యుని, రసజ్ఞుని, కళాభి మానిని, సత్యరతుని సకృత్తుగా చూస్తాము. తనకుగల లోపములను బహి రంగముగా అంగీకరించుటలోను, ఎదుటివారి సత్యవాదమును అంగీకరిం చుటలోను, రెడ్డిగారికున్నంత హృదయ నైర్మల్యము సాహితీలోకంలో అరుదు. పిడివాదమునకు పేరుగాంచిన పండితమ్మన్యులు కొందరు తమ వాదమునకు పుష్టిని చేకూర్చుటకుగాను కృతక సిద్ధాంతములను, అభూత కల్పనలను చేస్తూ, చివరకు తాళపత్ర గ్రంథాలను సైతం సృష్టించి తమ వాదనకు బలమును చేకూర్చుకొను నంతటి సాహసమునకు కూడ వెను దీయరు. ఇంకా కొందరు పండితులు తమకంటె చిన్నవారి నుండి క్రొంగ్రొత్త విషయాలను నేర్చుకొనుటను అవజ్ఞగా భావిస్తారు. రెడ్డిగారి కలాంటి పట్టింపులేవీ లేవు. బి. రామరాజుగారిలాంటి యువకులు సేకరించిన మాండ లిక పదాలను అర్థసహితంగా తెలిసికొని తమ నిఘంటువున కెక్కని పదాల పట్టికలో చేర్చుకున్న సాధుమూర్తి శ్రీసురవరం. ఆంధ్రుల సాంఘిక చరి త్రలో దొరలిన దొసగులను ఎత్తి చూపిన రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారికి

కృతజ్ఞత వ్యక్తం చేయడమే కాకుండా వారి వ్యాసమును తమ సాంఘిక చరిత్రయొక్క మలి ముద్రణలో చేర్చుకున్న సౌమ్యుడు శ్రీ ప్రతాపరెడ్డి. వారి సాహితీవ్యాసంగమంతయు నిట్టి విశేషములతోనే విరాజిల్లినది. రాళ్ళ పల్లి వారన్నట్లు రెడ్డిగారు విశాల మానవధర్మమునకై తమ సర్వస్వమును సంతోషపూర్వకంగా సమర్పించుకున్న త్యాగధనుడు. జీవితమను చేదు వృక్షానికి అరుదుగా లభించు సజ్జన సాంగత్య ఫలము, సాహితీ వ్యాసంగ ఫలముల రెండింటినీ స్వీకరించి తనివితీరా రసాస్వాదన చేసిన ధన్యజీవి శ్రీ సురవరము. సురలు శ్రీ సురవరమున కొసగిన సాహితీ వరములను సఫలీకృతము చేసుకున్న సార్థకజీవి.

15

# గ్రంథవిమర్శనము

## ( రెండవ భాగము )

## 1. పరిశోధనాత్మక పొత్తములు

### 1. ఆంధ్రుల సాంఘిక చరిత్ర

ఆంధ్రుల సాంఘిక చరిత్రను 1929 సంవత్సరంనుండి 1949 వరకు వ్రాయడమో, కూర్చడమో, చేర్చడమో జరుగుతూ వచ్చింది. ఆ. సా. చరిత్ర ప్రచురితం కావడానికి ప్రబలకారకులు శ్రీయుతులు దేవులపల్లి రామానుజరావు, పులిజాల హనుమంతరావు, లోకనంది శంకర నారాయణ రావుగారలే నని ప్రతాపరెడ్డిగారు ఆ. సా. చరిత్ర పీఠికలో తెలియజేసారు. ఆ. సా. చరిత్రను వ్రాయడానికి అంతకాలం పట్టిందంటే రెడ్డిగారు ఎన్ని పుస్తకాలను అవలోడనచేసి, ఎన్ని శాసనాలను పరిశీలించి, ఎన్ని చారిత్రక గ్రంథాలను పరిశోధించారో తలచుకుంటే వారి పరిశోధనా పాటవం, అద్భుత దీక్షాదక్షత అవగతం కాగలదు.

రెడ్డిగారిలో చదువరులు కవినీ, పండితునీ, పాత్రికేయునీ, కథకునీ, విమర్శకుడినీ చూడవచ్చు. కాని వీటన్నిటిని మించిన పరిశోధకుడిని వారి ప్రతి రచనలో పసిగట్టి యుంటారనడానికి ఆస్కారం ఉంది. ఆయన ప్రతి పుస్తకంలో అంతో ఇంతో పరిశోధనా పొకడ పొడకడుతునే ఉంటుంది. అతడు భేషజంలేని భారతీయుడు, పదహారణాల ఆంధ్రబిడ్డడు. దేశాభిమానము, జాతీయాభిమానము వారి కలంయొక్క ప్రతి మలపులో ప్రత్యక్ష

మవుతూ ఉంటుంది. వారిని పరిశోధకాగ్రగణ్యుల శ్రేణిలో చేర్చినవి వారి ''రామాయణ విశేషములు'' మరియు ''ఆంధ్రుల సాంఘికచరిత్ర'' అని చెప్పవచ్చును. ''హిందువుల పండుగలు" కూడ వారి పరిశోధనోత్సుకతకు ప్రథమ సోపానమే!

"ఏ దేశ చరిత్ర చూచినా ఏమున్నది గర్వకారణం'' అను విషయాన్ని జీర్ణించుకున్న రెడ్డిగారు ప్రజల చరిత్రను వ్రాయడానికి సంకల్పించడంలో ఆశ్చర్యం లేదు. పాశ్చాత్యులు రెండున్నర శతాబ్దాలక్రితమే తమ జాతి చరిత్రను సప్రమాణంగా వ్రాసిపెట్టుకున్న విషయాన్ని గమనించిన రెడ్డిగారు ఆ. సా. చరిత్రను వ్రాయసంకల్పించారు. కాని మనకు ఉపలబ్ధములగు చరిత్రలు సత్యదూరములు, లభించెడు కైఫియత్తులు దాస్తావేజులు జీర్ణములు ; కట్టడములు మరియు శాసనములు కూడ జీర్ణావశేషములే! ఇక పోతే వాఙ్మయమా అక్కరకురాని చుట్టము లాంటిదే. ఇటువంటి పరిస్థితులలో సరియగు, సప్రమాణమగు సాంఘిక చరిత్రను వ్రాయుట చతురాననునికైనను చేతికిమించిన పనియే! అందుకే రెడ్డిగారు తమ పీఠికలో అవసరమగు పరికరములు లభ్యము కానందున తన పుస్తకము తనకే తృప్తిని కలిగించలేకపోయిందని విచారించారు.

ఆంధ్రుల సాంఘికచరిత్రను వ్రాయు ఉద్దేశముతో కాకపోయినా సాంఘిక దృక్పథంతో రెడ్డిగారి రచనకు పూర్వమే తెనుగులోను, ఆంగ్లంలోను శ్రీయుతులు చిలుకూరు వీరభద్రరావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ, నేలటూరు వెంకట రమణయ్యగారలు కొన్ని చారిత్రక ఘట్టాలను సాంఘిక దృక్పథంతో వ్రాశారు. కాని సంపూర్ణమగు సాంఘిక చరిత్రను ఎవరూ వ్రాయ సంకల్పించలేదు. రెడ్డిగారి రచనను చదివిన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఒక లేఖవ్రాస్తూ ''మీ గ్రంథము చాల ముచ్చట గొలిపినది. మీ రీగ్రంథమును రచించుటకు ఎల్లతెరగుల సమర్థులు...చదివినంతలో మీరు ప్రామాణికులైన సత్యరతులైన పవిత్ర హృదయులని గుర్తించినాను. మీ రీ గ్రంథము నింత కింకను నాలుగైదురెట్లు విషయ విశేషములతో ప్రవచించి పునర్ముద్రణ

చేయుటకు తోడ్పడ కుతూహల పడుతున్నాను.'' అని తెలియజేసినారు. కాని శా గారంతలోనే కైలాసానికేగుట వలన వారి ఆశయం ఈడేరలేదు.

ప్రథమ ముద్రణలో దొరలిన కొన్ని లోపములను రెడ్డిగారు ద్వితీయ ముద్రణలో సవరించుకున్నారు. ఆంధ్రుల సాంఘిక చరిత్రను చదివి రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు వారికి తోచిన దొసగులను వ్రాసి పంపుతె ఆ వ్యాసమును ఆసాంతం రెడ్డిగారు ఆ. సా. చరిత్రయొక్క పునర్ముద్రణలో అనుబంధ పట్టికలోచేర్చి ప్రచురించారు. తూర్పు చాళుక్య యుగమను క్రొత్త ప్రకరణమును కూడ మలి ముద్రణలో చేర్చినారు. మొట్టమొదట ఉట్టంకించబడని కొన్ని క్రీడావిశేషములను కూడ ద్వితీయ ముద్రణలో విపులంగా చర్చించి ప్రచురించడం జరిగింది. ఇవిగాక శాలివాహన శకంనుండి రాజరాజ నరేంద్రుని కాలంవరకు గల సాంఘిక చరిత్రను వ్రాసి మరొక ముద్రణలో ప్రచురిద్దామని రెడ్డిగారు అభిలషించారు కాని వారి కంతలోనే పిలుపురావడం వలన వారి సంకల్పము నెరవేరలేదు.

రెడ్డిగారి ఆంధ్రుల సాంఘిక చరిత్రరచనకు ఉపకరించిన పుస్తకములు ముఖ్యంగా బసవపురాణము, పండితారాధ్య చరిత్రము, క్రీడాభిరామము, పల్నాటి వీర చరిత్రము, ద్వాత్రింశత్సాల భంజికలు, ఆముక్తమాల్యద, పరమయోగి విలాసము, సత్య హరిశ్చంద్ర ద్విపద కావ్యము, శుకసప్తతి, వేంకటనాథుని పంచతంత్రము, ప్రముఖశతక రాజములు, భాషీయదండకము, ఏనుగుల వీరాస్వామి కాశీయాత్ర, పాండురంగ విజయము, కాళహస్తి మాహాత్మ్యము, శ్రీనాథుని చాటువులు మున్నగునవి.

ఇవిగాక తెలంగాణ శాసనముల గ్రంథము, అమీర్ ఖుస్రూయొక్క "నూరె సిహర్," ''ఖజానుల్ ఫతీహ''తో బాటు థర్స్టన్ దొరగారి ''Castes and tribes of South India''కూడ గలవు.

కావ్య ప్రబంధాలలో నూటికి తొంభైపాళ్లు సాంఘిక చరిత్ర కుపకరించునవి కావు. స్థానిక చరిత్రలు చాలభాగము పాక్షికపు వ్రాతలతోను,

పుక్కిటి పురాణములతోను, కూడి యుండుటవలన సత్యశోధనకు అవరోధము కలుగుతుంది. విదేశీ యాత్రికుల వ్రాతలుకొన్ని పనికివచ్చినా, కొన్ని అక్కరకు రావు. ఇకనాటి శాసనాల్లో వాడబడిన పదజాలము మాండలికము కావడం వలన వాటి అర్థాలు కొన్ని యీ నాడు వాడుకలో లేవు. ముఖ్యంగా నౌకాయానము, వాటి సుంకములు మొదలగు వాని అర్థస్ఫురణకు వినియోగించిన పదజాలముయొక్క తాత్పర్యమును గ్రహించుట దుస్సాధ్యమై పోయింది. ఇక నాడు గీచిన చిత్తరువుల ఆధారంగా కొంత చరిత్రను తోడ వచ్చునని ఆశిస్తే అవి కూడ తురకల దండయాత్రలరాపిడిలో తుడుచుకు పోయినవి. నాటి మందిరాలు హైందవ సంస్కృతీ కేంద్రాలుగా ఉపకరించెడివి. మన పుస్తక భండాగారమంతా వాటిలో నిక్షిప్తమైయుండెడిది. వాటిని కూడ తురక పాదుషాలు దోచుకొని, పుస్తకాలను మట్టిపాలో, నీటిపాలో, అగ్నిపాలో చేసియుండుటవలన సాంఘిక చరిత్ర గ్రథనం తలకుమించిన భారంగా తయారైనది.

ఇన్ని వ్యయ ప్రయాసలకోర్చి, అవరోధముల నధిగమించి, ఆధారముల నన్వేషించి, ఏకోన్ముఖ దీక్షా దక్షతతో సుమారు ఇరువదేండ్లు నిర్విరామ కృషిచేసి కృతకృత్యుడైన రెడ్డిగారి "ఆంధ్రుల సాంఘిక చరిత్ర" అఖిలాంధ్రావని కాదర పాత్ర మగుటలో అబ్బురంలేదు. రెడ్డిగారు బహుభాషా కోవిదులగుటవలన ఫెరిస్తా అమీర్ ఖుస్రూవంటి యాత్రికులు ఉర్దూ పారసీక భాషలలో వ్రాసిన గ్రంథములను పరిశీలించుట వలన, అన్యథా లభ్యముకాని చారిత్రకాంశములు ఆంధ్రుల సాంఘిక చరిత్ర పుటల నలంకరించినవి. రెడ్డిగారి పుస్తక పఠన వ్యసనము అనంతము. వా రే పుస్తకమును చదివినా, అందెంతమాత్రము ఆ. సా. చరిత్రకు పనికివచ్చు అంశము లభించినా, దానిని ప్రత్యేకంగా ఎత్తిపెట్టుకొని, విషయ వివరణకనువుగా ఆయా సందర్భాలలో ఉపయోగించుకొన్నారు. జనపదాలలో నిక్షిప్తమైయున్న సంప్రదాయములను, ఆచార వ్యవహారములను జ్ఞాననేత్రముతో

విలోకించి వాని ఆంతర్యమును పుణికిపట్టుకున్న రెడ్డిగారి బుద్ధిసూక్ష్మత శ్లాఘాపాత్ర మనకతప్పదు.

ఆంధ్రుల సాంఘిక చరిత్రలో రెడ్డిగారు ఉల్లేఖించిన ప్రజా జీవితరేఖ లెలాంటివి? వారి రచన ఎంతవరకు ఆంధ్రుల సర్వతోముఖ వికాసమును వివరించగలిగినది? అను అంశములు పరిశీలించ దగినవి. ఏ దేని యొక జాతియొక్క సంస్కృతి ఆ జాతికి సంబంధించిన భావ సంచయమునకు, అది నిర్వహించు కార్యక్రమముల యొక్క సమగ్ర స్వరూప స్వభావాదులచేతనే నిర్ణయింపబడును. జాతియొక్క భావములు, వారు చేయు కార్యముల సమగ్ర స్వరూపమునే ఆమూలాగ్రముగా నిర్వచించి ప్రతిబింబింప జేయునదే సాంఘిక చరిత్ర యనబడును. రెడ్డిగారు తమ ఆ. సా. చరిత్రలో యీ క్రింది అంశములను పరిశీలించియున్నారు. 1. మతము-మత సంస్కారము. 2. కులము - వృత్తులు. 3. యుద్ధ తంత్రము - సైనిక వ్యవస్థ. 4. కళలు - విద్య. 5. ప్రజా సౌకర్యములు. 6. వ్యాపారము - వాణిజ్యము. 7. ప్రజా వినోదములు - ఆటపాటలు. 8. స్త్రీలు - వారి జీవన విధానము. 9. పరిపాలనా వ్యవస్థ.

సహస్ర సంవత్సరాల సాంఘిక చరిత్రయొక్క రూపురేఖలు పైనుల్లేఖితాంశములలో విపులీకరించ బడినవి. రెడ్డిగారి రచన ప్రశస్తమగు మాతృక గ్రంథరాజము. అపూర్వములు, అచుంబితములగు పదజాలముల నెన్నింటినో రెడ్డిగారు విశ్లేషించి తమ అపార శేముషీ వైదుష్య కాంతులను ప్రసరింపజేసి చరిత్ర చీకటి కోణములను ప్రకాశవంతము చేసినారు. సార్వపథీనమైన వారి సూక్ష్మదృష్టి అంతరాంతముల ప్రవేశించి అమూల్య రత్నరాసులను పైకి తెచ్చింది. కొన్ని సందర్భాలలో విషయ వివరణకొరకు పండితులతో దీర్ఘచర్చలు జరిపి సామాన్యంగా బోధపడని జటిల పదజాలమును విడమరచి వ్యాఖ్యానించడం జరిగింది. ఆ యా సన్నివేశములను సందర్భానుసారంగా వ్యాఖ్యానించి వ్యంగ్యరీతి కర్తవ్యబోధ చేయబడింది. పల్లెటూరి ఆటపాటల ఆంతర్యమును విడమరచి అరటి పండొలిచి అరచేతం

బెట్టినట్లు వ్యాఖ్యానించబడింది. అయినా రెడ్డి గా రంగీకరించినట్లు తగిన పరికరములు లభ్యము కానందువలన ఆ. సా. చరిత్ర రచన సంతృప్తికరంగా రచింపబడ లేదనుమాట వాస్తవమే!

విషయ విన్యాసమునందు, విషయ వివరణమునందు కొంతపొందిక కుదురలేదు. రెడ్డిగారు తమకు లభ్యమైన సమాచారమును యథామాతృకగా ఆ. సా. చరిత్రలో జొప్పించడం జరిగింది. తూర్పు చాళుక్యరాజుల కాలం నుండే ఆ సా. చరిత్ర వ్రాయబడింది. కాకతీయుల యుగానికీ, చాళుక్యుల కాలానికీగల సాంఘికాచారములలో, మత సాంస్కృతిక విలువలలో ఏమంత తేడా చూపెట్టబడలేదు. శాతవాహనుల కాలంనుండీ విష్ణుకుండినుల యుగం వరకూ గల సాంఘిక చరిత్ర ఉపేక్షింప దగినదికాదు. ఆంధ్ర బౌద్ధము, ఆంధ్రుల ప్రాకృత భాషాసేవ, అజంతా ఎల్లోరా శిల్పవిన్నాణము, సాంచీ స్తూపములు, నాగార్జునకొండ, అమరావతీ విద్యా పీఠములసేవ, ఆంధ్రుల ఖండాంతర వాణిజ్య దిగ్విజయయాత్రల ప్రభావము మున్నగు అంశములన్నీ పరిశీలనాంశములే! రెడ్డిగారి కృషిని సమగ్రము, సర్వతోముఖ వికాసమయము చేయుటకు పండితులు, పరిశోధకులు పూనుకొని కృషి చేయవలసియున్నది.

ఆధునిక యుగము అనగా సిపాయిల తిరుగుబాటు (1857) కాలము నుండి ఇరువదవ శతాబ్ద్యుత్తర భాగమువరకు పాశ్చాత్య ప్రభావం వలన భారతీయుల మత, సాంఘిక, సాంస్కృతిక, విద్యా, రాజకీయ విషయాలలో కలిగిన భావపరివర్తన వలన, ఆంధ్రుల సాంఘిక మత ఆచారవ్యవహారాదులలో ఎట్టిమార్పు సంభవించినదో సాకల్యంగా పరిశీలించి తరతమ భేదముల నుల్లేఖిస్తూ గ్రంథస్థం చేయాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ముఖ్యంగా యీ క్రింది సూచింపబడిన అంశాలపై విపుల పరిశోధనగావించి సమగ్రాంధ్ర సాంఘిక చరిత్ర రచనకు కృషి చేసినయెడల ముదావహంగా ఉంటుంది.

శిలా తామ్ర శాసనములు, నాణెములు, ప్రాచీన నిర్మాణములు వాని వాస్తు చరిత్ర పరిశీలన, భూగర్భ సమాధులు, వాఙ్మయము, భాష మరియు

శబ్దజాలముయొక్క పుట్టుపూర్వముల చరిత్ర, విదేశీయుల వ్రాతలు, కైఫీయతులు, యాత్రికుల అభిప్రాయముల పరిశీలన ముఖ్యముగా గమనించాల్సి ఉంటుంది.

మొత్తముపై రెడ్డి గారొక దివిటీని వెలిగించి, రాచబాటను నిర్దేశించి పోయినారు. వారు చూపిన బాటను పయనించి సమగ్ర ఆంధ్రుల సాంఘిక చరిత్ర రచనకు పండితులు, విద్వాంసులు, పరిశోధకులు పూనుకొనవలసి యున్నది. రెడ్డిగారి విశిష్టసేవను గుర్తించిన కేంద్ర సాహిత్య ఎకాడమీ వారు Rs. 5000/– వేల రూప్యములను రెడ్డిగారి మరణానంతరం వారి కుటుంబానికి సమర్పించినారు.

## 2. రామాయణ విశేషములు

''రామాయణ విశేషములు'' అనబడు పరిశోధనాత్మక వ్యాసములు మొదట ''విభూతి''యను పత్రికలో అంచెలంచెలుగా 1938 సంవత్సరారంభంనుండి ఏడాదివరకూ ప్రకటింపబడుతూ వచ్చినవి. 'విభూతి' యను పత్రిక శ్రీ చిదిరెమఠం వీరభద్ర శర్మగారి సంపాదకత్వంలో వెలువడుతూ ఉండెను. వాల్మీకి మహర్షి ప్రోక్త సంస్కృతరామాయణమును ఒక్కమారే స్వీయ విజ్ఞానార్జనాసక్తితో పఠించిన రెడ్డిగారికి అందు కొన్ని విశేషములు గోచరించుటచేత వాటినే రామాయణ విశేషములుగా రెడ్డిగారు రూపొందించారు. రెడ్డి గారీ వ్యాసములను శిష్ట వ్యావహారిక భాషలో వ్రాయడమొక విశేషము రెడ్డి గారికి వ్యావహారిక భాషపైగల మమకారమునకీ వ్యాసములు మచ్చుతునకలు.

శ్రీ వాల్మీకి రామాయణమును రెడ్డిగారు స్వీయ విజ్ఞానాభివృద్ధికొరకు పఠించినా, ఏతత్పఠన పర్యవసాన జనిత విమర్శక వ్యాసములను విజ్ఞాన వర్ధినీ పరిషత్తుసభ్యుల పరిశీలనకై నివేదించియుండిరి. రామాయణ విశేషము. లను రచించుటలో రెడ్డిగారు మిగుల శ్రమించిరనియు, బహుభాషా కోవిదులైన రెడ్డిగారు, పెక్కు గ్రంథముల నవలోకించి రామాయణ విశేషములను

సంగుప్తపరచిరనియు, రామాయణముపై తెలుగులో ఇంత విపులంగా వ్రాయ బడిన విమర్శనాత్మక గ్రంథము ఇంతవరకు వెలువడలేదనియు, చిదిరె మఠం వీరభద్రశర్మగారు తమ "మాట" ద్వారా "రామాయణ విశేష ముల"ను గ్రంథములో తెలియజేసినారు. రెడ్డిగారు ఆ యా సందర్భము లలో తమ సునిశితబుద్ధి పాటవమును జూపియున్నారు. కాని ఏకవేణి శబ్దార్థ మును నిర్ణయించుటలోను, హనుమంతుని బ్రహ్మచర్యము, విమానములు, ఆర్యావర్త ప్రదేశమును నిర్ణయించుటలో వారి ఊహ శర్మగారికి సమర్థనీయ ముగా గోచరించలేదు. అట్లే మరికొన్ని అంశాలు మరికొందరు విద్వాంసు లకు సమంజసముగా నుండకపోవచ్చును. నచ్చని అంశాలను ప్రామాణిక సోపపత్తికంగా ఖండించిన వాటి నంగీకరింతునని రెడ్డిగారు రామాయణ విశేషాలలో అభివ్యక్తం చేసియే యున్నారు.

అందరినీ మెప్పించి ఔననిపించు కవిత్వమెంత అపురూపమో, అందరి అధికారముద్ర బడయు విమర్శనము కూడ అంతే దుర్లభము. ప్రతాపరెడ్డి గారెంత నిర్భీకులో, సత్యరతులో వారి విమర్శనముకూడ అంతే ఖండితము నిష్పాక్షికమూను. "శ్రీ మద్రామాయణ మహా కావ్యమును గూర్చి నావంటి వాడు వ్రాయుట మహా సాహసమే" నని రెడ్డిగారు తమ వినయమును తమ మనవి మాటలో విన్నవించుకున్నారు. రామాయణమును గూర్చి పాశ్చాత్య ప్రాచ్య పండితులెందరో విపులంగా ఆంగ్లములో చర్చించి యున్నారు. రామాయణమన్ననూ, శ్రీరాముడన్ననూ భారతీయుల కెనలేని భక్తి ప్రపత్తు లున్నవి. ఆధ్యాత్మికంగా రామాయణాన్ని తిలకించు పెద్దలకు రాముడవతార పురుషుడు, ఆది విష్ణువు; సీతాదేవి అపరలక్ష్మి. అతని బంటుకూడ కొంద రికి కులదైవమే! కనుక వారు రామాయణంలోను, రామునిలోను ఎలాంటి లోపములను చూడలేరు. ఇక రెండవ వర్గమువారు శ్రీరాముని ఆదర్శ పురుషునిగా స్వీకరింతురు. వీరు శ్రీరాముని చరితమును చారిత్రక దృష్టితో తిలకింతురు, తిలకింతురుగూడ; వాద వివాద వితండవాదాల పితలాటంలో పడి అడపా తడపా అస్తి నాస్తి విచికిత్సాపరులై శ్రీరాముడు నిజంగా చారి

త్రక పురుషుడేనా అను ధర్మసందేహానికి కూడ లోనై రామాయణమొక కల్పితగాథ ఎందుకు కాగూడదన్న అనుమానంతో కొందరు పాశ్చాత్య, ప్రాచ్య నాగరికతా వ్యామోహాంధులగు విమర్శకాగ్రేసరులు రామాయణకథను "ఆర్యులు అనార్యులను లోబరుచుకొనుటకు కల్పించిన కల్పిత గాథగా చిత్రించి" భారతీయులలో విద్వేష బీజములను నాటుటకు కారకులైనారు. వీటన్నిటిని దృష్టియందుంచుకొనియే రెడ్డిగారు, పాశ్చాత్య పండితులు రామాయణంపై వ్రాసిన విమర్శనలను కూలంకషంగా అవలోడనచేసి "రామాయణ విశేషముల"ను అశేషప్రతిభతో, సదసద్వివేచనా దృష్టితో గ్రథనంచేశారు. శ్రీరాముడు కల్పిత పురుషుడుకాడనియూ, రామాయణగాథ కాల్పనిక గాథ అసలే కాదనియూ సప్రమాణంగా నిరూపించారు.

వాల్మీకి మహర్షికి పూర్వము రామాయణమును చ్యవనుడను మహాముని వ్రాసినట్లు అశ్వఘోషుని "బుద్ధ చరితము"లో గల శ్లోకమువల్ల తెలియుచున్నది. ఏతత్ శ్లోకార్థము ననుసరించి, "చ్యవనమహర్షి ఏదైతె చేయజాలకపోయెనో అట్టి కార్యమును వాల్మీకి మహర్షి చేసెననియు, అత్రి మహాముని చేయజాలని వైద్యమును అతని కుమారుడగు ఆత్రేయుడు పూర్తి చేసెనని" తెలుపబడియున్నది. అత్రి మహాముని చేయని కార్యమును అతని కుమారుడు పూర్తిచేసినట్లే, చ్యవనుడు చేయజాలని పనిని వాల్మీకి చేసెనని పితా పుత్రోపమాన వాక్యములచే నిరూపింపబడెను. చ్యవనుడు భృగు వంశజుడు, వాల్మీకియు భృగు వంశసంజాతుడే! కనుక చ్యవనుడు వాల్మీకికి తండ్రి ఏల కాకూడదన్న ధర్మసందేహము ఇంగితజ్ఞులకు కలుగకపోదు. వాల్మీకి కూడ శ్రీమద్రామాయణంలో చ్యవనుని ప్రసక్తి తెచ్చినాడు. అసలీ భృగు వెవడను చర్చకూడ ఇచట అసందర్భము కానేరదు. చర్చనీయాంశ సారముననుసరించి భృగువు శుక్రాచార్యుడేనని తేల్చబడింది. శుక్రుడు అసురుల కులగురువు. భృగు వంశీయుడు చ్యవనుడైనపుడు చ్యవనపుత్రుడు వాల్మీకి యని నిర్ధారించబడినపుడు, వీరంతా ఈరాన్ దేశీయులేనని సుదీర్ఘ చర్చా సారాంశమున తేల్చబడినది. వాల్మీకికి ఋక్షుడను పేరుకూడ కల

దనియు, ఇరువది నాల్గవ వ్యాసుడు ఋక్షుడేననియు, ఇరువై యెనిమిదవ వ్యాసుడు ద్వైపాయనుడనియు వాయు పురాణమున ప్రస్తావించబడింది. పురాణ సంప్రదాయమునుబట్టి వరుణవంశము వాడును భృగు వంశము వాడునైన వాల్మీకి యొకడేనని మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు తమ "సంస్కృత వాఙ్మయ చరిత్ర"లో ఉద్ఘాటించినారు. వాల్మీకి నామము వల్మీక భవ మనియు, అతడాదిలో గజదొంగయనియు, బోయకుల సంజాతుడనియు సృష్టింపబడిన కథలన్నీ తర్వాతి కవుల కపోలకల్పితములని తేలుచున్నది.

రెడ్డిగారు వాల్మీకి రామాయణ ప్రాశస్త్యమును గూర్చి చర్చిస్తూ పాశ్చాత్య పండితులు కొందరు రామాయణకథను హోమర్ వ్రాసిన ఇలియడ్ గాథను చూచి సృష్టించారన్న అపప్రథను తొలగించుటకు ప్రయత్నంచేశారు. రామాయణ రచనాకాలము క్రీ. పూ. 2500 సంవత్సరాలనాటిది. ఇలియడ్ గాథ క్రీ. పూ. 1200 నాడు రచింపబడుటచేత రామాయణగాథనే అడ్డా దిడ్డగవిన్న హోమర్ మహాశయుడు ఇలియడ్ పురాణమును రచించియుండు నని తేల్చబడింది. రామాయణమునకును, ఇలియడ్ గాధకును కథా ప్రాశ స్త్యములోను, రచనా సౌకుమార్యంలోను, నాయికానాయకుల పాత్రపోషణా రామణీయకములోను హస్తిమశకాంతర భేదమున్నదని సప్రమాణంగా నిరూపింపబడింది.

గ్రీసు దేశమునకు సమీపంలోగల ఖాల్డియా దేశంలో క్రీ. పూ. 3000 సంవత్సరాలక్రితం పంపబడిన భారతదేశపు టేకుకర్ర దూలములు కన బడుటచేతను, బాబిలోనియాలో హైందవులు నేసిన గుడ్డలను "సింధు"అను నామముతో వ్యవహరించుటచేతను, సాలమన్ చక్రవర్తిహయాంలో ఇండియా నుండి ఎగుమతి చేయబడిన చందనము, దంతములు మొదలగువాటికి హిబ్రూభాషలో మరొకపేరు లేకుండుటవలన భారతీయ నామములచేతనే వ్యవహరింపబడుటవలననూ, హోమరుకంటె కొన్ని శతాబ్దులకు పూర్వమే హైందవ సంస్కృతి గ్రీకుదేశమున వ్యాపించినదని మిస్ రగోజన్ తన "Vedic India"అను పుస్తకంలోవ్రాసిన అంశాలనురెడ్డిగారు ఉట్టంకించారు.

అలాగే రామాయణ, భారత రచనా కాలమునకు గల అంతరాన్ని ప్రస్తావిస్తూ రామాయణం క్రీ. పూ. 2500 ఏండ్ల నాటిదనియు, భారతము క్రీ. పూ. 1600 సంవత్సరముల నాటిదనియు ప్రాక్పశ్చిమ పండితుల గ్రంథాల నుదాహరిస్తూ ఉల్లేఖించబడింది. రామాయణంలోగల ప్రక్షిప్తాలను, హస్త క్షేపాలనుగూర్చి ప్రస్తావిస్తూ, ఏయే భాగములు ఎందువలన, ఎవరిచేత, ఏయేకాలంలో, ఏ ఆశయసిద్ధి కొరకు జొప్పించబడినవో రెడ్డిగారు సవివరంగా సుదీర్ఘంగా చర్చించి నిరూపించినారు.

ఇకపోతే దశరథ మహారాజునకు ముగ్గురు పట్టపు రాణులతోపాటు 350 మంది వైవాహిక పడుతుక లుండినట్లు ప్రస్తావించబడింది. దశరథ మహారాజునకు శాంతయను ఔరసపుత్రి కూడ ఉన్నట్లూ, ఆయమను అంగ రాజగు రోమపాదునకు దత్తుగానిచ్చెనని కలదు కాని ఆమె దశరథునికే భార్యయందు ఎన్నడు జన్మించెనను ప్రస్తావన ఉట్టంకించబడలేదు. శ్రీరాముని జననకాలము, వివాహము, పట్టాభిషేకము, అన్నీ చైత్ర శుక్ల నవమి నాడే పొసగుట జ్యోతిశ్శాస్త్రరీత్యా సంభవముకాదని నిరూపించ బడినది. శ్రీరాముడు బాల్యమందు, యౌవనమందు వివాహితుడైనట్లు ద్వివిధాధారము లుండుటవలన రెండూ ప్రక్షిప్తములనియే రెడ్డిగా రభిప్రాయపడుట విడ్డూర ముగానున్నది. ఏదో ఒక అంశము ప్రక్షిప్తము కావలయును గాని రెండూ కాజాలవు. ఆనాటి వివాహములు స్వయంవరములే కనుకనూ వధూద్వాహము తరచూ యుద్ధములచేతనే జరుగుచుండెడిది కాబట్టి రాముని వివాహము యౌవనకాలమునందే జరిగియుండుట సమంజసముగా ద్యోతకమగుచున్నది.

ఇక రామాయణ కాలపు సాంఘికాచారములను గూర్చి చర్చిస్తూ శ్రీరామునికాలంలోకూడ ధర్మము నాలుగుపాదాలపై నడవలేదని సప్రమా ణంగా నిరూపింపబడింది. శ్రీరాముని కాలంలో కూడ జాబాలివంటి నాస్తికులుండుట, వానరులలో నీతి బాహ్యప్రవర్తన, మద్యపాన సేవనము, విటసంచారము, వారకాంతల స్వైరవిహారము, నరమేధము, జూదములాటలు,

మాంస భక్షణము, మాంస విక్రేతలు ఆదిగా గల కార్యములన్నీ ధర్మ చ్యుతినే నిర్దేశిస్తున్నవని రెడ్డిగారు సోదాహరణంగా నిరూపించారు. అలనాడు మాంసభక్షణ అగ్రజాతివారగు బ్రాహ్మణులందు కూడ నీతి బాహ్య ప్రవర్తనగా మారలేదు. కండు మహర్షి యంతటివాడే తండ్రి ఆజ్ఞానుసారం గోవును సంహరించాడు. భరద్వాజ మహర్షి శ్రీరామునికి మధు పర్కము నిమిత్తము ఒక మహిషమును అర్ఘ్యజలాన్ని తెచ్చిఇచ్చాడు. ఇల్వలుడు, వాతావి యను రాక్షస సోదరులు దొంగ శ్రాద్ధములు పెడుతూ బ్రాహ్మణుల నాహ్వానించి మాంసమును వండి తుష్టిగా భోజనంపెట్టి సాగనంపు తుండిరి అగస్త్య మహాముని కూడ ఆ రాక్షస సోదరులిచ్చిన శ్రాద్ధభోజనాన్ని కడు పారా అరగించాడు. సీతాదేవి కూడ గంగామతల్లికి మ్రొక్కులిడుతూ, తాము క్షేమంగా అయోధ్యకు తిరిగివెళితె పదివేల గోవులను సహస్ర సురా భాండాలను, మాంసాన్నమును సమర్పించు కుంటానని వేడుకున్నది. శ్రీరాముడు గంగానదిని దాటి అరణ్యంలో అడుగిడినదే తడవుగా ఒక అడవిపందిని, మనుబోతును, నల్లచారల దుప్పినిచంపి భక్షించినట్లు శ్రీమద్రామాయణపు అయోధ్యాకాండ శ్లోకాలు సాక్ష్యం చెబుతున్నట్లు రెడ్డి గారు ఉట్టంకించారు.

కైకమ రాణిగారి పుట్టింటి వారెవరను ప్రశ్న చాల ఆసక్తిదాయకంగా ఉన్నది. కైకేయి తండ్రియగు కేకయరాజు దశరథుని అల్లుడిగా చేసికొని అందుకుబదులుగా అతని రాజ్యాన్ని వోలిగా స్వీకరించి వివాహము జరిపించాడు. స్త్రీ శుల్కము ఆర్య ధర్మవిరుద్ధము. రాజ్యమును భార్యాశుల్కం క్రింద ముడుపుగట్టి, అతడికి ఆవిడతో కలిగిన సంతానమునకే రాజ్యార్హతను సంక్రమింపజేయడానికి ఇరాన్ దేశీయుడగు కేకయరాజు ప్రయత్నించాడు. ఆ విషయాన్ని పసిగట్టిన దశరథుడు శ్రీరాముని పట్టాభిషేకమహోత్సవ మును నిర్ణయించుటకు పూర్వమే భరతుడిని మేనమామ ఇంటికి పంపుతాడు. ఆ సంగతిని గమనించిన రాణి కైకేయి దశరథునికి తన వివాహకాలంలో చేసిన షరతులను జ్ఞప్తికి తెచ్చి రాముడిని అరణ్యమునకుపంపించి, భరతుడికి

పట్టాభిషేకం జరుగు ఏర్పాటుచేస్తుంది. అంతేగాని కుబ్జయగు మంథర కైకేయికి నూరిపోయిడమూ, ఆ పైన ఆవిడ శివమెత్తినట్లు భర్తపై విరుచుక పడి పాత వరాలనడిగి ముసలివాడిని ఏడ్పించుకుతినడం లాంటి కల్పనలన్నీ అనంతర కవిశేఖరుల కల్పనా చాతుర్యమేనని రెడ్డిగారు నిరూపించారు.

కైకేయి తండ్రిది గిరివ్రజమను బాహ్లిక దేశము. దీనినే నేడు బలఖ్ అని అంటారు. బలఖ్ దేశము నాడు ఇరాన్ రాజ్యంలోని భాగము. కైకేయి ఇరాన్ దేశపు యువతియే యనుటకు మరొకకారణం కూడ ఉంది. కేకయ రాజు భరతుడికి వీడ్కోలు ఇచ్చునపుడు అతనికి బహుమానంగా గాడిదలను, గొంగళ్ళను, కుక్కలను, అశ్వాలను కానుకలుగా సమర్పిస్తాడు. అల్లుండ్లకు మరియు దౌహిత్రులకు ఆర్యావర్తములో గాడిదలను, శునకాలను బహుమానంగా ఇచ్చు ఆచారం ఎన్నడూ లేదు. కనుక కైకేయి తప్పకుండా ఇరాన్ జాతి వనితయేనని రెడ్డిగారు నిర్ధారించారు.

ద్వాపరయుగంలో స్త్రీలకు వేదాధికారం కలదనీ, నాటి లు అసూర్యంపశ్యలు కారనీ, నాడు దేవరన్యాయము అమలులో ఉండెననీ నిరూపించబడింది. వాలివధానంతరము సుగ్రీవుడు తారను చేబట్టుట దేవర న్యాయమునకొక నిదర్శనము. శ్రీరాముని శరాఘాతమున మాయలేడి వధింపబడి, 'హా సీతా! హా లక్ష్మణా!' అని యరచి నీల్గిన యనంతరం ఆ యార్తనాదమును విన్న సీత లక్ష్మణునితో వెంటనే రాముని సహాయార్థము వెళ్ళమంటుంది. శ్రీరాముడికి ఎలాంటి కీడుమూడదని లక్ష్మణుడు సీతను విడిచిపోడు. అప్పుడు సీత కోపోద్రిక్తయై లక్ష్మణుడితో, "శ్రీరాముడు హతుడైతే నన్ను చేపట్టాలనే దుష్టతలంపు నీకుండబట్టి నీవిలా నిరాకరిస్తున్నావని" తూలనాడుతుంది. సీతామతల్లిలాంటి సాధ్వినోట అంత కఠోరమైనమాట రావడం నాటి సాంఘికాచారములకు ఆవిడమాటలు దర్పణము లాంటిదని రెడ్డిగారు నిరూపించ ప్రయత్నించినారు.

నాడు చాతుర్వర్ణ ధర్మాలను పకడ్బందీగా పాటించు ఆచారము ప్రజలలో లేకుండుటచేత నిషాదుడగు గుహుడు తెచ్చిన మత్స్య మాంసాదు

లను భరతుడు స్వీకరించుట, శ్రీరాముడతనిని ఆలింగనము చేయుట ; శబరి యను ఆటవికస్త్రీ ఇచ్చిన ఎంగిలిపండ్లను రాముడు ఆరగించుట జరిగి యుండెను. ఇవిగాక శ్రీరాముడు వానరులతో పంక్తి భోజనముచేయుట, వర్ణాంతర వివాహములు ; అనులోమ ప్రతిలోమ పెండ్లిళ్లు, శ్రాద్ధభోజనాదులు బ్రాహ్మణులు ఆరగించుట మొదలగునవన్నీ ఇందుకు నిదర్శనాలు.

ఇకపోతే, శూద్రజాతి యనునది రామాయణకాలంలో ఉండెనాయను విషయంకూడ పరిశీలింపబడింది. శూద్రపదము ఒకే ఒకచోట కలదనియు, అదికూడ పదవ మండలంలో పురుషసూక్తమున ఉండడంచేత అది ప్రక్షిప్త మేనని పలు మేధావులు ప్రకటించారు. వారు తెలియజేసిన కారణాన్నిబట్టి ఋగ్వేదంలోని భాషకూ, ఈ సూక్తమున వాడబడిన భాషకు సాపత్యము కుదురలేదట. ఇందు వేదాంత పారిభాషిక పదాలున్నాయట. పారిభాషిక పదాల వాడకమే ఆ సూక్తంయొక్క అర్వాచీనతకు నిదర్శనమన్న ఏకాభి ప్రాయమునకు వెబర్, కోల్బ్రూక్, మ్యూర్, గ్రేన్‌లాంటి పాశ్చాత్య పండితులు వచ్చారు. శూద్రపదమును ప్రాచీనముచేయుటకై పండితమ్మన్యులు చేసిన హస్తలాఘవమని సదరు ఆంగ్ల పండితుల అభిప్రాయము. ఆర్యులు దక్షిణా పథమును ఆక్రమించుకున్నప్పుడు ఓటమి నంగీకరించిన అనార్యులు వారికి దాసులై, బానిసలై శూద్రులై సేవ చేశారు. కాబట్టి శూద్రజాతి ఉత్పన్నమైన దని రెడ్డిగారి పిండితార్థము.

వాల్మీకి రామాయణంలో ఆర్యావర్తమునకు తెలిపిన ఎల్లలను పురస్క రించుకొని రెడ్డిగారు సుదీర్ఘమగు చర్చ గావించారు. అయిననూ వాల్మీకి సూచించిన ఎల్లలను పురస్కరించుకొని ఆర్యావర్తమును మరియు లంకను నిర్దేశించజాలక తమకుతోచిన ఊహలనిచ్చి ముగించారు. అసలు ఇబ్బంది అంతా వాల్మీకి వాడిన పదజాలమువల్ల ఉత్పన్నమైనది. ఆనాడు భారత దేశముయొక్క ప్రాంతీయపు ఎల్లలకున్న పేర్లు యీ నాడు వాడుకలోలేవు. ఉన్న పేర్లైనా భ్రష్టరూపంలో నుండుటవలన పరిశోధకులు తమ ఊహలకు

ఎక్కువపని కల్పించుకున్నారు. తత్కారణంచేత ఎవరికితోచిన ఊహాకల్పన వారు చేసి పాఠములకు గజిబిజిని కలిగించారు.

లంకయొక్క భౌగోళిక సరిహద్దులను వాల్మీకి సూచనప్రకారం రెడ్డిగారు నిర్దేశించలేక కృష్ణా గోదావరీ ప్రాంతపు "లంకలనే"లంకగాసూచించి మలయ పర్వతమును నల్లమల, ఎర్రమల పర్వతశ్రేణులుగా నిర్ధారించారు. అదెంతవరకు హేతుబద్ధంగా నుండగలదో భావి పరిశోధకులు పరిశీలించ వలసియున్నది. గోదావరీ తటమునే సముద్రతటిగా భావించి లంఘించునంతటి మందబుద్ధులా వానరులు? నూరు యోజనముల సముద్రమును హనుమంతుడు లంఘించినదీ గోదావరినేనా ? ముండాసవర ఆటవిక జాతులున్న ప్రదేశం లోనే లంకను అన్వేషించవలయునని రెడ్డిగారు భావిపరిశోధకులకు సూచించి తప్పుకున్నారు.

అట్లే ఆర్యావర్తపు పెల్లల నిర్ధారణ ప్రసక్తికూడ సందిగ్ధావస్థలో పరిత్యజించబడింది. పురాణసూచిత నామములనుబట్టి ఇదమిత్థమగు నిర్ణయమునకు పూనుకొనుటవలన పరిశోధకుడు పప్పులో కాలువేయకుండా తప్పకో లేదు స్వాతంత్ర్యంవచ్చిన పాతికసంవత్సరాలలోనే భారతదేశపు భౌగోళికపు పెల్లలు తల్లక్రిందు లైనపుడు నాలుగువేల సంవత్సరాల క్రితంమాట చెప్ప నేల ? వాల్మీకి దృష్టిలో ఆర్యావర్త మొకలాగుంటె, పతంజలి నిర్దేశాలు మరొకలాగున్నవి. వ్యాస మహర్షి ఆర్యావర్తం ఒకతీరుగా ఉంటె, మనువు సూచించిన ఆర్యావర్తము మానవమాత్రులకు అగమ్యగోచరంగా గోచరిస్తున్నది. అలాంటప్పుడు ఎవరి సూచనలను ప్రామాణికంగా గ్రహించి యీనాటి పరిశోధకులు పురోగమించాల్సి ఉంటుంది ? అశోకుని హయాంలో పశ్చిమాన అఫ్ఘనిస్తానము తూర్పు ఈశాన్యములందు గాంధార పాటలీపుత్రములు సరిహద్దులు, దక్షిణాన యావదాంధ్రదేశం ఇమిడిపోయింది. తదనంతర రాజులకాలంలో మళ్ళీ ఆర్యావర్తపు పెల్లలు కొత్తగా రూపొందినవి. అందువలన ఆర్యావర్తపుపెల్లలు అన్నికాలాల్లో అందరికీ క్లిష్టసమస్యగా రూపొందినవి.

వానరులెవరను చర్చ ప్రశంసనీయంగా ఉంది. వానరులు నరులా లేక వనచరులా యను చర్చను సాగించిన రెడ్డిగారు వానరులు వనంలో చరించు ఆటవికతెగలకు చెందినవారను నిర్ధారణకు వచ్చినారు. జి. రామదాసు గారు 'భారతి'లో నలుబది సంవత్సరాలక్రితం వ్రాసిన వ్యాసంలో కూడ వానరులు నరులనే నిర్ధారించారు వానరులకును, రాక్షసులకును సాదృశ్యము కలదు. వానరులు సవరముండా జాతులవారు. వారి నామములకు సవర ముండా భాషలోనే అర్థవంతమగు పేర్లున్నవి. "లంక"కు మిట్ట అని అర్థం సవర భాషలో కలదు. జైతాన్ లేక జనస్థానము అనగా బయటిభూమి. సవరలలో అసురులు అను జాతివారు కూడ కలరు. వారు కౌపీనములుకట్టి తోకవలె గుడ్డను వ్రేలాడింతురు. వానరులలో మగవారికే గాని స్త్రీలకు వాలములున్న జాడ వాల్మీకి రామాయణంలో లేదు. ముండాలుండు పర్వత ప్రాంతమును మందర పర్వతమందురు. ముండాలలో 'హరో' అను జాతి వారుకూడ ఉన్నారు. హరియను శబ్దమునకు సంస్కృతంలో కోతియను అర్థంకూడ ఉన్నది. ముండాలలో కొందరీనాటికీ తాము రావణుని సంతతి వారమని చెప్పుకొనుచుందురు. వనచర శబ్దమునకు కోతియను అర్థమున్నట్లే "వనేచరః" వనములో చరించు అడవిమనిషి అనికూడ అర్థముకలదు. రామాయణంలో హస్తక్షేపము చేసిన పెద్దలు, అడవి మనుష్యులకు మారుగా కోతులనే అర్థాన్ని స్వీకరించి మన కందించారు.

వానరులు తాము దక్షిణాపథము నుండి లంకలో ప్రవేశించినట్లు రావణునికి చెప్పియుండిరి. వానరులకొక మాతృభాషకూడ ఉన్నది. వారిలో కొందరికి సంస్కృత భాషకూడ వస్తుంది. హనుమంతుడు లంకలో నిర్బంధింపబడిన సీతతో సంస్కృతంలో సంబోధింతునా మాతృ భాషలో ముచ్చటింతునా యను సందేహముతో సతమతమై సంస్కృతంలోనే సంభాషించాడు. వానరుల ఆచారానుసారం అన్న చనిపోతే అతని భార్యను తమ్ముడు చేపట్టును. వారు చనిపోతె శవమునకు దహన సంస్కారము చేయరు, పూడ్చి పెడతారు. వారికి బాణవిద్యలో ప్రావీణ్యము లేదు. గదా

యుద్ధము, ద్వంద్వ యుద్ధములో ప్రవీణులు. కిష్కింధలో బ్రాహ్మణులు కూడ ఉండిరి. అక్కడ పెద్ద పెద్ద భవనరాజములుకూడ ఉండెను. వారికి లోహములవాడుక బాగుగా విశదమే! వానరస్త్రీలు రూపయౌవనగర్వితలు. వానర వనితలు నూపురములు, మొల నూళ్ళను ధరించియుండిరి. ఇలావారి సాంఘికాచారములను గూర్చి, సంస్కృతీ సంపదలను వివరించు అంశము లెన్నియో రామాయణంలో ఉన్నవి. అలాంటి వారు కోతులెలా అవుతారని హేతువాదియగు రెడ్డిగారి వాదము.

ఇకపోతె ఆంజనేయుడు బ్రహ్మచారి కాడని రెడిగారు నిరూపించ సంకల్పించారు. అందుకు ఆధారంగా ఒక ఉదాహరణకూడ ఇచ్చినారు. శ్రీరాముడు రావణుని వధించి సీతాసమేతుడై అయోధ్యకు త్వరలో రానున్నాడని హనుమంతుడు ముందుగా అయోధ్యకేగి భరతునికి తెలుపుతాడు. భరతుడా సంతోషవార్తను విని పులకితాంతరంగుడై ఆంజనేయునికి రూప యౌవన కులీనలగు కన్యలను పారితోషికంగా ఇస్తానని ప్రకటిస్తాడు. హనుమంతుడు మహాప్రసాదమని అంగీకరించడు, వలదని వారించడు ; విని ఊరుకుంటాడు. బ్రహ్మచారి అయినవాడు నిరాకరించకూడదాయని రెడ్డిగారి వాదము. హనుమంతుడు బ్రహ్మచారి కాడు కనుకనే భరతుడు కన్యకలను బహుమతిగా ఇస్తానంటె 'కిమ్' అనికూడ అనలే దెందుకని రెడ్డిగారి అనుమానము. ఆంజనేయుడు వలదని వారించలేదు కనుక అతడు బ్రహ్మచారికాడని త్రోసివేయుట పాడికాదు. ఆంజనేయుడు రామభక్తుడు. దాసానుదాసుడు. అతని దృష్టిలో రాముడెంతో, భరతుడుకూడ అంతే! హనుమంతుడు వివాహితుడైన నిదర్శనాలు రామాయణంలో ఎక్కడా లేవు. భరతుని బహుమానప్రసక్తి తప్ప హనుమంతునికి కన్యాదాన ప్రసక్తియే రాలేదు. భరతుడు రారాజు, శ్రీరాముని తమ్ముడు. ఆంజనేయుడు శ్రీరాముని బంటు, భక్తుడు. కుశలవార్త విన్న భరతుడు సంతోషాతిరేకమున ఏదో కన్యలను కానుకగా ఇస్తానంటె వలదని వారించుట సభ్యత కాదు. అందునా బంటులాంటి ఆంజనేయుడు రారాజు మాటను కాదనుట పాడికాదు. అదియును

గాక భరతునికి ఆంజనేయుని బ్రహ్మచర్య విషయమేమి తెలియును? తెలిసికొనుట కాస్కారముకూడ లేదు. ఆంజనేయుడు కిష్కింధలో శ్రీరాముని వద్దనుండి రావణ వధానంతరమే అయోధ్యకు వస్తాడు. అలాంటి తరుణంలో భరతునికి ఆంజనేయుని ఆంతరంగిక విషయమును తెలిసికొనుటకు అవకాశములేదు. అందరివలె ఆంజనేయుడు కూడ గృహస్థుడనుకొని, భరతుడు కన్యలను కానుకగా ఇస్తానని ప్రకటించినంత మాత్రమున పవనసుతుని బ్రహ్మచర్యమునకు భంగము వాటిల్లదు. ఒకవేళ కన్యకలను బహుమతిగా స్వీకరించినా వాళ్ళను వాడుకొన నంతవరకు హనుమంతుని బ్రహ్మచర్యము మొక్కవోదే? బహుమతిగా బడసిన కన్యలను హనుమంతుడు వారిని స్వేచ్ఛాప్రపంచమున వదలివేయుటకు ఆస్కారమున్నది గదా? కనుక రెడ్డిగారి వాదమున కిచట పటుత్వము పోయినదనవలసి వచ్చును.

అట్లే ఏకవేణీ శబ్దార్థముకూడ వివాదాస్పదమై యున్నది. ఏకవేణీ శబ్దార్థమును ఒంటి జడగా స్వీకరించుట ఎందులకు? కురుల సముదాయమే వేణీ శబ్దార్థమున బహుళవ్యాప్తిలో కలదు. నేటికినీ కులీనలగు వనితలు పతివియోగ సమయమునందు, మహాపదలందు మరియు దేవతాపూజాదికములందు తమ కురుసముదాయమును విప్పుకొనియుందురు. అంతే కాని వారు అట్టి సమయాల్లో ఒంటి జడ వేసుకొని యుండుట కానరాదు. నేటికి రెండువేల సంవత్సరాలనాటి సంప్రదాయమును ప్రతిబింబించు ఎల్లోరా అజంతా గుహలలో చిత్రింపబడిన స్త్రీ మూర్తులకు రెండు జడలున్న పోకడలు కానరావు. రెడ్డిగారు ఏకవేణీ ధరలన్న శబ్దమును ఒంటిజడగా నన్వయించుటకు శాస్త్రప్రమాణమును చూపించలేదు. మన శాస్త్ర పురాణేతిహాసములందును ఏకవేణీ ద్వివేణీ శబ్దములచర్చ కానరాలేదు. కనీసం పూర్వకవుల కావ్యములందైనను, శృంగారవర్ణన చేయు సందర్భముననైనను రెండుజడల ప్రసక్తి రాలేదు అట్టితరి రెడ్డిగారికి రెండుజడల నారీమణుల ఊహ ఏల కలిగినదో దురూహ్యముగా నున్నది.

ఇక రావణాసురుడి లంకలో విమానములుండెనా అను అంశముపై ప్రశంసార్హమగు చర్చ సాగినది. రావణుడు పుష్పక విమానంలో విహరించె నని యున్నది. పుష్పక విమానమనునది ఒక విధమగు రథరాజమే నని రెడ్డిగారు నిరూపించారు. యానములవలెనే విమానములు కూడ రథభేద స్వరూపములు. పుష్పకవిమానము ఆకాశ యానమగు విమానము కాదు. అది లంకలోగల తొమ్మిదంతస్తుల మేడ. హనుమంతుడు మొదట లంకలో ప్రవేశించినవుడు చూచిన దా మేడనే! ఆ భవన రాజమునే అనంతరకాలంలో రామాయణమును పెంచి వ్రాసిన వారు పుష్పక సౌధమును విమానముగా మార్చివేసిరి. విమాన మనగా ఆకాశమును కొలుచునది అను అర్థమున అన్వయింపబడుట చేత తర్వాతి కాలమందు రామాయణమును పెంచినవారు విమానమునకు ఆకాశయానమని అర్థముచేసి వర్ణించిరి. వాస్తు శాస్త్రవిద్య ననుసరించి ఆనాడు స్వస్తిక, వరమాన, నంద్యావర్త విమానాది భవన రాజము లుండెడివని తేలుచున్నది. ఏది ఎట్లున్నను విమానచర్చ శబ్దార్థముల అన్వయార్థ చర్చగా ముచ్చటగా కొనసాగినది.

రాక్షసులను వారు నాగరికులా అనాగరికులా అను చర్చకూడ విపులంగా కొనసాగింది. తాటక ఒక యక్షిణి. దానికి పుట్టినవాడు మారీచుడు. మరివాడు రాక్షసుడెలా అవుతాడు? వాతాపి, ఇల్వలుడు అను రాక్షససోదరులు బ్రాహ్మణుల వేషంలో ఉంటూ, సంస్కృతంలో సంభా షిస్తూ ఆర్యులను మోసగిస్తూ ఉండేవారు. అనాగరికు లెలా అవుతారు? రావణుడుకూడ బ్రాహ్మణవేషంలోనే వచ్చి సీతను అపహరిస్తాడు. వాళ్లు మాయా వేషధరులని, కపట వేషధారులని నచ్చ చెప్పవచ్చు. ఆ కాలంలో బ్రాహ్మణులుకూడ ప్రత్యర్థులను మోసగించడానికి కపటవేషాలు వేసిన తార్కాణములున్నవి. దేవతలు, గంధర్వులు, యక్షులు కూడ కపట వేషధారులై పరుల పడతుకలను గవగూడిన సందర్భాలు మన పురాణాల్లో కోకొల్లలు. కనుక రాక్షసులను మాయావేషధరులని త్రోసివేయుట హేతు బదముకాదు.

లంకలో దేవాలయాలు, శివభక్తులు, బ్రాహ్మణులు ఉండేవారట. రాక్షసుల గృహాలు, ఆహారవిహారాది విషయాలను గమనిస్తే వారు రాక్షసులనడానికి మనసున్న మనకు నోరురాదు. రాక్షస రాజీవలోచనలు సుందరాంగులు, సంగీత నాట్య గానకళా విశారదలు వాళ్లు సర్వవిధ వస్త్ర ఆభరణ భూషితలు. అలాంటివారు అనాగరికులు కారని వాల్మీకి రామాయణమే సాక్ష్యం చెబుతున్నది.

ఇలాంటి విశేషముల నెన్నింటినో రెడ్డిగారు తమ రామాయణ విశేషాల్లో కూలంకషంగా చర్చించి తమ అశేష శేముషీ విభవాన్ని రుజువు చేసుకున్నారు. వారి దృష్టి కేవలము చారిత్రకము, యథార్థవాద సహితము ఋజుబద్ధమైనది కావడంవలన సనాతనధర్మపరాయణులకు కొంత కంటకంగా పరిణమించక తప్పలేదు. మల్లంపల్లి సోమశేఖరశర్మగారన్నట్లు రెడ్డిగారిందు ప్రదర్శించిన ప్రజ్ఞ, విమర్శనా జ్ఞానము, పరిశోధనా కౌశలము ప్రశంసా పాత్రములు.

### 3. హిందువుల పండుగలు

ఈ పుస్తకాన్ని రెడ్డిగారు 1930 సంవత్సరంలో రచించారు. దీని రచనకొక చక్కని కారణంకూడ కలదు. నిజాంప్రభువు విజయ దశమినాడు రాజా బహద్దర్ వెంకటరామారెడ్డి గారితో దసరా ఉత్సవాలు చేసికొనుటకు ధార్మికకారణము ఏమని అడిగినారట. అందుకు ప్రత్యుత్తరంగా కోత్వాల్ గారు ఉత్తర గోగ్రహణకాలమున పాండవుల విజయసూచకంగా విజయ దశమిని జరుపుకుంటారని చెప్పినమీదట, నిజాం ప్రభువు అంతకుముందుగా మరియొకరిని విచారించగా వారు శ్రీరాముడు రావణునిపై విజయంసాధించిన సందర్భమును పురస్కరించుకొని వేడుకలు జరుపుకుంటారని తెలియ జేసినారట పై రెండు కారణాలలో ఏది నిజమని నిజామువారు కోత్వాల్‌గారి నడుగగా వారు నిరుత్తరులై రాజా ధనరాజగిర్జీని విచారించగా వారును హైందవులకు హిందువుల పండుగల ప్రాశస్త్యముగురించి ఏమియు తెలియ

దని తమ విచారమును వెల్లడిస్తూ, హిందువుల పండుగలను హేతుబద్ధముగా తెలియజేయు పుస్తకము వ్రాసిన బాగుండునని సలహా ఇచ్చినారట. అంతట కోత్వాల్‌గారు ప్రతాపరెడ్డిగారిని కలిసి "హిందువుల పండుగలు" అను పుస్తకమును వ్రాయవలసిందిగా ఆదేశించినారట. అందుకు శక్తిచాలని వారయ్యును రెడ్డిగారు కోత్వాల్‌గారి ఆజ్ఞానుసారం 'హిందువుల పండుగలు' అను గ్రంథాన్ని రచించారు.

అన్ని మతముల వారికిని వారి వారి పండుగలు కలవు. అవి ఆ యా ప్రత్యేక సందర్భాలను సంస్మరించుకొని, దైవ చింతనతోను, చిత్తశాంతి కొరకు, సంతోషపూర్వకంగా కాలం గడుపుకొనుటకు నిర్దేశింపబడిన పుణ్య దివసములు. పండుగలు జరుపుకొనుటలో ఐహికాముష్మిక సుఖములతో పాటు శారీరక మానసిక సౌఖ్యములుకూడ సమకూరునని పెద్దల విశ్వాసము. హిందువులకున్నన్ని పండుగలు ప్రపంచజాతులలో మరెవ్వరికీ లేవు. అందుకు కారణాలు చాల ఉన్నవి. మనది సనాతన ధర్మము. ఇందు దేవతలు, ప్రవక్తలు, అవతార పురుషులు, మహాత్ములు పెక్కురు ఉద్భవించారు. వారి జనన మరణ సూచకాలుగాను కొన్ని పండుగలు ఏర్పడినవి. కృష్ణాష్టమి, శ్రీరామనవమి, భీష్మ ఏకాదశి, బుద్ధ జయంతి, గాంధిజయంతి అలాంటి పండుగలే: ఋతు సంబంధమైన పండుగలుకూడ కొన్ని ఉన్నవి. వాటిలో ఉగాది, సంక్రాతి, హోలి, రథసప్తమి లాంటివి గణనీయములు. ఇక మూడవ తెగలో శైవ వైష్ణవ సంప్రదాయ సంబంధమైన పండుగలు అనగా రథసప్తమి, చాతుర్మాస్యవ్రతాలు, శివరాత్రి, ఏకాదశి, వినాయక చవితిలాంటివి ఉన్నవి. నాల్గవ వర్గములో పైమూడు వర్గాలకుచెందని పండుగలు ఉన్నవి.

హిందువుల పండుగలను రచించడానికి రెడ్డిగారు శాస్త్ర పురాణేతిహాసములను, భారతీయ భాషలలో ప్రచురింపబడిన మత సంబంధమగు గ్రంథాలను చాలవరకు పఠించారు. ఇందు ఏబదినాలుగు ప్రముఖపండుగలను గూర్చిన సహేతుక మీమాంస కలదు. ఆ యా పండుగలు జరుపుకొనుటకు

అనూచానంగా వస్తున్న కథలను, విశ్వాసాలను వివరించి, అందులో ఏ కారణము హేతుబద్ధంగాను, సమంజసంగా ఉంటుందో దానిని విపులంగా చర్చించి ఆ యా పండుగలు జరుగుటకు కారణాలను రెడ్డిగారు తమ "హిందువుల పండుగలు" అను పొత్తములో విశదీకరించారు. ఇందు రెడ్డిగారు చూపిన పరిశోధనా పాటవము, విజ్ఞత ప్రశంసా పాత్రము. ఆయా సందర్భాలను వివరించునపుడు రెడ్డిగారు తమ అభిప్రాయాన్ని నిష్పాక్షికంగా, నిర్భయంగా, నిస్సంకోచంగా వివరించడం జరిగింది. రెడ్డిగారి నిశిత దృష్టి ఆదర్శమునకంటె ఆచరణయోగ్యతకు, అంధ విశ్వాసమునకంటె, వాస్తవికతకు ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చినట్లు స్ఫురించుటవలన సంప్రదాయ బద్ధులగు వారి విశ్వాసాలకు ఆఘాతము కలుగక తప్పలేదు.

శ్రీకృష్ణుడికి మీసాలు సృష్టించి రెడ్డిగారు పండితలోకంలో ఒక దుమారమును రేపినారు. కురుక్షేత్ర సంగ్రామానికి ప్రధానపాత్ర వహించిన వాడు, కురు పాండవ పేరోలగంలో శిశుపాలుని వధించిన వీరుడు, పాండవ రాజసూయ యాగమునకు అధ్యక్ష పీఠమునలంకరించిన పూజ్యుడు, పేడు మూతి వాడెలా అవుతాడని రెడ్డిగారి హేతువాదము. మీసాల మాహాత్మ్యము ఈనాడు మృగ్యమైంది కాని శ్రీకృష్ణుని కాలంలో మీసం లేకుంటె రోషం గల భీష్మాచార్యుడు పేడుమూతి ధృష్టద్యుమ్నుని ఎదిరించి పోరాడుటకే ఇష్టపడక అస్త్ర సన్యాసం చేసినారే! అలాంటి పురుష పుంగవులకాలంలో అందరిచేత గౌరవింపబడిన శ్రీకృష్ణునికి పురుషసింహుడికి పురుషచిహ్నములు లేకుండుట చోద్యము కాదు మరి?

ఇందుకు సమాధానంగా మనం ఒక్కసారి దశావతారములను పరిశీలిస్తే జవాబు లభిస్తుందేమో! మత్స్య కూర్మ వరాహ నృసింహావతారములు మానవరూప ధరములు కావని వదలివేసినా, వామన, రామ కృష్ణ, బుద్ధావతారులలో ఎవరికీ పురుష చిహ్నములున్న పోకడలు మన శాస్త్ర పురాణేతిహాసములందున్నట్లు లేకపోవడానికి కారణము వారికి మీసములు లేకనా లేక అవతార పురుషులకే పురుష చిహ్నములుండ గూడదని విజ్ఞుల భావమా?

అవతార పురుషులు త్రిగుణాతీతులు; రాగ ద్వేషాల కతీతులు ారు దు శిక్షణ, శిష్ట రక్షణ కవతరించిన మహిమాన్వితులు కనుకనే వారికి మీసాలు మన పూర్వులు ఉంచదలచ లేదు. ఇలాంటి విశేషాలెన్నో "హిందువుల పండుగల"లో పొందుపరచబడి యున్నవి

## 4. కాపు లెవరు ?

"కాపు లెవరు"అను విమర్శనాత్మక పుస్తకము ఇంకనూ ప్రచురింప బడలేదు. కాపు పద నిర్వచనమును హేతుబద్ధముగా, విమర్శనాత్మకముగా, సోపపత్తికముగా విశ్లేషించి సవివరంగా చర్చించబడిన చిన్న పుస్తకరాజము. దీనిని చాలవరకు కీ॥ శే॥ రాజా సదాశివరెడ్డి, మెతుకు సంస్థానాధీశులు వ్రాసి దివంగతులగుటవలన శేషభాగమును ప్రతాపరెడ్డిగారు పూరించారు. కాపుకుల సంజాతులగు రెడ్లను గురించి, వారి పుట్టు పూర్వోత్తరములను మల్లంపల్లి సోమశేఖర శర్మగారు, తమ రెడ్డితెగ పూర్వోత్తర"మను పుస్తకంలో విశదీకరించారు. వీరు గాక శ్రీ శేషాద్రిరమణ కవులుకూడ "రెడ్డి కుల నిర్ణయ చంద్రిక" అను గ్రంథములో సోపపత్తికంగా వ్రాసియున్నారు. ప్రకృత విమర్శనాత్మక పుస్తకమున 'కాపు'పద నిర్వచనమే విశేషించి చర్చించబడింది.

రెడ్డి తెగలలో నాడు భేదములతో వ్యవహరింపబడుతున్న రెడ్లలో చాల వరకు కంచము పొత్తేగాని మంచముపొత్తు ఇంకా కుదురలేదు. కర్ణాటక దేశంలో వ్యాపించియున్న రెడ్లు, ఆంధ్రదేశమున నివసిస్తున్న రెడ్లయొక్క అంతశ్శాఖా నామములొకటే కనుక ఆంధ్ర ప్రాంతమునుండి కర్ణాటకము నకు వీరు వలసపోయినట్లు భావించుట కాస్కారము కలదు. కాబట్టి రెడ్డియను పదము తెలుగా లేక సంస్కృతమా అన్న అనుమానము కలుగుతుంది. నిఘంటువులో రెడ్డియను పదము కాపువానికి పట్టపు నామము అని వ్రాయబడి యున్నది. కాపు శబ్దమునకర్థము నిఘంటువులో కాపు అనగా కాయలు కాచుట లేక బాధలు తొలగించి సంరక్షించుట అని యున్నది. ఒక శబ్దానికి అర్థాలు నానావిధాలుగా ఉన్నప్పటికీ ఒక పదానికి నిర్వచింపబడిన అర్థా

లన్నిటిలో భావ సమైక్యత గోచరిస్తుంది, లేనియెడల నానార్థములు ఒకేపద జనితములుగా తోచుట కాస్కారం ఉండదు. ఉదాహరణకు కాపు పద అర్థంలో కాయలుకాచుట మరియు బాధలు తొలగించి రక్షించుట అని నిర్వచింపబడి యున్నది. ఇందు కాయలు కాయుటకును, బాధలు తొలగించుటకును భావ సమైక్యత కుదురుటలేదు. కనుక కాయుట యనునదో లేక రక్షించుట యనునదో బీజార్థమునకు అననుకూలంగా పరిణమించు దానిని తొలగించాల్సి ఉంటుంది.

పూర్వకవులు 'కాపు' పదమును కాయలుకాచుట అను అర్థమునిచ్చునట్లు ఉపయోగించలేదు. కోమలమైన చిగురుమొగ్గలు వెలుపలికి రావడమునందు కాపు పదమును ఉపయోగించినారు. వృక్షమునకు కాత ముందుగా రాదు. మొదట చిగుళ్లు, మొగ్గలు వెడలిన యనంతరము కాత బయలు దేరుతుంది. కనుక కాత కాచుట అన్న నిర్వచనము సరియగు అర్థ నిర్వచనము కాదని నిరూపితమైనది. కాపు పదము ప్రాకృత హిందీ శబ్ద భవమైనట్లు నిర్ధారించబడింది. హిందీ ప్రాకృత భాషాజన్య పదములవాడుక సరియగు అర్థమున ఆంధ్ర ప్రాంతమునకంటె సరిహద్దు ప్రదేశాలలో అనగా తెలంగాణాలో సక్రమంగా వాడుకలో నున్నవి.

భారతీయ జాతులన్నీ ఏదో ఒక వృత్తితో సంబంధముకలవి కాబట్టి కాపు అను పదము పంటను కాపాడువాడు అను శబ్దార్థముననే సార్థకముగా అన్వయింప వచ్చును కాని శూద్రుడు అను అర్థమున అన్వయించుట అసమంజసము, అశాస్త్రీయమే యగును. ఆంధ్ర నిఘంటువులో కాపుపదమునకు శూద్రుడు అను అర్థమును తగిలించి అర్థాన్వయమునకు పొంతన కుదురకుండా చేసియున్నారు. అష్టాదశ వర్ణములవారందరు గృహస్థులేకదా! గృహస్థుడు అను శబ్దాన్వయము కలవారంతా శూద్రులే అవుతారా? భారత దేశంలో చేతి వృత్తులపై ఆధారపడియున్న వారెవరూ శూద్రులు కారు. ఏ వృత్తిపై ఆధారపడకుండా కేవలం పైజాతుల వారికి సేవకవృత్తి చేసి బ్రతుకు వారు శూద్రులని అమరసింహ నిఘంటువున వివరింపబడియున్నది.

వృత్తులనవలంబించి బ్రతుకువారిని శూద్రవృత్తుల క్రింద పరిగణించుట కేవలము అనూచానంగావచ్చు దేశీయ శిల్పమును హీనముగా చూచి వానిని భగ్నపరచుటయో కాగలదు. ఇలా వృత్తులను, వానిపై ఆధారపడిన వారిని ఏ యే వర్ణములుగా విభజించి యుండిరన్న అంశముపై సశాస్త్రీయమగుచర్చ జరిపి కాపులను వైశ్య వృత్తియందున్న వారని సహేతుకంగా నిరూపించ బడినది.

ఆంధ్రదేశంలో రాజుల ఏకచ్ఛత్రాధిపత్యము వైదొలగిన తర్వాత దేశమును బలముకలవారు ఆ యా చోట్ల ఆక్రమించుకొని చిన్న చిన్న రాజ్యములుగా పాలించినకాలంలో ఆంధ్రదేశమున కుపనామములు ఏర్పడి నవి. అవియే పాకనాడు, పలనాడు, వెలనాడు, పంటనాడు, రేనాడు, వేగి నాడుగా విడివడినపుడు ఆ యా ప్రాంతాలలో నివసించు కాపులకు ఆ యా ప్రాంతీయ నామములు స్థిరపడినవి. వారినే యీనాడు మనము పాకనాటి కాపులని, పంట కాపులని, కమ్మనాటి కాపులని (కమ్మవారు) రేనాటి కాపులని ఇలా ప్రాంతాలపేర్లతో వ్యవహరిస్తున్నాము. ఆ యా నాడులలో నివసించు కాపులు భూస్వాములై, గ్రామాధికారులై, దొరలై, దేశముఖులై, సంస్థానా ధీశులై ప్రసిద్ధిగాంచి వన్నెకెక్కినారు.

దేశమునకు సంబంధించిన పేరుగల కాపువారు దేశమును కాపాడు వారనుటలో సందేహములేదు. 'కుమారసంభవ' కర్తయైన నన్నెచోడుని తండ్రియగు చోడబల్లి ప్రభువు ఇరువదియొక్క వేల గ్రామ సముదాయ ప్రాంతమగు పాకనాటి సీమను పాలించెనని నన్నెచోడుడు వ్రాసుకున్నాడు. కర్షకవృత్తి ప్రారంభమైన నాటినుండియేగదా ప్రపంచ ప్రజలు నాగరికు లైనారు. కనుక కృషిపై ఆధారపడి పంటలను సంరక్షించిన జాతియే రానురాను దేశ సంరక్షకులైనా రనుటకు సందేహం లేదు. కాపులు మొదట కాంపిల్య నగరమునుండి దక్షిణాపథమునకు వచ్చినపుడు ఇక్కడి ఆదిమ వాసులు వారిని కాపులని పిలిచిరి. కాంపిల్య నగరమునుండి వచ్చినవారు కనుక "కాంపు"లను జాతివాచక సూచకనామముతో వారు వ్యవహరింప

బడిరి. దేశనామము జాతినామముగా మారునాయని కొందరికి సందేహము కలుగవచ్చును. ఉదాహరణకు బుందేల్ ఖండ్ వారినే తీసికొందము. బుందేల్ ఖండ్‌నుండి కొందరు ఆంధ్రదేశమునకు కొన్నివందల సంవత్స రాల క్రితం వలస వచ్చిరి. ఇక్కడ స్థిరనివాస మేర్పరచుకొనిరి. వారిని మనము బొందిలి వారని వ్యవహరించుటలేదా ? అట్లే పర్షియాదేశమునుండి వచ్చిన వారిని పార్సీలని భారతీయులు నామకరణ మీయలేదా ? అదేవిధంగా కాంపిల్యవాసులు కాపులను వ్యవహార నామముతో పిలువబడుటలో ఆశ్చర్యమేమున్నది ? ఈ విషయమునే చిలుకూరి వీరభద్రరావుగారు తమ "ఆంధ్రుల చరిత్ర"యను గ్రంథావళి మూడవ సంపుటంలో సవివరంగా చర్చించియున్నారు.

ఇట్లెన్నియో ఉపపత్తుల నిచ్చి సోదాహరణంగా, సవిస్తరంగా, సహేతుకంగా "కాపు" పదమును నిర్వచించి హృద్యంగా వివరింపబడిన విశిష్టమైన గ్రంథమీ "కాపు లెవర"ను వ్రాతప్రతి. కాపులు రెడ్లుగామారి భూస్వాములై మండలాధీశ్వరులై, సరదారులై, మంత్రులై, దండనాథులై పలుతెరగుల తమ ప్రతిభావ్యుత్పత్తులను ప్రదర్శించిన కాపులు పంటలకేకాక దేశమునకు గూడ కాపులై కాపాడిరన్న అంశాలు "కాపులెవర"ను పుస్త కంలో సాకల్యంగా చర్చించ బడినవి.

ప్రతాపరెడ్డిగారి అముద్రిత గ్రంథాలలో ఈ పుస్తకము ముందుగా ప్రచురింపబడవలసిన చక్కని పరిశోధనాత్మక గ్రంథము.

### 5. ఆంధ్ర లిపి సంస్కరణము :

ఆంధ్ర లిపి సంస్కరణమను ఈ చిన్ని విజ్ఞానదాయకమగు పుస్త కమును విజ్ఞన వర్ధనీ పరిషత్తు వారు 1946 సం॥లో ప్రచురించారు. రెడ్డి గారీ చిన్న పుస్తకమును బహుశ్రమల కోర్చి, బుద్ధి కుశలతను ప్రదర్శించి మొట్టమొదట విజ్ఞాన వర్ధనీ పరిషత్సభ్యులకు బ్లాక్‌బోర్డ్ సహాయంతో నూత నాంధ్ర లిపిమాలను వ్రాసి సవివరంగా విశదీకరించారు. దీనిపై పలువురు పండితులు పలురకాలుగా వ్యాఖ్యానించారు. కొందరు బాగుందన్నారు,

కొందరు పెదవి విరిచారు; మరికొందరు ఇంతలేసి తెలుగు లిపి సంస్కరణ మును ఆంధ్రమహాజనులు ఆదరించరని జోస్యం చెప్పినారు. నిజమే మరి ? సమాజం ఏలాంటి సంస్కరణలనైనా సహించదు; అవి సహేతుక మైన వైనా సరే ! అయితే నేమి, సంస్కరణలను సంఘం సహించదని సంఘ సంస్కర్తలు అభ్యుదయపంథాను వదులుకుంటారా ? మంచిని పెంచక మానుకుంటారా ?

రెడ్డిగారు ప్రవేశపెట్టిన యీ లిపి సంస్కరణము వలన తెలుగు వర్ణ సమామ్నాయములోగల 57 అక్షరములకు బదులు 28 రూప ములలోనే ఆంధ్ర లిపికి సమగ్రత చేకూరినది. తెలుగుటైపు, టెలిగ్రావు, తెలుగు అచ్చుముద్రణలో చాల సౌకర్యములు సమకూర గలవు. ఇంగ్లీషు, ఫార్సీ, ఉర్దూభాషా ధ్వనులను కూడ తెలుగులిపి సంస్కరణద్వారా సాధింప వచ్చును. రెడ్డిగారు ఎంతో కృషిచేసి, సులభ పద్ధతుల ద్వారా సాధ్యమై నంత వరకు తెలుగు నుడికారము సడలిపోకుండా లిపి సంస్కారమును రూపొందించారు.

నేల తెలుగు ఎకాడమీ కూడ లిపి సంస్కరణోద్దేశంతో భాషా శాస్త్రవేత్తలను, పండితులను సమావేశ పరచియుండెను. వారంతా లిపి సంస్కరణము అవశ్యమని తమ అమూల్యాభిప్రాయముల నభివ్యక్తం చేశారు. లిపి సంస్కరణను సాధించుటకొక ఉపసంఘం కూడ ఏర్పాటై నట్లు వినికిడి. వారు ప్రతాపరెడ్డిగారి లిపి సంస్కరణమును పరిశీలించి యున్నారో లేదో తెలియదు. బహుశా పరిశీలించి యుందురనే భావించుటకు ఆస్కారము కలదు. ఏది ఎట్లున్నను, ఆంధ్రలిపి సంస్కరణము ఇప్పు డైనా జరుగవలసిన తరుణ మాసన్నమైనది. సాంకేతిక వైజ్ఞానిక ప్రగతి ఉరుకులు పరుగులతో పురోగమిస్తున్న యీ ఆధునిక జగత్తులో ఆంధ్రవర్ణ మాల సాంకేతిక సౌలభ్యాలను సంతరించుకొని భాషాసేవకు ఇతోధికంగా తోడ్పడుట ఎంతేనియు అవసరము. రెడ్డిగారి పుస్తకము చిన్నదైనను ప్రాశస్త్యము రీత్యా ప్రముఖమైనది కనుక కొంత విస్తృతంగా లిపి సంస్క రణమును చర్చించుట అవసరము.

ప్రపంచ భాషలందు సంస్కృతభాష సశాస్త్రీయమగు సమగ్రభాష. క్రీ. పూ. 3000 సంవత్సరాల క్రితమే సంస్కృతభాష లిపి రూపమును దాల్చినది. దానికి శాస్త్రీయమగు రీతిలో వ్యాకరణము కూడ కీ. పూ. 1000 సంవత్సరాల క్రితమే వ్రాయబడింది. పాణిని వ్రాసిన వ్యాకరణము లాంటిది మరే ప్రపంచ భాషలందును న భూతో న భవిష్యతి. ఇక తెలుగుభాష సంస్కృతభాషా జన్యమా లేక ద్రావిడ భాషా కూటమికి చెందినదా యను మీమాంస కిచట ఆస్కారంలేదు కాని వర్ణోత్పత్తి క్రమమునుబట్టి విచారిస్తే తెలుగుతో ఇరుతెగలకు చెందిన వర్ణములు కలవు. కనుకనే కొందరు తెలుగును భాషాజన్యమంటే మరికొందరు భాషా తత్త్వవేత్తలు ప్రాకృత భాషా జన్యమని తీర్మానించారు. ఏది ఎలా ఉన్నా సంస్కృతంలో 50 వర్ణములుంటే తెలుగులో 36 వర్ణాలున్నవి, కాని వ్యవహారంలో మాత్రం 57 అక్షరాలున్నవి. అచ్చులు మొత్తం, సున్న అరసున్న విసర్గతో కలిపి 19 ఉన్నాయి. హల్లులు మొత్తం, చ, జ, ఱ ళ, క్ష, లను కలిపి 38 ఉన్నవి. అలా మొత్తం 57 అయినవి.

మొదట పూర్ణానుస్వారముతో పలుకు పదములు రానురాను అర్ధానుస్వారములోకి మారినవి. ప్రస్తుతమిక ఆయవసరం కూడ లేకుండాపోతుంది. ప్రాకృతమున కల చ జ లు తమిళ మళయాళ భాషలలో లేవు. తెలుగు ఱకారము అరవములో ఇంగ్లీషు Z కార స్వరమున ప లు కు దు రు. తెలుగులో ఇది పూర్వము ఉండెనేమో కాని నన్నయ కాలము నాటికే అది మరుగున పడిపోయెను. అరవ 'ఱ' కారము తెలుగులో 'ళ' కారముగా మారింది. సంస్కృతమున దీనికి ప్రాముఖ్యము లేకున్నను తెలుగులో దీని వాడుక బహుళము. ఎ, ఒ, లు సంస్కృతమున లేవు కాని ప్రాకృతమున ఉన్నవి. పై చర్చయంతయు తెలుగు పూర్తిగా ద్రవిడభాషా కూటమికి చెందినదికాదని తెలుపుటకే చేయబడినది.

తెలుగులిపి క్రీ. శ. 575 సం॥ నాటికంటె పూర్వపుది మనకు లభించుటలేదు? రేనాటి చోడుల శాసనమే మనకింత వరకు లభ్యమైన పురాతన

తెలుగు శాసనము. పూర్వపు తెలుగు లిపికిని నేటి తెలుగునకును చాల భేదము కలదు. అప్పకవి కాలము వరకు తెలుగులో పొక్కిలి మహాప్రాణులకు లేకుండెను. పూర్వము పూర్ణానుస్వారము చుక్కగా (.) నుంచబడు చుండెను. కాకతీయుల కాలమునాటికి తలకట్టు సన్నగా ప్రారంభింపబడీ శ్రీనాథుని కాలమువరకు ప్రస్ఫుటమయ్యెను. ఈ వివరణమంతయు తెలుపుట తెలుగు లిపిలో మార్పు అనివార్యంగా జరిగినపద్ధతిని వివరించుటకే వివరింప బడినది. మార్పు ఒక ప్రవాహంలాంటిది. మనం వలదని వారించినా కాలాను గుణ్యంగా అవసరాన్నిబట్టి అది వచ్చియేతీరుతుంది. కనుక సౌకర్యమును, సౌలభ్యమును చేకూర్చు మార్పు, సులభంగా సశాస్త్రీయంగా ఉండి, అధు నాతన పోకడలకు అనువుగా ఉంటే ఆచరణయందుంచుటలో సంశయింప పనిలేదు.

తెలుగులో 1801 సంవత్సరంలో అచ్చు ప్రారంభమైనది. మొట్ట మొదట బైబిల్ గ్రంథమే తెలుగులో ముద్రింపబడినది. ప్రస్తుతపు అచ్చు కూటమిలో 720 గదులు మరియు 583 అక్షరాలున్నవి. తెలుగులో 57 వర్ణములు మరియు పది ఒంట్లు ఉన్నప్పటికీ 720 పోత గదులుండుటకు కారణముఏమన తలకట్లకు, దీర్ఘాలకు, ద్విత్వాలకు ఇంకా తదితర గుణింతా లకు అన్నింటికి వేరు వేరు పోతలుపోసి ఇచ్చుటవలన ఏడువందల చిల్లర అక్షరాల గదులేర్పడినవి. మానవుడు సౌలభ్యమును కోరును. సౌలభ్యమున కనుకూలముగా నుండునట్లు వ్రాతను కలిపి ఏకముఖమున నడుచుటకు కలమును త్రిప్పుచుండును. అలాకాక, నాలుగుదిక్కుల కలమును త్రిప్పుటకు విజ్ఞులు అవజ్ఞగా భావింతురు.

మొదట తెలుగు లిపికి సంస్కరణమును కోరి కొన్ని సలక్షణములగు సూచనలు చేసినవారు శ్రీ శంకర నారాయణగారు. వీరు 1897 సంవత్సరంలో ప్రచురించిన "ఇంగ్లీషు - తెలుగు నిఘంటువు"నందు ఆంధ్రలిపి సంస్కార పద్ధతిని సూచించారు. అనంతరం కొంతకాలానికి కూసనూర రాఘవేంద్ర చారిగారు "కూసనూర ఆదర్శ లిపి" అను పుస్తకమును ప్రకటించి అందు

లిపి సంస్కార పద్ధతులను వివరించినారు. ప్రతాపరెడ్డిగారు "తెనుగుతల్లి" అను పత్రికలో 1941 సంవత్సరంలో లిపి సంస్కరణ వ్యాసమును ప్రకటించారు. 1944 సు॥ డిసంబర్ నెలలో ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మ గారు తెలుగులిపి సంస్కరణమును వ్రాసి ప్రకటించారు.

రెడ్డిగారు సంస్కరింపదలచిన లిపి పద్ధతిప్రకారము ౠ, ౡ లు, ఙ మరియు చ, జ, ట, డ, త, ద వర్గాదులలోగల అనవసరములగు అక్షరము లన్నియు ఎగిరిపోవును. ర కారముక్రింద చుక్కపెట్టి ఱను ఎగురగొట్టినారు. దీర్ఘములకంతయు ఒక చిహ్నముతో సరిపెట్టబడినది దానివలన అచ్చు కూటమిలోగల దీర్ఘరూపములు అన్నీ ఎగిరిపోవును. ఉర్దు. ఇంగ్లీషు భాష లందుగల F, Z, వంటి ధ్వనులను తెలుగులోకి తెచ్చుటకు ప, బ, క, గ, క్రింద ఒక చుక్కపెట్టి సరిపెట్టబడినది. అదే విధముగ 'ళ' ను తొలగించి ల కారముక్రింద చుక్కపెట్టిరి, న కారముక్రింద చుక్కపెట్టి ణ ను తొల గించినారు. క ను మరియు ష ను సంయోగముచేసిన క్ష కారమగును కనుక క్ష తొలగించబడినది. రిక్షాలాంటి శబ్దములను 'రిక్షా' అని సరిపెట్టు కొనవచ్చును. ఙ ను తొలగించి ఞ తోనే వాఙ్మయములాంటి పదాలను "వాఞ్మయము" అని వ్రాసుకొన వచ్చునని తెలిపినారు. ఈ విధముగా అర సున్న విసర్గలతో కలిపి 16 అక్షరాలు మిగిలింపబడినవి. ఇప్పుడున్న 38 హల్లులకు మారుగా 21 అక్షరములతోను, చుక్క, పొక్కిలిలాంటి వాటితో కలిపి 28 అక్షరరూపములతో వర్ణమాలను సంస్కరించినారు.

## 2. విజ్ఞాన గ్రంథములు

*1. యువజన విజ్ఞానము:—* పెద్దబాలశిక్ష యను పుస్తకమును చూచి ప్రేరేపితులై ప్రతాపరెడ్డిగారు యువజనుల విజ్ఞానార్థము ఈ యువ జన విజ్ఞానమను గ్రంథమును సంకలనము చేసినారు. ఇందు యువ జనులకు లోకజ్ఞానము, భౌతిక జ్ఞానము, పార మార్థిక జ్ఞానము కలుగునట్లు తోడ్పడుటకై నీతి పద్యములను, శతకములను, మతములను, భాషలను, పండుగలను ప్రవక్తలను, ఆరోగ్య విధులను, రాజకీయ పరిజ్ఞానమును మొదలగు విజ్ఞాన ప్రదాయక విషయముల నెన్నింటినో బహు గ్రంథముల నవలోకించి, అనువదించి, సంక్షిప్తంగా సులభశైలిలో సామాన్య విద్యా గంధముగల వారికి సైతము అవగాహనమగు రీతిలో సంకలనం చేసినారు.

ఈ నాడు మన పాఠశాలలందు బోధింపబడుతున్న విద్య ఇహ పరమున కంటకుండా ఉన్నది. విద్యార్థులకు పాఠ్య ప్రణాళికలో నీతిదాయక మగు పాఠములు లేకపోగా, తెలుగు ఒంట్లు కూడ తెలుగు బాలబాలికలకు అంటకుండా పోయినవి. బొట్లిరుసు, గిద్దెలిరుసు బోధయటుంచి, ప్రభవ విభవాది సంవత్సరాల సంఖ్యకూడ విద్యార్థులకు తెలియదంటె ఆశ్చర్య పడవలసిన అవసరం లేదు. చైత్ర వైశాఖమాసములు కూడ సక్రమంగా రాని విద్యార్థులుకూడ చాలమంది పదవతరగతిలో ఉన్నారనిన వీటికి బాధ్యత వహించునది ప్రభుత్వ విద్యా విధానమనక తప్పదు. నేల విడిచి సాముచేయు పద్ధతిలో మన విద్యాప్రణాళికలు రూపొందించ బడుతున్నవి. ఇందుకు తోడు ఆంగ్ల విద్యా వ్యామోహముకూడ మన విద్యాధికులను వెన్నాడి పీడిస్తున్నది.

జాతీయ భావాలు, దేశాభిమానము యువలోకంలో వేర్లు తన్నుకొన వలయునన్న దేశీయ విద్యలను ఉగ్గుపాలతో విద్యార్థులకు బోధించవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. పెద్దబాలశిక్షను 1847 సంవత్సరంలో శ్రీపుదూరి సీతారామ శాస్త్రిగారు బహు దూరదృష్టితో, లౌకికదృక్పథంతో రూపొందించి బాల బాలికల సర్వతోముఖ వికాసానికి సాయశక్తులా కృషి చేసినారు.

ప్రతాపరెడ్డిగారు కూడ అదే దృక్పథంతో యువ జనుల విజ్ఞానార్జనకొరకు "యువ జన విజ్ఞానము"ను వ్రాశారు. యువజన విజ్ఞానము యువలోకము పాలిటి విజ్ఞానఖని యనిన అత్యుక్తి కాదేమో ! తెలుగులో general knowledge పుస్తకాలులేని కొరతను రెడ్డిగారి పుస్తకము పూరించ గలదు. నీతి పద్యములు మొదలుకొని నన్నయ సాహిత్యమువరకు, మతములు మొదలు కొని మతప్రవక్తలవరకు, భూగోళమును ప్రారంభించి చంద్రగోళములోని ఆంతర్యములవరకు, ఆరోగ్య విధులు మొదలుకొని ఆర్యావర్తపు నాగరికత వరకు - అన్నిటినీ అవలోడన చేసిన గ్రంథమే యువజన విజ్ఞానము. ప్రపంచంలోగల జాతులు, మతాలు, ఆచార విచారములు, సంస్కృతీ సంపదలు అన్నీ సవివరంగా సరళంగా తెలుపబడినవి. వేమనతో ప్రారంభించి వేములవాడ భీమకవివరకు నీతి పద్యమంజరిలో గుదిగుచ్చ బడింది. రాజ నీతిని గూర్చిన పాఠ్యాంశములో ప్రజాస్వామ్యము, కమ్యూనిజము, నాజీజము, ఫాసీజము, నియంతృత్వములాంటి రాజకీయ పద్ధతులను విశ్లేషించి వివరింప బడింది. మత ప్రవక్తలు అను శీర్షికలో ఆర్ష నాగరికత మొదలుకొని బౌద్ధము, ఇస్లాము మతము, జోరాష్ట్రనిజము, కిరస్తానము, వరకుగల వివిధ మతముల ప్రారంభము, వాటి మౌలిక బోధ, నీతి నియమాలను గూర్చి కూడ సవిస్తరంగా చర్చించబడింది.

ఇవిగాక మానవుని సక్రమ పురోభివృద్ధి కవసరమగు భాషలు, పండుగలు, ఆరోగ్యవిధులు, గ్రామ సమస్యలు, విజ్ఞాన విశేషాలు అన్నీ క్లుప్తంగా సగటుమానవుని కవసరమగు లౌకిక జ్ఞానసంపదనంతా ఘనీభవింప జేసుకున్న గ్రంథరాజము. దురదృష్టవశాత్తు ఈ నాడీ గ్రంథము ఏపుస్తక విక్రేతలవద్దనూ లభించుటలేదు. ప్రగతిపథంలో పయనిస్తున్న నవీన నాగరిక యువ ప్రపంచానికీ గ్రంథముయొక్క ఆవశ్యకత ఎంతేనియు కలదు.

*2. హైందవ ధర్మవీరులు :—* ఈ పుస్తకమును రెడ్డిగారు కేవలము విద్యార్థిలోకాన్ని దృష్టియందుంచుకొనియే వ్రాసినారనవలసి యున్నది. గోలకొండ పత్రికాముఖమున నీవీర రసాత్మక గాథలు చాలకాలం క్రితం

ప్రచురింపబడినవి. "హైందవ ధర్మవీరులు" పుస్తకరూపంలో వెలువడిన ఆరు మాసములలోనే పునర్ముద్రింపబడిన చక్కని చిక్కని హైందవ ధర్మ వీరుల గాథా సంపుటి. 1954లో మద్రాసు ప్రభుత్వము వారు ఈ పుస్తకమును ఉన్నత పాఠశాల విద్యార్థులకు ఉపవాచకంగా నిర్దేశించారు.

హైందవ ధర్మ పోలీలనికూడ దీనికి నామాంతరము కలదు. ధర్మ పైలీ యుద్ధము ప్రాచీన గ్రీసుదేశ చరిత్రలో చాల ప్రసిద్ధిగాంచినది. గ్రీసు దేశపు "ధర్మపైలీ" కనుమవద్ద కొలది సైన్యముతో లియోనీదాస్ అను వీరుడు వేలసైన్యము నడ్డుకొని వీరమరణం పొందుతాడు. ఇలాంటి "ధర్మ పైలీ"ల వీరగాథల కొరకు మనము యూరోపియన్ చరిత్రనంతా గాలించవలసిఉంటుంది. కాని అలాంటి ధర్మపైలీలు భారతదేశ చరిత్రలో కోకొల్లలు. దేశాభిమానము, జాతీయాభిమానము నరనరాల్లో జీర్ణించుకున్న ప్రతాపరెడ్డి గారు భారతదేశ చరిత్రనుండి మచ్చునకు మాత్రము కొందరు ధర్మవీరుల చరిత్రను నరాల నుడుకెత్తించు శైలిలో యీ పుస్తకంలో గ్రథనం చేశారు. భారతదేశ చరిత్రయొక్క ప్రతి పుటలోను మనకు ధర్మపైలీలు సాక్షాత్కరిస్తారు. అయినా వారిని భారతీయులే సంస్మరించుకొనరని రెడ్డిగారు తమ విచారము నభివ్యక్తంచేశారు.

ఇందభివర్ణితములైన బాలచంద్రుడు, తానాజీ మాలుసురె, బాజీ దేశపాండ్యా, అబ్దుల్ రజాక్‌లారీ, అమర్‌సింగ్, భల్లూసింగ్, గురుగోవింద సింగ్, సోమనాద్రి, సదాశివరెడ్డి, బలభద్రుడు లాంటి వీరులు కణకణలాడు నిప్పు కణాలు, స్వామి భక్తిలోను, దేశభక్తి ప్రకటనలోను, మాతృభూమి సంరక్షణలోను, స్వాభిమాన సంరక్షణలోను, మిత్రులను శత్రుమూకల నుండి కాపాడి ఆత్మబలిదానం కావించుకొనుటలోను ఇందభి వర్ణితములగు వీరులు వారికి వారే సాటి ధర్మపైలీ కనుమలో లియోనీదాస్ శత్రుమూకల ఢీకొంటె, కొండ కనుమలలో వేలసైన్యమును గంటలకొలది ఛత్రపతి శివాజీ యాజ్ఞానుసారం బాజీ దేశపాండ్య కొద్దిమంది మావళీలతో ఢీకొని శత్రువులను కోటలో శతఘ్నులు మ్రోగువరకు, ఒక్క అడుగైనా ముందుకు కదలనీక

ప్రాణాలొడ్డి పోరాడుతాడు. సదాశివరెడ్డి ప్రభువు సామంత రాజైనా నిజాం ప్రభువు నాదుకొని స్వామిభక్తి పరాయణుడై తన సర్వస్వం సమర్పించి ఆత్మత్యాగం చేసిన ధైర్య శౌర్య పరాక్రమశాలి. హిందూ దేశ చరిత్రము ఎంతటి మత సాంఘిక పరిణామ ప్రధానమైనదో అంతటి వీరగాథా పరిపుష్ట మైనది. ఇలాంటి చక్కని వీర రస ప్రధానమగు పుస్తకమును ఉన్నత పాఠశాలా పాఠ్యగ్రంథముగా ప్రభుత్వము ఎందుకు ఎన్నుకొనలేదో దురూహ్య ముగా నున్నది. భావ సమైక్యతకు, దేశసమైక్యతకు ప్రాకులాడు ప్రభుత్వము ఈ పుస్తకాన్ని పాఠ్యపుస్తకంగా ఉంచవలసిన అగత్యము ఈ నాటి రాజకీయవాతావరణానికి చాల అవసరము.

*3. సంఘోద్ధరణము* :—రెడ్డిగారు అడపాతడపా వ్రాసి ఆ యా పత్రికా ముఖమున ప్రచురించిన వ్యాసరాజములను కొన్నింటిని ఎన్నుకొని ''సంఘోద్ధరణమ''ను పుస్తకంగా 1925 సం॥లో ఆదర్శ గ్రంథమాల వారి పక్షాన ప్రచురింపబడింది. రెడ్డిగారు విద్యార్థిదశలో నున్నప్పుడే 'కళ' 'పినాకిని' 'తెలుగు తల్లి' 'రెడ్డిరాణి' మున్నగు పత్రికలకు ఆ యా సందర్భము లలో వ్రాసిన వ్యాసరాజములే సంఘోద్ధరణమున వెలువడినవి.

రెడ్డిగారు మద్రాసులో బి. ఎ., బి. ఎల్. పరీక్షలకు చదువుతున్న కాలంలో మద్రాసు నగరం భారత రాజకీయ రంగానికి కొంగుబంగారమై విలసిల్లినది. భారతదేశపు రత్నగర్భలో అవతరించిన మహానుభావులంతా 1920 నుండి 1925 సంవత్సరాలమధ్య మద్రాసువచ్చి తమ భావసంచయంతో దేశ ప్రజలను ఉర్రూతలూగించారు. రెడ్డిగారు కూడ ఆ మహానుభావుల అడుగుజాడల పయనించిన వారే కనుక, రెడ్డిగారి వ్యాసావళిలో దేశభక్తి ప్రబోధితములగు అంశములు కోకొల్లలుగా లభిస్తాయి. ముఖ్యంగా వారి వ్యాసాల్లో ''మలబారు క్రైస్తవులు'' ''మన పరిశ్రమలను నాశనం చేసిన దెవరు?'' ''ఖద్దరు ధారణ'' ''సత్యాగ్రహోద్యమము'' ''మద్యపానము'' ''ప్రత్తి పంటసాగు'' మొదలగునవి వారి సునిశిత జ్ఞాన పాటవమునకు, పరిశోధనాప్రజ్ఞకు, దేశభక్తికి ప్రతీకలు. ప్రజలను అజ్ఞానాంధకారము నుండి

మేలుకొలుప వలయునను ఆరాటము, ఆవేదన వారి ప్రతి వ్యాసమునందు తొంగిచూస్తుంది. రెడ్డిగారి వ్యాసాల్లో విద్యాతృష్ణ, విషయ పరిజ్ఞానము, దేశ భక్తి, రాజకీయ జిజ్ఞాస, తొణకిస లాడుతుంటవి. వారి గ్రంథ పఠనాసక్తి అసదృశము, అనన్యసామాన్యము. వారే క్రొత్త విషయము నవలోకించినా, ఏ అపూర్వ విషయాలు కనుగొన్నా, వాటిని పాఠకుల ముందుంచనిదే తోచదు. ఆయన చదివిన చదువు, చేసిన పరిశోధన, నేర్చుకున్న నూతనాంశాలు అన్నీ పాఠకులకేనన్న సదాశయంతో విషయజ్ఞానసేకరణ చేసెడివారు. అందువల్లనే వారి వ్యాససంపుటమగు సంఘోద్ధరణము విజ్ఞానఖనియై భాసిల్లినది.

*4. ప్రజాధికారములు* :—''ప్రాథమిక స్వత్వములు'' అను పేరుతో యీ పుస్తకమును 1938 సంవత్సరంలో దేశోద్ధారక గ్రంథమాల వారు ప్రకటించారు. ప్రతాపరెడ్డిగారు అడపాతడపా గోలకొండ పత్రికలో ప్రాథమిక స్వత్వములను పేర కొన్ని వ్యాసములను ప్రకటించారు. వాటిలో కొన్ని వ్యాసములను క్రోడీకరించి మొదట ప్రకటించడం జరిగింది. మళ్ళీ 1950 సంవత్సరంలో రెడ్డిగారు ద్వితీయముద్రణ గావించారు. అప్పుడు శీర్షికను మార్చి ''ప్రజాధికారములు''గా రూపొందించబడింది.

కేవలం రాజ్యాంగబద్ధమగు పౌరస్వత్వములే యీ గ్రంథములో పొందుపరచ బడలేదు. సంఘములో ప్రజలు తమ పౌరస్వత్వములను సంపాదించుకొనుటకు అనాదినుండి యీనాటిదాకా పడినపాట్లు, చేసిన త్యాగాలు, జరిపిన ఆందోళనలు ఈ చిన్న పుస్తకంలో సంగుప్తం చేశారు. డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్య గారు చక్కని ఉపోద్ఘాతమును కూడ వ్రాసినారు.

''వార్తయందు జగము వర్తిల్లుచుండును...'' అను నన్నయగారి మాటతో ప్రారంభమైన వ్యవహారకాండ గౌతమ యాజ్ఞవల్క్యాది ఋషుల రాజ్యాంగతంత్ర విధానములను స్పృశిస్తూ అధునాతన రాజ్యాంగ పద్ధతులు క్లుప్తంగా యీ ప్రజాధికారములందు చర్చించ బడినవి. భారతదేశంలో,

జ టర్కీలో, రష్యాలో, అరబిస్తాన్‌లో, అమెరికాలో ప్రజలు రాజులయొక్క నియంతృత్వపాలనకు వ్యతిరేకంగా పోరాడిన విధానము, దమనకాండ, దోపిడీ పద్ధతులు, ర జా కా ర్ల దౌష్ట్యమును నేలరాచిన పద్ధతులు సవివరంగా వివరింపబడినవి. బ్రిటిష్ పరిపాలనా హయాంలో భారత ప్రజలు తమ పౌరస్వత్వాలకై జరిపిన పోరాటవిధానము, నిజాం నిరంకుశ పాలనలో హైద్రాబాద్ ప్రజలు పడినపాట్లు, చేసిన త్యాగాలు, ఇత్తెహాద్ ముసల్మాన్ పార్టీ స్వైరవిహారం, కాసిమ్ రజ్వీ ఔద్ధత్యం అన్నీ పూసగ్రుచ్చినట్లు విశదీకరింపబడినవి.

చాతుర్వర్ణ వ్యవస్థ భారతదేశంలోనే కాక, పాశ్చాత్య దేశాలలోకూడ ఆచరణ యందుండెనని రెడ్డిగారు రోమన్ సామ్రాజ్యంలో అమలుయందున్న పెట్రిషియనులు, నైట్సు, ప్లెబియన్లు, బానిసలు మొదలగు తెగలవల్ల నిరూపింపబడినది. ఆర్ష భాషాజ్ఞానం పాశ్చాత్యులలో ప్రబలిన కొలదీ సంస్కృత వాఙ్మయంలో సంగుప్తమైన రాజనీతి వైదుష్య విజ్ఞానమును అవలోడన చేసిన మాక్స్‌ముల్లర్, గెటె, ఎమర్సన్ ప్రభృతులు ఉపనిషత్తుల ప్రభావాన్ని గుర్తించారు.

భగవద్గీతలో ప్రకటించినట్లు "కర్మలు చేయనంతవరకు వాని ఫలముల ననుభవించుటకు మానవునికి అధికారము లేదను నిత్యసత్యం యీనాటి రాజ్యాంగ వేత్తలకు, నాయకులకు, ప్రజలకు కనువిప్పుగా నుండగలదు. ప్రాచ్య పాశ్చాత్య నాగరిక ప్రపంచ రాజకీయ చైతన్యస్రవంతి "ప్రజాధికారముల"లో స్థూలరూపంలో గోచరిస్తుంది. రాజకీయ పరిజ్ఞాన పిపాసులకు "ప్రజాధికారములు" ఒక చక్కని వైజ్ఞానిక గ్రంథము.

## 3. కథలు

కథానికా సాహిత్య జగత్తులో హేమాహేమీలనదగిన మహానుభావులు ఆంధ్రదేశంలో పెక్కుమంది ఉన్నారు. వారిలో మొదట సంస్మరింప దగిన

వారు శ్రీయుతులు గురుజాడ అప్పారావు, వేలూరి శివరామశాస్త్రి, అడవి బాపిరాజు, త్రిపురనేని గోపీచంద్, బుచ్చిబాబుగారలు, సుమారు ఒక శతాబ్దం నుండి పుంఖానుపుంఖంగా వెలువడుతున్న కథానికా సాహిత్య సృష్టికి దోహదం చేసినవారిలో ఎందరో చేయితిరిగిన రచయితలున్నారు.

కథావస్తువులో, కథాకథన సంవిధానంలో, భాషావైశిష్ట్యంలో, పాత్ర పోషణ చిత్రణాది వర్ణనా చాతుర్యంలో అనుపమ ప్రజ్ఞను ప్రదర్శించుట గొప్ప నైపుణ్యమే: కాని కథారచన సంవిధానంలో ప్రత్యేక వ్యక్తిత్వమును రుజువు చేసికొనుట కష్టతరమగు విషయము. వాస్తవాలను కల్పనా జగత్తుతో కలగాపులగం చేసి, వర్ణనా వైచిత్రితో మిరుమిట్లుగొలుపు కథలు అల్లువారూ ఉన్నారు. వాస్తవాలను అతి వాస్తవికంగా విప్పిచెపుతూ లేనివి కొన్ని అతికించి, భయానక గాథాకల్పనచేయు విప్లవవర్గ రచనా ప్రవీణులూ ఉన్నారు. ఇకపోతే కొందరు వాస్తవాన్నే వదలిపెట్టి కల్పనాజగత్తులో విహరిస్తూ లోకాన్నే భూతలస్వర్గంగా కథానికా జగత్తునలంకరించు కాల్పనిక భావుకులూ ఉన్నారు. కేవలం నాగరికలోకానికే సంబంధించిన సమస్యలను తీసికొని సాహిత్యాన్ని సృష్టిస్తూ అటు జాతీయభావముల కాస్కారమియ్య కుండా, ఇటు తెలుగు సంస్కృతిని ముట్టకుండా ఉంటున్న కధకులు కూడ ఉన్నారు. కాని గ్రామసీమల వాస్తవిక స్థితిగతులను ఆమూలాగ్రంగా ప్రతి బింబించు కథకులు సకృత్తుగా లభిస్తారు.

ప్రతాపరెడ్డిగారి కథలలో మనకు మచ్చుకైనా భావనా జగత్తులో విహరించు కథావస్తువు లభించదు. గ్రామ జీవన చైతన్యం, వారి సంప్రదాయాలు, కట్టుబాట్లు, కష్టసుఖాలు, గ్రామ రాజకీయాలు, వాళ్ళ సమస్యలు ; వాళ్ళను దోచుకున్న దొరలు, కక్షలూ కార్పణ్యాలే, అచ్చు గుద్దినట్లు రెడ్డిగారి కధాసాహిత్యం సాక్ష్యం చెబుతుంది. కథ టూకీగా ఒక నీతిని, ఒక సందేశాన్ని పాఠకుడి కందించే సాధనంగా పరిగణింపబడే రోజుల్లో రెడ్డిగారి కథా సాహిత్యం వెలుగులోకి వచ్చింది. నలుబది సంవత్సరాల క్రితం నిజాము నవాబు పాలించిన తెలంగాణలో గ్రామీణ జీవన సమస్యలకు

రెడ్డిగారి కథలు దర్పణాలు. వారి కథలలో సంభాషణా చాతుర్యంగాని, శబ్దాలంకార డాంబికంగాని, అంతగా కానరావు. తేట తెనుగుమాటల్లో కథను సూటిగా ఘాటుగా నడిపి, కథేతివృత్తాన్ని రమ్యంగా అభివ్యక్తంచేస్తూ పాఠకుడిలో చెరగనిముద్ర వేస్తారు. నిజాము నాజీల నిరంకుశాంకుశానికి నలిగి నకనక లాడుతున్న పేదజనం పోలీసు బూట్లక్రింద అణిగిపోయిన పీడిత ప్రజలు, దొరల దురంతాలకు బలియైన బక్కప్రజానీకం, సంఘ దురాచారముల తాకిడికి రాపిడికి బలియైన అమాయకులు, మత దురహంకారుల ఒత్తిడికి చితైపోయిన అబలలు, తురక తుంటరుల పైశాచిక ప్రవృత్తికి పతితలైన గృహిణులు, పెద్దల క్రౌర్యానికి గురియై కూలిపోయిన ప్రేమికులు ముసలిమగల పీడ వదలించుకొనుటకు ముద్దరాండ్రు పడిన పాట్లు రెడ్డిగారి సాహిత్యంలో తారటాడుతూ తమగోడు వినిపిసాయి.

ఉబుసుపోకకు కాలక్షేపానికి గిలికిన నగిషీలు వీరి కథా సాహిత్యంలో మచ్చుకైనా కానరావు. నిజాం పాలనాహయాంలో జరిగిన దురంతాలకు రెడ్డిగారి కథలు ప్రత్యక్ష సాక్ష్యాలు. తురకరాజుల పాలనలో నలిగిన గ్రామీణ ప్రజానీకపు సాంఘిక వాతావరణం వీరి కథలలో తాండవిస్తుంది. రెడ్డిగారి భాషలో తురకపదాల వాడకం అధికమే! నాటి సాంఘిక వాతావరణాన్ని సృష్టించడానికి, అవసరమున్నచోట హాస్యరసం చిప్పిలజేయడానికి తురక పదాల వాడకం తప్పని సరియైనది. ఆ యా కథలలోని పాత్రలు అభివ్యక్తం చేయు హాస్యంలో కొంత బాధ మరికొంత బోధ ప్రస్ఫుటంగా గోచరిస్తుంది.

రెడ్డిగారు వ్రాసిన కథాసాహిత్యంలో ''వింత విడాకులు'' అను పెద్ద కథ తలమానికం లాంటిది. గ్రామ వైద్యుడు, బడి పంతులూ అయిన నంబి నర్సిమ్ములు ఇందు కథానాయకుడు. నంబి నర్సిమ్ములు వైద్యంతో చావుతప్పి కన్నులు లొట్టలుపోయిన పరిస్థితీ, అతడు ధనార్జనచేసి పొట్ట పోసుకును పద్ధతి పాఠకుల హృదయాలను కడుపుబ్బ నవ్వించి కవ్విస్తుంది. నంబి నర్సిమ్ములే కమలమ్మ వివాహం ముసలి మొగుడితో జరిపించడానికి కారకుడవుతాడు. మళ్ళీ అతడే కమలమ్మ విడాకులు పుచ్చుకోవడానికి చేయ

వలసిందంతా చేసి తన పంతాన్ని సాధిస్తాడు. అతడి పన్నాగానికి కారణం మరియు మూలము గోలకొండ పత్రికలో ప్రచురింపబడిన విడాకులవార్తయే! కమలమ్మకు విడాకులిప్పించడానికి ఆవిడను తురకల్లో కలిపి కమాల్‌బీగా మార్పించి ఆవిడ భర్తకు కోర్టుద్వారా నోటీసు ఇప్పిస్తాడు. కమలమ్మ మొగుడు విధిలేక తన భార్యకు విడాకులిస్తాడు. అనంతరం కమాల్‌బీ ఆర్యసమాజం వారి సహకారంతో మళ్ళీ హైందవమతం స్వీకరించి తాను కోరుకున్న యువకుడిని పెళ్ళాడుతుంది. నంబి నర్సిమ్ములు తన పంతాన్ని నిలబెట్టుకుని గ్రామస్తులచేత భళీ యనిపించుకొనడం చూస్తె పాఠకుడి మనస్సు హాస్యకరుణరసాల్లో తేలియాడుతుంది. "వింత విడాకులు"ద్వారా రెడ్డిగారు ముసలి మగల పెండ్లిళ్ళకు సంక్రమించగల విషమ పరిణామములను ముచ్చటగా చిత్రించి పాఠక హృదయాల్లో చెరగనిముద్ర వేస్తారు. గ్రామీణ వాతావరణం, వాళ్ళ మూఢనమ్మకాలు, పిల్లలను పొందడానికి వారు పడే పాట్లు, డబ్బు కక్కుర్తికి వారు చేయు దురంతాలు కళ్ళకు కట్టినట్లు చిత్రింపబడినవి. మళ్ళీ పెళ్ళినేకాక, వర్ణాంతర వివాహాన్నికూడ వింత విడాకుల్లో బహు వింతగాజోడించి చక్కని హితోపదేశం చేశారు రెడ్డిగారు.

"నిరీక్షణ" అన్న శీర్షికతో వ్రాయబడిన కథ శంకరన్ మరియు కుమారీమణుల ప్రణయానురాగ గాథ. ఆదిశంకరుడు కన్యాకుమారిని వివాహం చేసుకుంటానని అభయమిచ్చి దక్షిణాభిముఖుడై పోయి మళ్ళీ తిరిగి రాడు. శంకరుడిచ్చిన మాట ప్రకారం కన్యాకుమారి దక్షిణాభిముఖియై నిరీక్షిస్తూ ఉండి శిలావిగ్రహమై, దేవతయై, ప్రేమ స్వరూపిణియై యీనాటికీ కేరళవాసుల పూజల నందుకుంటుంది. ఈ ఐతిహాసికగాథ ననుసరించియే 'నిరీక్షణ'మను కథను వ్రాయడం జరిగింది.

కుమారీ శంకరన్‌లు చిన్ననాటినుండి ఒకే కంచంలోతిని ఒకేపంచన పెరిగి, ఆడుకుంటూ పాడుకుంటూ ఒండొరులను ప్రేమించుకొని పెళ్ళి చేసుకోవడానికి నిశ్చయించుకుంటారు. శంకరన్ తన కులాచారం ప్రకారం సముద్రంనుండి ఏడు చేపలను వేటాడి తెచ్చి వివాహం చేసుకోవడానికి ఒక

శుభోదయాన సముద్రంలోకి పడవలో పోతాడు. సముద్రపుటలలలో చిక్కుకుని మరణించిన శంకరన్ తిరిగి రాడు. కాని కుమారి మాత్రం అతడు తిరిగివస్తాడనే ఆశతో దినములు, నెలలు, సంవత్సరాలు నిరీక్షిస్తూ కాలం గడుపుతుంది. పెద్దవారు ఇంకొకరితో వివాహం చేయిస్తామన్న అంగీకరించక జీవితాంతం శంకరన్ కొరకే నిరీక్షించి ప్రేమకు తనజీవితాన్ని నీరాజనంగా సమర్పించి గ్రామీణప్రజల భక్తిప్రపత్తులకు పాత్రమై తన జీవితాన్ని చరితార్థకం చేసుకున్న ప్రేమైకేతివృత్తంకల చక్కని ప్రణయగాథ.

"సంఘాల పంతులు" అన్న కథలో గ్రామీణప్రజలను పోలీసులు ఎలా దోచుకుతిని వాళ్ళను నానా బాధలపాలుచేసిన ఇతివృత్తం గోచరిస్తుంది. రామాపురం కృష్ణానదీతీరాన గల ఒక కుగ్రామము. కృష్ణ కవతల ఆంధ్ర ప్రాంతము. ఇవతలి గ్రామాలు నిజాం ఇలాకా ప్రాంతము. అవతలి తట్టు స్వేచ్ఛావాయువులు ప్రసరిస్తుంటాయి. ఇవతలి గ్రామాల్లో పోలీసు జులుమ్ తాండవిస్తుంటుంది. రామా పురంలోఉన్న పోలీసు ఠానా జవాన్లు గ్రామస్తులను వెట్టిచాకిరికి, దౌర్జన్యానికి బలిచేస్తూ బ్రతుకుతుంటారు. ఒకనాడు సంఘాల పంతులనే వ్యక్తి రామాపురం వచ్చి వారిని జాగృతంచేసి, వారు పోలీసులవల్ల పడు అగచాట్లను ప్రభుత్వానికి నివేదించి, వెట్టి చాకిరీని, కోమట్లబాధను నివారించడానికి తోడ్పడుతాడు. సంఘాల పంతులు కృషివల్ల అక్కడి ప్రజలు సుఖశాంతులతో జీవిస్తారు. అక్కడినుండి పోలీసు ఠానా ఎత్తివేయబడుతుంది. ఇది టూకీగా సంఘాల పంతులు కథ.

ఇక ''వకీలు వెంకయ్య'' కథలో వెంకటరెడ్డిగారి బూటకపు వకాలతు బండారం, అతడు చేసిన దురంతాలు, తుదకాతడు గ్రామీణుల చేత పతనమైన వైనం వివరింపబడింది. చిన్ననాడే వెంకటరెడ్డి తన తండ్రితో కీచులాడుకుని చెప్పాచెయ్యకుండా పట్నం చెక్కేస్తాడు. పట్నంలో ఒక పేరు మోసిన తురక వకీలువద్ద చాకిరీచేసి నాలుగురాళ్ళు చేసుకోవడానికి ఉండిపోతాడు. అలా ఐదారేండ్లు తురక వకీలుకు సేవచేసి నాలుగక్షరాలు నేర్చుకుంటాడు. చిన్నగా తురకంకూడ బాసలాడ మొదలిడి వకీలుభాషను వంట

బటించుకొని ఒకనాటి శుభోదయాన శేర్వానీతో తెల్లపైజామాతో, చమ్కీ బూట్లవేషంతో గ్రామంచేరుకొ వకీలు వెంకయ్యగా ప్రజలచేత ముద్ర వేయించు కుంటాడు.

ఏనాడో ఇల్లువిడిచి తిరిగివచ్చిన వెంకయ్యను తలిదండ్రులు మరియు గ్రామీణులు సాదరంతో చేరదీస్తారు. కాని వెంకయ్య తన వకాలతుముక్కల ప్రభావాన్ని గ్రామంలో ప్రయోగించి అందరినీ హడలగొట్టి, ఎట్టకేలకు పోలీసు పటేల్‌గిరి సంపాదించి గ్రామకక్షలు సృష్టించి, పోలీసులను కట్టుకుని దౌర్జన్యంచేస్తూ భూములనార్జించి, బిల్డింగులు కట్టించి, గ్రామస్థులను హడల గొడతాడు. మన్నుమిన్ను గానక తుదకు కులకాంతలనే చెరబట్టి అపర కీచకుడై వంచింపబడి దేహశుద్ధి గావించుకొనడమే కాకుండా తాను పన్నిన ఉచ్చులో తానే చిక్కుకుని జేలుపాలై, అప్పులపాలై సర్వసంపదను నాశనం చేసుకుంటాడు. అన్నిటికీ కారణం తన వకీలు మోసాలేనని అవసాన ఘడియల్లో తెలుసుకుని గుండెపగిలి కుక్కచావు చస్తాడు. వకీలు వెంకయ్య ద్వారా రెడ్డిగారు దుష్టబుద్ధులకు కలుగు పర్యవసానమును టూకీగా విశదీకరిస్తారు.

నాల్గవ కథ "బ్యారిస్టర్ గోపాల్ కిషన్‌రావు."గారిది. గోపాల్ కిషన్‌రావు గోలకొండ వ్యాపారుల ముద్దుబిడ్డడు. సంపన్నులకు వ్యాపారి బ్రాహ్మణ దంపతులకు కలిగిన ఏకైక పుత్రుడు. ఉన్న కుటుంబం కనుక గోపాల్ కిషన్‌రావు ఇంగ్లాండుకు పోయి బ్యారిస్టరై తిరిగివస్తాడు. వస్తువస్తూ పాశ్చాత్య నాగరికతనుకూడ వెంటతెచ్చు కుంటాడు. పూర్వాచార పరాయణురాలగు తన భార్యను అప్‌టుడేట్‌గా ఉండమని కురుసంతతిని కత్తిరించుకు బాబ్డ్‌హేర్ పెట్టుకు తనతో రోడ్లవెంట కులుకుమని నిర్బంధిస్తాడు. పాపం ఆవిడ అందుకు అంగీకరించకపోతే విడాకులిచ్చి మరొక వలపుల మిటారిని పెండ్లాడి తండ్రితో విడిపోయి ముప్పయివేల డబ్బు పంచుకొని వేరుకాపురం వెలిగిస్తాడు. మళ్ళీ పెండ్లాడిన వనిత పూర్వాశ్రమంలో వేశ్యారత్నము కాబట్టి దాని పూర్వపుస్నేహితులు, అధునాతన నాగరికత పేరుతో గోపాల్

కిషన్‌రావు బ్యారిస్టర్‌గారి వర్తమాన భార్యతో సినిమాలకు, క్లబ్బులకు, షికార్లకు విలాసంగా కులాసాగా తిరుగుతుంటారు. పాపం! బ్యారిస్టర్‌గారు ఏమీ చేయ లేకపోతాడు. ఒకనాడు ఓపికపట్టలేక అలా తిరగవద్దని సరసాల సరదాల అర్ధాంగిని అడ్డగిస్తాడు. సానిది సరదాలు మానక ఒక తురక సాహెబుతో చెప్పాపెట్టకుండా లేచిపోతుంది. బ్యారిస్టర్ భగ్నహృదయంతో సాహెబుపైన బీబీని ఉడాయించుకు పోయినట్లు కోర్టులో దావావేస్తాడు. తుదకా కేసు హిందూ, మహమ్మదీయుల మతాల నావేశపరచు అభిమానపు కేసుగా పరిణమిస్తుంది. కోర్టులో సానిదాని తల్లి సాక్ష్యం కారణంగా తురక సాహెబుపక్షాన తీర్పువస్తుంది. గోపాల్ కిషన్‌రావుగారి పాశ్చాత్యవ్యామోహం తనను కాసుకు కొరగాని వాడిని చేస్తుంది. బ్యారిష్టర్ కళ్లుతెరచి తన తలిదండ్రుల ఇల్లుచేరుకుని భార్యకాళ్లు పట్టుకుని లెంపలు వాయించుకుని బుద్ధిగా శేషజీవితం గడుపుతాడు. గుడ్డిగా పాశ్చాత్యనాగరికత ననుకరించు వారికిదొక కనువిప్పు కథ.

ఇకపోతే అయిదు ఆరు కథలు రెండూ కథా కథన సంవిధానంరీత్యా ఒండొంటితో పెనవేసుకున్న జంట కథలు. "చెంద్రయ భీమా" పెండ్లి బేరము" అను యీ కథలలో బడిపంతులుగా బ్రతుకుతున్న శంకర శాస్త్రి గారి జీవితనౌకకు ఎన్ని ఒడుదొడుకులు తారసిల్లుతాయో చిత్రీకరించబడింది.

శాస్త్రిగారి బడిని తనఖీ చేయడానికి నాజర్ (Inspector of Schools) వస్తాడు. పాపం, శాస్త్రిగారు ఎంతో ప్రయాసపడి పిల్లలకు పాఠాలు నేర్పుతాడు. కాని ఒక్క ఆకతాయి కారణంగా పిల్లలంతా నాజర్ వేసిన ప్రశ్నలకు వక్రభాష్యం చెబుతారు. దానితో నాజరుగారి బుర్రతిరిగి గంగ వెర్రులెత్తిపోతుంది. నాజర్ ఉగ్రుడై శాస్త్రిగారి ఉద్యోగం ఊడ బెరుకుతాడు. ఉద్యోగం పోగొట్టుకున్న శాస్త్రి ఊరువదలి తన స్నేహితుడి సహాయంతో భీమా ఏజంటు ఉద్యోగం చేపట్టి తన స్నేహితుడి బావగారి జీవితాన్నే ప్రథమంగా భీమా చేయించడానికి ఒప్పించి డాక్టరుచేత పరీక్ష చేయించడానికి డాక్టరును రప్పించి పరీక్ష ప్రారంభిస్తాడు. వట్టి పల్లెటూరి

బైతుగారికి డాక్టరుపరీక్ష శల్య పరీక్షగా గోచరిస్తుంది. మర్మాంగాలను పరీక్షించడానికి అతని ధోవతిని ఊడబెరికిన డాక్టరు చెంపను గట్టిగా వాయిస్తాడు. తానొకటి తలుస్తె దైవమొకటి దలచినదన్న సామెతగా పరిణమించిన శాస్త్రి అక్కడినుండి పరారై నిజాము సరిహద్దుదాటి గుల్బర్గా చేరుకొని మరొక డాక్టరు చలవవల్ల కాంపౌండరు ఉద్యోగం సంపాదిస్తాడు. గుల్బర్గాలో స్థిరపడిపోయిన మరొక బ్రాహ్మణుడి కూతురును తన స్నేహితుడికి పెండ్లి సంబంధం కుదుర్చుతాడు. కాని వరకట్నాల లావాదేవీల పేచీ రావడంవలన పెండ్లిపీటల మీద వియ్యాలవారు కయ్యానికి దిగి తాళిబొట్టును తెంపి చక్కాపోతారు. వియ్యం కయ్యమై కోర్టుకెక్కుతుంది. తన కూతురును మేనల్లుడికిచ్చి వివాహం చేస్తాడు. దానితో వరుని పక్షం వాళ్ళు అతనిపై పరువునష్టం దావా వేస్తారు. అక్కడకూడ మన కథానాయకుడు శాస్త్రిది ప్రధానపాత్రే కావడంవలన వధువు పక్షం తరపున కోర్టులో హాజరు అవుతాడు. గుల్బర్గా వ్యాపారి వ్యవహారదక్షుడు కావడంవలన భజంత్రీల వారిని, మంత్రం చదివిన బాపనయ్యను కూడగట్టుకొని కేసు కొట్టి వేయించుకుంటాడు.

మొత్తంపై బడిపంతులుగా బ్రతుకలేని శాస్త్రి, జీవితంలో ఓటమిని అంగీకరించక జీవితపు మిట్టపల్లాల నధిరోహించుకుంటూ ముందుకుసాగడం యీ కథల ప్రధానేతివృత్తము. బ్రతుకుతెరువుకు నానా యాతనల పడిన శాస్త్రిని శనిదేవత విడువక వెన్నాడి ఎలా పీడించినదన్న విషయాన్ని చక్కని హాస్యరస ప్రధానశైలిలో కథను తీర్చిదిద్దిన శిల్పవైనం రెడ్డిగారి కథలకు వన్నె తెచ్చింది.

ఏడవ కథ "వెంకటరెడ్డి దొర" వారిది. వెంకటరెడ్డి దొర తన గ్రామములో 'రెడ్డి వచ్చె మొదలాడు' అన్నంతపని చేస్తాడు. తిమ్మిని బమ్మి చేయడంలోను, గ్రామంలో కక్షలను పెంచి ఒకరి నేరాన్ని మరొకరి నెత్తిన రుద్ది కక్షలు సాధించడంలోను అతనికి పెట్టిందిపేరు. పోలీసు వాళ్ళకు కుడిపించి, జేబులు నింపి తన భేషజపు దొరతనాన్ని కాపాడుకొను తాపత్ర

యంలో తాను చితికిపోయి తన ప్రతికక్షులను పాడుజేసి తుదకు గ్రామ ప్రజలకు కూడ శాంతిసౌఖ్యాలు లేకుండాచేసింది వెంకటరెడ్డి దొరగారు.

గ్రామములో ఒకరి ఇంట్లో దొంగతనం చేసింది ఒకరైతే మరొకరిని అనగా తన వ్యతిరేక ముఠావాళ్ళను అందులోనెట్టి అమీన్‌సాబు జేబునింపి అతని నోరు కట్టి నాటకం ఆడుతాడు రెడ్డిదొర. అయితే ప్రత్యర్థులేమీ తక్కువ తినలేదు. వాళ్లు గ్రామ శివార్లలోగల తాడిచెట్లను నరికించి సదరు దొరగారి పార్టీవాళ్ళను అందులో ఇరికించి, ఆలవాటైన అమీన్‌సాబుకు గతి కించి వెంకటరెడ్డిని కటకటాలపాలు చేస్తారు. ఇలా నేరాలు, ప్రతినేరాలు చేయించుకుంటూ, ఒకరిపై ఒకరు కక్షలను కార్పణ్యాలను పెంచుకుంటూ, తమకుగల పిత్రార్జితాన్ని కర్పూరంలా కరిగించుకోవడమే కాకుండా, అప్పుల పాలై చిప్పలు చేతికి వచ్చేలా స్వయంకృతాపరాధములు చేసుకుంటూ గ్రామానికే ముప్పు తెస్తారు. పాపం, గ్రామస్థులు వీళ్ళ పీడ విరగడ చేసు కోవడానికి పడే తంటాలు రమణీయంగా వెంకటరెడ్డి దొర కథలో వర్ణింప బడినవి.

"మెహదీ బేగం" కథలో ఒకానొక హైద్రాబాదు నవాబుగారింట్లో అల్లారు ముద్దుగా పెరిగిన అమ్మాయి మెహదీబేగం. డాబు, దర్పం, దర్జా, డబ్బు దండిగాఉన్న మహలు నవాబుగారిది. వాళ్ళ అమ్మాయి ఆ ఇంట్లోనే నౌకరీచేస్తున్న ఒక తురక సాయెబును ప్రేమిస్తుంది. అది తెలుసుకున్న నవాబు అతని కూతురు మెహదీబేగమ్‌పై విరుచుకు పడతారు. సదరు తురక ప్రేమికుడిని తమ ఇంటినుండి గెంటివేస్తారు. ప్రేమ ప్రవాహంలో తలమునకలైన బేగమ్ ఊరుకుంటుందా? వెతుక్కుంటూపోయి ప్రియుడి గృహంలో తిష్ఠవేస్తుంది. నవాబుగారి బిడ్డ పరారి కారణం గుర్తించి తురక ప్రేమికుడి ఇంటికి వెళ్ళి తమ కూతురును రప్పించుకొని, ఆవిడను గృహ నిర్బంధంలో ఉంచి, ప్రేమపక్షిని చంపేస్తామని సదరు నవాబు బెదిరిస్తాడు. ఆ సాహెబు తన హిందూ స్నేహితుడి సహాయంతో మారువేషం వేసుకుని హైద్రాబాదునుండి ఉడాయించి కలకత్తా చేరుకుంటాడు. ఇక్కడ మెహదీ

బేగం మహలునుండి తప్పించుకొని పారిపోతుంది. కాని మరో విషవలయంలో చిక్కుకొని శీలాన్ని కోల్పోయి పతితగా మెహందీలో జీవచ్ఛవంలా బ్రతుకుతున్న తరుణంలో ఆమె ప్రేమికుని హైందవమిత్రుడు మెహందీచూచి, ఆమె కరుణగాథవిని పరితపిస్తాడు. తన ప్రియుడి జాడ తెలపమని హిందూ స్నేహితుడిని అర్థిస్తుంది కాని అతనికి కూడ తురక సాహెబు పతా తెలియదు. విధిలేక అలా విషాదాంత జీవితాన్ని తలిదండ్రుల దౌష్ట్యం కారణంగా అన్నీ ఉండికూడ అనాథగా బ్రతుకుతున్న కరుణగాథ మెహదీ బేగమ్‌ది.

ఇక ''హుసేన్‌బీ'' అను కథలో ఒక బ్రాహ్మణ బాల వితంతువు సంఘపు కట్టుబాట్లకు, ఛాందసాచారములకు బలియై ఎలా ఒక తురక యువకుని చేజిక్కి హుసేన్‌బీగా మారిందోనను విషయమే యీ కథయొక్క ఇతివృత్తము. హుసేన్‌బీ ఒకనాడు తలవని తలంపుగా నాంపల్లి స్టేషన్‌లో తన గ్రామస్థుడిని కలుసుకొని తన కరుణగాథ విశదీకరిస్తుంది. బాల వితంతువు తనంతట తానుగా తురక మతాన్ని స్వీకరించలేదు, తానైవరించి తురక సాహెబును పెళ్ళిచేసుకోలేదు. తన తలిదండ్రులు తన బంధువులు, తన కులగురువు గారల దుష్టచేష్టలకు తల ఒగ్గలేక, పైశాచిక ప్రవృత్తికి తట్టుకోలేక, తనను దీనస్థితిలో ఆదుకునువారు కరువైపోవుటవలన, బ్రతుకు దెరువుకు మరో మంచిమార్గం కానరాకపోవడం వలన, ఆ వితంతువు తురక మతంలో పునిస్త్రీయై పిల్లలను కన్నది. అలా చేసినందుకు ఆమె విచారించడం లేదు. తన తురక భర్తతో హాయిగా కాలంగడుపుతూ శేషజీవితాన్ని నిర్విచారంగా గడుపుతున్నది. ఆవిడే ఇప్పటివరకూ హైందవసంఘంలో ఉంటే పుస్తెకట్టుకుని కాపురంచేసి బిడ్డల తల్లిగా అయ్యేదా అని రచయిత ధ్వన్యాత్మకంగా సంఘాన్ని ప్రశ్నించి పాఠకుడి జిజ్ఞాసను పురికొలుపుతాడు.

''ఖిస్మత్'' అను కథలో సానిదానికి సంఘంలో పరోక్షంగా ఉన్న గౌరవాన్నీ, అదే పునిస్త్రీ అయితే ఆవిడకున్న న్యూనతను నర్మగర్భంగా రచయిత పాఠకులకి కథ ద్వారా ఎత్తిచూపుతాడు. వేశ్యగా బ్రతికినన్నాండ్లు గౌహర్‌జాన్ పంచజేరి ఆవిడ అధరాన్ని ఆశించని నవాబులు, రాజులు,

కోటీశ్వరులు లాహోర్ నగరంలో లేరంటే అతిశయోక్తి కాదు. ఆ గోహర్ జాన్ అపురూపంగా పెంచి పోషించి, సకల కళలను తను పెంచుకున్న ఒక పుత్తడిబొమ్మకు నేర్పించినది. ఆ సరసాంగి సకల కళలను ఆపోశనం పట్టిన అపురూపపు బొమ్మ. కాని దురదృష్టవశాత్తు ఆ అమ్మాయికి వేశ్యాబ్రతుకుపై మోజుండదు. తనతో సంగీతం నేర్చుకున్న ఒక యువకుడికి మనసిచ్చి తల్లి వలదని వారించినా వివాహం చేసుకొని అతడితో బొంబాయి లేచిపోతుంది. అలా కొన్నాండ్లు తమవద్దనున్న సొమ్మునమ్ముకొని కాలం గడుపుతారు ఉద్యోగం చేయమని తన ప్రియుడిని బలవంతం చేస్తుంది. సరదాగా కళా రాధన చేసుకుంటూ బ్రతికిన యువకుడికి ఉద్యోగం చేయుఉద్దేశం ఉండదు. సంసార యాతన భరించక ఆ యువకుడు మరో సానిదాని పంచజేరి మెల్లిగా తన ఇల్లాలిని ఆవిడ కప్పగించి తప్పుకుంటాడు. ఆయమ విధిలేక పాత వృత్తిని చేబడుతుంది. వృత్తిలో తన తల్లివలె చాల డబ్బు గడిస్తుంది. సానిదాని వలె కాదు, రక్తిలేని విరాగిని వలె : తాను అలా ఆర్జించిన డబ్బు నంతా అనాథ శరణాలయానికి దానంచేస్తుంది. తనకు తన భర్తవల్ల కలి గిన బిడ్డనుకూడ అనాథ శరణాలయంలో అప్పగిస్తుంది. సానిదైనా, సంసా రులకేగాక సన్యాసులనుకూడ తలదన్నిన వైరాగ్యాన్ని ప్రదర్శించి పాఠకుల హృదయాల్లో బడబానలం సృష్టించిన చక్కని మానసిక పరిణామ ప్రబోధా త్మక కథ గోహర్‌జాన్ జీవిత గాథ.

పదకొండవ కథలో ఒక బ్రాహ్మణ ఇల్లాలు, తురకతుంటరుల చేతుల్లో మోసగింపబడి, శీలాన్ని కోల్పోయి, భర్తచేత బంధువులచేత బహిష్కరింపబడిన హృదయ విదారక ఇతివృత్తం గల కథ. ఆనాటి నిజాం పరిపాలనా హయాంలో హైందవకులీన స్త్రీలు తురక తుంటరుల చేతుల్లో ఎలా పతితలయ్యేడి వారన్న అంశాన్ని యీ కథద్వారా గ్రాహ్యం చేసుకొనవచ్చు. కేవలం మోసానికి గురియై శీలాన్ని కోల్పోయినంతమాత్రం చేత ఆవిడ నిండుబ్రతుకు బజారుపాలు కావలసిందేనా? అలా ఎందరో వనితలు, గృహిణులు, అలనాటి తురకహయాంలో పతితలై ఎందుకు కొర

గానివారై, ఉభయభ్రష్టత్వాన్ని పొందిన అబలల వేదనను రెడ్డిగారు తమ సుతిమెత్తని శైలిద్వారా చిత్రీకరించారు. మతం మారినవాళ్ళు, కులం చెడిన వాళ్ళు, మళ్ళీ కాశికిపోయి తమ మతాన్ని పొందినపుడు ఒక్కమారు, జీవితంలో ఒక్కసారి పతితయైనంత మాత్రాన జీవితాంతం భ్రష్టలై ఎందుకు కొరగాకుండా పోవలసిందేనా అని రచయిత సమాజాన్ని పృచ్ఛ చేస్తాడు, విజ్ఞులను సవాలు చేస్తాడు.

ఈ విధంగా రెడ్డిగారి కథలన్నీ జాతి రత్నాలై భాసించాయి, నీతికే వన్నెతెచ్చాయి. ఎంతటి కరుణ రసాత్మకపు గాథనైనా రెడ్డిగారు హాస్య రసంలో ఇతివృత్తాన్ని ముంచెత్తి పాఠకుల కందించారు. వారి కథాకథనం ఒక రసధునిలా సాగిపోతూ పాఠకుడి హృదయాన్ని గిలిగింతలుపెట్టి, భావ సంచలనం కలిగించి, జిజ్ఞాసను పురికొల్పుతుంది.

## 4. నాటకములు

సురవరం ప్రతాపరెడ్డిగారు రెండు స్వతంత్ర నాటకములను రచించినారు. ఒకటి "ఉచ్ఛల విషాదము" రెండవది "భక్త తుకారామ్." ఉచ్ఛల విషాదమను నాటకముయొక్క కథాంశము. సంస్కృతమున కల్హణునిచే వ్రాయబడిన "రాజ తరంగిణి"యను చారిత్రక గ్రంథముయొక్క భాగము. ఇక రెండవ నాటకము భక్త తుకారాముని జీవిత చరిత్రయే! రెండునూ స్వతంత్ర నాటకములే! అనువాదము, అనుసరణ మచ్చునకైనా లేని అచ్చమగు తెలుగు రూపకములు. రెండు నాటకములును క్రమంగా 1921 మరియు 1924 సంవత్సరాలలో, రెండు మూడు వారములలో పూర్తి చేయబడినవి. ఉచ్ఛల విషాదమును రెడ్డిగారు బి. ఏ. పట్టా పుచ్చుకున్నాక, ఒక నాటక కంపెనీ ప్రకటనపై పోటీపడి వ్రాసిన రూపకము. భక్త తుకారామ నాటకమును రెడ్డిగారు బి. ఎల్. డిగ్రీ సాధించినాక తీరికగా కూర్చుని శ్రీ వి. వి. రాజమన్నారుగారు అప్పట్లో ప్రచురించిన "కళ"యను మాస పత్రికలో మూడంకములుగా వ్రాసి ప్రచురించారు.

రెడ్డిగారి గురువరేణ్యులు శ్రీ వేదం వెంకటరాయ శాస్త్రిగారు. వారు 1910 సంవత్సర ప్రాంతాలలో స్వతంత్ర నాటకాలుగా వ్రాసి ప్రచురించిన "ప్రతాపరుద్రీయము" "ఉష" మరియు "బొబ్బిలి యుద్ధం" ప్రజానీకంలో చాలా ప్రఖ్యాతిగాంచినవి. ముఖ్యంగా ప్రతాపరుద్రీయమను నాటకముయొక్క హాస్య రసము, అందు ప్రధానంగా పేరిగాని పాత్రపోషణ ప్రతాపరెడ్డిగారి మనస్సు నాకట్టుకున్నది. గురువుగారి అడుగుజాడలలోనే పయనించిన రెడ్డి గారు స్వతంత్ర నాటక రచనలైతె చేశారుగాని, హాస్య రస ప్రధానేతి వృత్తాన్ని ఏలనో చేబట్టలేకపోయారు. రెడ్డిగారి నాటకాల్లో ఒకటి వీరరస ప్రధానము, రెండవది భక్తిరస ప్రపూర్ణము. సంస్కృత నాటక రచనాపద్ధతిలోగాని, నాటక లక్షణ సంప్రదాయము ననుసరించిగాని ఏ నాటకము వ్రాయబడలేదు. సన్నివేశ సంఘటన, సంభాషణ కల్పనాచమత్కృతి, రస పాత్రపోషణల విషయమున రెండు నాటకములూ ప్రత్యేక ప్రతిపత్తితో విరాజిల్లినవి.

"ఉచ్ఛల విషాద" నాటకముయొక్క అంతిమ పరిణామము విషాదాంతమే ! రాజతరంగిణిలోని చారిత్రకాంశములను యథామాతృకగా గొని నాటకమున జొప్పింప బడలేదు. రస సన్నివేశ పాత్రపోషణల కనుకూలమగు రీతిలో ఇతివృత్తము నందెడ నెడ మార్పులు గావింపబడినవి. మూలమునగల చారిత్రక గాథననుసరించి కాశ్మీర దేశమును పాలించిన హర్షరాజు మరణించిన అనంతరము ఉచ్ఛలుడు రాజ్యాభిషిక్తు డవుతాడు. అతని తమ్ముడు సుస్సలుడు అన్నగారి ఆజ్ఞానుసారం కాశ్మీరమునకు దక్షిణముగా నుండు లోహర మండలమునకు రాజప్రతినిధియై పాలించుచుండెను. సుస్సలుడు అధికారమును పొందినవెంటనే క్రమ రాజ్యమందలి డామరులను మరియు ప్రబలురగు వ్యవసాయ సిబ్బందిని తొలగించి మడవ రాజ్యమందలి ద్రోహులను శూలారోహణము చేయించి రూపుమాపెను. అతని అనుయాయియగు జనక చంద్రుని కొందరు డామరులు రహస్యముగా చంపివేసిరి.

ఇక ఉచ్ఛలునికి ఇద్దరు భార్యలున్నారు. పెద్దది జయమతి, రెండవది

బిజ్జలదేవి ఉచ్ఛలుడు కాయస్థులగు ఉద్యోగులను శిక్షించెను. లంచ గొండి యగు భూత భిక్షని వికృతవేషుని గావించి ఊరేగించెను. వేశ్యాలోలుడగు మరియొక ఉద్యోగిని వేశ్యలతోకలసి నాట్యమాడునట్లు నిర్బంధించెను. ఒక ధనికుడు ఒకానొక వర్తకునివద్ద దాచుకున్న ధనమును తిరిగి ఇవ్వ నిరాక రించిన, వానిని పిలిపించి, అతి నైపుణ్యముతో కోమటి నిజస్థితిని కనుగొని ధనము ఇప్పించెను. ఉచ్ఛలునిలో కొన్ని లోపములుండెను. అతడు తనక్రింది ఉద్యోగుల లోపములను సహింపకుండెను, ద్వంద్వ యుద్ధములందు ప్రీతి కలిగియుండెను. దుర్మార్గులగు మంత్రులు రాజుగారి భయమువల్ల పారి పోయిరి. ఇట్లుండ నొకనాడు సుస్సలుడు అన్నపై దండెత్తివచ్చెను. రాజు తమ్మునిని ఓడించి వెన్నాడుటకు గర్గచంద్రుడను సైన్యాధికారిని నియో గించెను. కొలది కాలానికి రాజద్రోహులు కుట్రలుపన్నిరి. సడ్డని తల్లితో మయ్యా మట్టుడనువాడు వ్యభిచరించుచుండెను. దానిని సహించని సడ్డడు మయ్యామట్టుని మట్టుపెట్టెను. ఇదివిన్న రాజు సడ్డని కోశాధ్యక్ష పదవి నుండి తొలగించెను, వాని తల్లి ముక్కు చెవులు కోయించెను. సడ్డనికి రాజుపై ద్వేషము ప్రబలుటవలన అతడు హంసరథుని, భోగసేనుని జతజేసికొని రాజును మడియించుటకు కుట్రలు పన్నుచుండిరి.

ఒకనాటి రాత్రి రాజు భోజనానంతరం రెండవభార్య సౌధమున కేగుచుండగా దారికాచి, ఏదో రాజుగారికి విన్నవించుకొను నెపముతో నొక డుండగా తేజుడను వాడు, రాజు జుట్టుపట్టి వంచి పొడచి చంపెను. రాజు సుజనాకరుని, భోగసేనుని సహాయ మర్థించిననూ ఎవ్వరూ రాలేదు. అతని అనంతరం తమ్ముడు రాజ్యాభిషిక్తుడయ్యెను. ఇది రాజతరంగిణి లోని కథాంశము.

రెడ్డిగారు తమ ఉచ్ఛల విషాదనాటకంలో కొన్నిమార్పులు చేశారు. ఉచ్ఛలునికి గల ఇద్దరు భార్యలలో ఒకదానిని తొలగించి, బిజ్జలనే రాజు సతిగా ఉంచినారు. ఇక శ్రుతి కటువుగానున్న కొందరిపేర్లు మార్చి సడ్డ, రడ్డ, చుడ్డలకు మారుగా చూడాసేన, శ్రద్ధాసేన, ప్రయాగలుగా రూపొందిం

చారు. ఉచ్ఛలుడు ధీరోదాత్తుడగు నాయకుడుగాన తన్నాయక లక్షణములకు సరిపడునట్లు ఉచ్ఛలునిలోగల ద్వంద్వయుద్ధా స ద్రోహులను శూలా రోహణచేయు పద్ధతిని కులటలను శూర్పణఖలనుచేయు ఆచారమును తొల గించారు. ఉచ్ఛలుడు గృహము నందుండగనే ద్రోహులు రాజప్రాసాదమున ప్రవేశించి రాజును చంపుతారు. రాజుగారిని హతమార్చిన పద్ధతి షేక్స్పియర్ యొక్క నాటకమగు "జూలియస్ సీజర్" మరణమును పోలియున్నది.

ఇకపోతే సుస్సలుడు తనకుతానుగా అన్నగారిపై దండయాత్ర చేయడు. ద్రోహకూటమి దుర్బోధలకు లోనై అన్నగారిపై యుద్ధాన్ని ప్రకటిస్తాడు. గర్గ చంద్రుడను సైన్యాధికారి సుస్సలుని సైన్యము నోడించి దానిని మట్టుపెట్టెనే కాని సుస్సలుని వెంటాడడు. ఉచ్ఛలునికి తమ్మునిపై కినుక లేదు. దుర్బోధలకులోనై అలా దండెత్తినాడని అతన్ని క్షమిస్తాడు. అన్నగారి దుర్మరణ వార్తవిన్న సుస్సలుడు చాల విచారించి, అన్నగారిని చంపిన వారిని వెంటబడి చంపుతాడు. వదినెగారి ఆదేశానుసారం కాశ్మీర దేశంలో అన్నగారి శత్రుశేషం లేకుండా చేస్తాడు.

నాటక సాహిత్యాన్ని మనం స్థూలంగా మూడు విభాగాలు చేయవచ్చు. 1. శాస్త్రీయ నాటకాలు. 2. రస నాటకాలు. 3. ప్రయోగ నాటకాలు, శాస్త్రీయ నాటకాలు కేవలం శాస్త్రీయ దృక్పథంతో ఇమిడియుంటూ అష్టాదశ వర్ణనలతో, నాందీప్రస్తావనా విష్కంభాది విటనట హాస్య చతుర సంభాషణా పరంపరలతో, జటిలమగు పద్యరాజములతో వర్ధిల్లి, పండిత గ్రామణులచేత భళీ యనిపించు కొనునవి.

రస నాటకాలనబడునవి నాటక రచనాలంకారాది శాస్త్రీయ దృక్ప థంతోగాక, నాటకీయ దృష్టితో పాత్రపోషణ గావించి ఆయాపాత్రల సంభా షణా సరళి రసభరితమై, పఠితల మనోనేత్రము ముందు, ఆ రచన నలంక రించిన పాత్రలు, విశిష్ట వ్యక్తిత్వంతో అలరారి హృదయానికి అలౌకికానం దాన్ని ప్రసాదించునవి రసరూపకాలుగా రాణిస్తాయి. ఇక పోతే, ప్రయోజన నాటకములనునవి దేశకాల పాత్రమున కనువుగా రూపొంది, ఒక సందేశాన్ని

ఒక నీతిని, ఒక రీతిని శ్రోతలకందించి వారి హృదయాలను రసతరంగాల ముంచెత్తుతవి. భాసుడు తన "ప్రతిమా"నాటకములో "కాల సంవాదినా నాటకేన సజ్జా భవత..."అని శ్రీరామ పట్టాభిషేక ఘట్టంలో ఒక ప్రతీహారి పరిచారికచేత ప్రేక్షకులకు తెలియజేస్తాడు. కాలానికి తగిన నాటకం వేయ డానికి సంసిద్ధంగా ఉండమని భాసుడు నాటక కర్తలను పరోక్షంగా హెచ్చ రిస్తాడు. మంచి నాటకాలుగా పరిగణింప బడినవన్నీ ప్రయోజన నాటకాలుగా నిలువజాలవు. సాహిత్యదృష్టితో వ్రాసిన నాటకాలు రసికజన మనోరంజకా లుగా రూపొందుతాయేగాని, కాలాని కనుగుణమగు నాటకాలుగా పరిగణింప బడజాలవు. అవి ఇందుకు అననుకూలము కాబట్టి వాటిని నిరర్థకములని త్రోసివేయడానికి వీలులేదు. వేటి ప్రయోజనము వాటిదే! కాని వర్తమాన కాలానికి ప్రయోజనకారిగా నుండునవి ముఖ్యంగా సాంఘిక నాటకములే యనిన విప్రతిపత్తి యుండదేమో!

కాలానికి తగిన నాటకం అను దృష్టితో తిలకిస్తే ప్రతాపరెడ్డిగారి రెండు నాటకాల్లో ప్రయోజనాత్మకంగా ఉండునది భక్తతుకారామ నాటకమే! ఇందు కేవలం భక్తి తత్త్వమునకే ప్రాధాన్యత నియ్యకుండా, అహింస అస్పృశ్యత, సంఘ దురాచారముల ఖండనకుకూడ సముచిత ప్రాధాన్యత నీయబడి, ఆ యా పాత్రలచేత రసవత్తరంగా పోషింపబడినది.

ఉచ్ఛల విషాదనాటకం వీర రసప్రధాన రూపకంగా వ్రాయబడింది. ఉచ్ఛలరాజు ధీరోదాత్తుడగు నాయకుడు. ఏతన్నాయక లక్షణములన్నీ అతనిలో కలవు. కాశ్మీరదేశంలో గల దుష్టశక్తులకు అతడు నిలువ నీడ లేకుండా చేస్తాడు. లంచగొండి ఉద్యోగులను శిక్షించి, తదితరులకు గుణ పాఠం నేర్పుతాడు. ప్రబలంగాఉన్నట్టి డామరులను అస్త్రసన్యాసం చేయించి, దొంగ వ్యాపారుల మోసాలను అరికట్టించి, వేశ్యాలంపటులను శిక్షించి, పరసతీవ్యామోహులను పసిగట్టి పనిపడుతాడు. ఇన్ని సద్గుణాలు గల రాజును మట్టువెట్టుటకు కుటిలులైన ద్రోహులు కొందరు మంతనాలాడుకొని, దొంగ జాబులువ్రాయించి, దుష్టబుద్ధులను ప్రేరేపించి, రాజులకు విశ్వాస

పాత్రలుగా నుండువారిని చెదరగొట్టి, సుస్సల రాజును పురికొల్పి తమ అభీష్టాన్ని నెరవేర్చుకుంటారు.

తమ్ముడగు సుస్సలుని రాజుపై దండయాత్రకు పురికొల్పుటకుగాను చూడాసేనుని శ్రద్ధాసేనుడు నియోగించి తమ పన్నాగమును సఫలీకృతము చేసుకుంటారు. ఒకవైపు భోగసేనునికి, మరొకవైపు ఉచ్చలరాజుగారికి దొంగజాబులు వ్రాయించి, ఇరువురిలో పరస్పరం అవిశ్వాసము ప్రబలుటకు కారకులవుతారు. ప్రథమాంకంలో శ్రద్ధాసేన చూడాసేనుల కుట్రలకారణంగా సుస్సలుడు మరియు భోగసేనుడు రాజుగారిపైగల విశ్వాసమును వదలు కుంటారు. రెండవ అంకంలో సుస్సలుడు అన్నగారిపై దండయాత్ర చేస్తాడు. కాశ్మీరదేశంలో అశాంతిని రేకెత్తించి, డామరులను రాజుగారిపై ఉసికొల్పి వారిని దండయాత్రకు సమాయత్తంచేయుటలో చూడాసేన శ్రద్ధాసేనులు కృత కృత్యులవుతారు. మూడవ అంకంలో అన్నపై దండయాత్రచేసిన సుస్సలుని రాజు క్షమించి తన రాజ్యము నేలు కొనవలసిందిగా వర్తమానం పంపించి భాతృవాత్సల్యమును రుజువుచేసుకుంటాడు, కాని తానే తన సౌధాంతర్భాగం లోనే ద్రోహులచేతిలో దారుణంగా హింసింపబడుతాడు. ఉచ్చలుని భార్య మహాసాధ్వి, సర్వసద్గుణ సంపన్న. భర్త మరణవార్తను విని తాను కూడ భర్తచితిలో ఆహుతి యగుటకు సంకల్పిస్తుంది. మరదియగు సుస్సలుని కాశ్మీర దేశాధీశునిగా ఆహ్వానించుటకు గర్గచంద్రునికి అనుమతి నిస్తుంది రాజుగారిని హతమార్చినవారిని మట్టుపెట్టి భాతృఋణవిముక్తుడు కావల సిందిగా సుస్సలుని ఆదేశిస్తుంది. సుస్సలుడు కూడ తన చేష్టలకు వగచి వెంటనే సేనాసమేతంగా కాశ్మీరం చేరి, ద్రోహులను చంపి, దేశమును కంటక రహితంచేసి, రాజ్యాభిషిక్తుడవుతాడు. నాటకంలో ఎడనెడ గల పద్యములు చాలవరకు సీసములు, గీతములు, ఉత్పలమాలలే యున్నవి. పాశ్చాత్య నాటక సంవిధానమును సమగ్రంగా నెరిగిన వాడగుటవలన రెడ్డిగారు అందు గల మేలిగుణముల సేకరించి తమ నాటకమున జొప్పించారు. "జూలియన్ సీజర్" వధా సంవిధానము నెట్లు షేక్స్‌పియర్ తమ నాటకంలో ప్రస్తా

వించారో అదే పద్ధతిలో రెడ్డిగారు ఉచ్చలుని మరణఘట్టమును రూపొందిం చారు. ఉచ్చలుడు ధీరోదాత్త నాయకుడు కనుక ఆయన భార్య గాంచిన పీడ కలల విషాద సంఘటనలను సరకుచేయలేదు. అటు జూలియన్ సీజర్ కూడ భార్య విజ్ఞాపన నాలించక తన విధ్యుక్తధర్మనిర్వహణకై సమాయత్తమై ప్రాణముల పొగొట్టుకుంటాడు. 'కానున్నది కాకమానదు' 'రానున్నది రాక మానదు' అన్న నిత్యసత్యాన్ని జీర్ణించుకున్న ఉచ్చలుడు అర్ధరాత్రికూడ ఆర్తజనుల ఆర్తనాదము నాలించుటకు సంకల్పించి, కుటిలమానవుల కుట్ర లను ఊహించక వారి పన్నాగములకు బలియై మరణిస్తాడు.

నాటకంలోని ఇతివృత్త మెంత ఉదాత్తంగా ఉన్నా, రెడ్డిగారి రచనా సంవిధానము, పాత్రపోషణ, సంభాషణా సరళి, రమ్యంగా రసవత్తరంగా సాగలేదు. నాటకేతివృత్తము దేశకాల పాత్రానుగుణ్యము కూడ కాదు కనుక ప్రయోజనకర నాటకముల జాబితాలో చేరదు.

ఇక పోతే "భక్త తుకారామ" నాటకం ఆదిలో మూడంకముల రూప కంగా రూపొందించబడింది కాని అనంతరం జగదీశ నాట్యమండలి, సికింద్రా బాదు వారి విజ్ఞప్తిని పురస్కరించుకొని ఐదు అంకములుగా పెంచి రచించ బడింది. 'భక్త తుకారామ' నాటకమును తెలుగులో మొదట రచించినవారిలో ప్రతాపరెడ్డిగారే అగ్రగణ్యులు. రెడ్డిగారు నాటకశైలిని ఆదిలో గ్రాంథిక భాషలో రూపొందించినా, 1932 సంవత్సరంలో పెంచి వ్రాసినపుడు శిష్ట వ్యావహారికంలోకి సంతరించారు. గ్రాంథికభాషలో నాటకసంభాషణ కృతకము పాత్రసృష్టి ఎబ్బెట్టుగాను, అభినయం కృత్రిమంగా ఉంటుందని రెడ్డిగారి భావము. శిష్ట వ్యావహారిక భాషయే యీనాటి గ్రాంథిక భాషయని రెడ్డిగారి వాదము. సంప్రదాయ పద్ధతిలో నాటకరచన గావించినవారు తమ నాటకాల్లో పద్యాలను పాటలను పుంఖానుపుంఖంగా జొప్పించారు. ఏదో ముక్తసరిగా పాటలుంటె సరిపోతుందని ప్రాచ్య పాశ్చాత్యభావాలను జీర్ణించుకున్న పెద్ద లంటారు. పాటలు, పద్యాలు జాంతానై యని నేటి అతివాస్తవికవాదులు బల్లగుద్ది చెబుతారు. పాటలు, పాటల-గంధుల ప్రసక్తియేలేని నాటకాలను

కూడ కొందరు రచించారు. పాటలు పద్యాలుంటేనే నాటకం రక్తికడుతుందనడం సబబు కాదు. పాటలు పద్యాలు పుష్కలంగా ఉన్న నాటకాలు ఒకనాటి సాంఘిక వాతావరణానికి సరిపడినవి. ఈ నాడట్టి అభిరుచి ప్రేక్షక జనానికి లేదు. నాటకం రక్తికట్టడానికి పాటలు పద్యాలు కొలతబద్దలు కావు.

"కావ్యేషు నాటకం రమ్యమ్" అన్నారు కనుక కావ్యమునకున్న విశిష్ట గుణములతోపాటు, నాటక లక్షణాలనదగు పాత్రపోషణ, సరస సంభాషణ, సన్నివేశకల్పన, కథాసంవిధానము సలక్షణంగా ఉంటేనే నాటకం రమ్యంగా ఉండి రక్తికడుతుంది.

భక్త తుకారామ నాటకంలో అంకములు, రంగముల విభజన నెత్తివేసి రెడ్డిగారు "రత్నావళి" నాటకంలోవలె "ప్రఘట్టక"మను పదమును రంగములకు మారుగా వాడి కొత్తప్రయోగం చేశారు. సంస్కృతభాషలో ప్రఘట్టకమను పదము సముచితంగా ఉంటుందేమో కాని, తెలుగులో ఎబ్బెట్టుగా ధ్వనించకపోదు. ఈ నాటకంలో పదునెనిమిది ప్రఘట్టికలున్నవి, ఇందు పద్యాలు, పాటల అవసరం ఉన్నా రెడ్డిగారు పద్యాలనుమాత్రమే రచించి, పాటలను పాత్రధారుల అభిరుచికి వదలివేశారు. ప్రమథ ప్రఘట్టకంలో భక్త తుకారామునితోపాటు ఇద్దరు వర్తకులు కూడ ప్రేక్షకులకు దర్శనమిస్తారు. వారు ముగ్గురూ వ్యాపారనిమిత్తం గ్రామంనుండి బయలుదేరుతారు. మార్గమధ్యంలో పండరినాథుని భక్తులు కొందరు భజనచేస్తుంటే చూచిన తుకారాముడు వారితోచేరి భజనచేయడం ప్రారంభిస్తాడు. భజనమండలి తరలిపోయినాక, తుకారామునివెంట వ్యాపారనిమిత్తం వచ్చిన శాహుకార్లు తుకారాముని మందలించి, వచ్చిన కార్యమును జ్ఞప్తికి తెచ్చి, దేవునివద్దకు పోయినా లాభంవచ్చే వ్యాపారమునే కోమట్లుచేపట్టాలనీ, బ్రాహ్మణులవలె, సన్యాసులవలె రాత్రింబవళ్ళు "విఠోబా విఠోబా" అంటూ ఉంటె ఫలితం ఉండదనీ, కులానికి తగిన గుణోపదేశం చేస్తారు. హరినామ స్మరణచేతనే పాపాలన్నీ పటాపంచలైతె; నరహత్యలు, దోపడీలు చేసినవారంతా 'రామరామ' అంటే స్వర్గలోకప్రాప్తి కలుగుతుందా అని పృచ్ఛచేసి, వర్తకులకు దుకాణాలే

పండరిక్షేత్రాలనీ, తానే మహాలక్ష్మియనీ, తూకపురాళ్లే పండరిమూర్తులనీ, వాటిని మరచినవాడే నాస్తికుడని హితోపదేశం చేయడంచూస్తే రచయిత కడు రమణీయంగా పాత్రోచిత సంభాషణను గావించి ఆయా పాత్రల సంభాషణలకు జీవంపోసినా రనడంలో అతిశయోక్తిలేదు.

"సరకు లమ్మెడువేళ జంకుగొంకును లేక, కురుచ సేర్లనుబట్టి కొలువ వలయు"అను పద్యంకూడ సన్నివేశకల్పనకు అతికినట్లుగా ఉండి పాత్రౌచిత్యాన్ని ఇనుమడింపజేసింది. వారి సంభాషణను విన్న తుకారాముడు, బందిపోటులకు, బజారువర్తకులకుగల తేడా ఏమిటని పృచ్ఛచేస్తాడు. దానిపై వారు, బందిపోట్లు ప్రత్యక్షదొంగలు, వర్తకులు పరోక్షదొంగలని సమాధాన మిస్తారు. ఇలా తుకారామునితో వర్తకుల సంభాషణ సరసంగా, హాస్యరస భరితంగా సాగుతుంది.

ఇక రెండవ ప్రఘట్టకంలో తుకారాముడు తన కొట్టులో సరకులు విక్రయిస్తాడు. నామ మాత్రమునకే తుకారాముడు వర్తకుడుకాని, మనోవాక్కాయ కర్మలచేత పరిపూర్ణభక్తుడు, పండరినాథుని పాదదాసుడు. అతడెవరిని చూచినా, ఎవరిమాట విన్నా. అందరిలో పండరినాథుని దర్శిస్తాడు. అందరినీ విశ్వసిస్తాడు. తన సర్వస్వం వారికంకితం చేస్తాడు. అన్ని ధర్మాలను పరిత్యజించి, పరమాత్మని చింతనాసక్తుడై నిశ్చింతగా ఉంటూ ప్రేక్షకజనాన్ని ఆకట్టుకుంటాడు. తుదకు దారినపోయే దానయ్యలనుకూడ పరమభక్తాగ్రగణ్యులుగా భావించి, ఇంటికి ఆహ్వానించి, అతిథిసత్కారం చేసి, తాను తన కుటుంబము పస్తులుంటారు. పేదరికంతోను, నిత్యపస్తులతోను వేగలేని తుకారామునిభార్య పరమసాధ్వియైన జీజీబాయి కడుపుమంటతో, పిల్లలను అన్నాతురులుగా చూడలేక తుకారాముడిని కసురుతుంది. ఇలా సంసారయాతనతో వేగలేనంటూ తుకారాముడు ఇల్లువిడిచి వెడలిపోతాడు. పాపం! జీజీబాయి చేయునదిలేక పిల్లలూ, తాను కూలినాలి చేసుకుంటూ పొట్టపోసుకుంటారు.

ద్వితీయ తృతీయ ప్రఘట్టికలో తుకారాముని భక్తినీ, జీజీబాయి మనోవేదనను రచయిత కరుణరసభరితంగా చిత్రిస్తారు. దేశభక్తి ప్రపూరితుడైన రచయిత తన దేశాభిమానమును "అనిశము మాతృదేశ హితమాత్మను గోరెడివాడె భక్తుడని"తుకారామ భక్తునినోట పలికించడం ఉభయ తారకంగా ఉంది. దైవభక్తికి, మాతృదేశభక్తికి అద్వైతతత్త్వము నంటగట్టిన రెడ్డిగారి దృష్టి గాంధీతత్త్వము నాకర్షించిన దనుటలో విప్రతిపత్తి లేదు.

నాల్గవ ప్రఘట్టకంలో మాస్వాజీ బాబాయొక్క కపటభక్తి స్వరూపమును, అతని శిష్యుడగు శంబాజీ జిజ్ఞాసాసంభరితమగు అమాయక ప్రశ్నారూపక భావగాంభీర్యమును, వేశ్యయగు సుందరి సంభాషణా చాతురి పాఠకుల హృదయాల నాకట్టుకుంటుంది.

పూర్వకాలంలో దేవతలు, మహర్షులు, మద్యపానా సక్తులగుటవలన తమ తేజస్సును, ఓజస్సును కాపాడుకోగలిగారట. దాన్ని త్యజించిన నాటి నుండీ అన్ని మహిమలు పోగొట్టుకుని, నిర్వీర్యులైనారని మాస్వాజీ తన శిష్యుడికి బోధించడం, శిష్యుడు అమాయకంగా జిజ్ఞాసాదాయకమగు ప్రశ్నలువేస్తూ గురువును చికాకుపరచడం మొదలగు సంభాషణలు రమణీయార్థకప్రతిపాదకములుగా ఉన్నవి. "యాదవులంతా తప్పతాగి తన్నుకు చచ్చారటగా ?"అని శంబాజీ అమాయకంగా గురువును పృచ్ఛచేసి తికమక పెడతాడు. శిష్యుడివలెనే సుందరికూడ ఎంతో చమత్కారంగా, నర్మగర్భంగా, రమణీయంగా గురువుగారిని ప్రశ్న పరంపరలతో బులివిస్తూనే వేధిస్తుంది. మదిర, నల్లమందు, గంజాయి వేశ్యలపాలిటి కామతంత్ర పరికరములని సుందరి అభివర్ణిస్తూ తప్పతాగించి దేవిపైన గల హారమును గురువు చేత కానుకగా స్వీకరిస్తుంది. స్త్రీలను కాళీ స్వరూపిణులుగాను, పురుషులను ఆదిదేవుడిగాను ప్రస్తుతించి మాస్వాజీ కామకలాపాలను సాగిస్తాడు. మాస్వాజీ సుందరితో భక్త తుకారాముని వలలోవేసుకొని భ్రష్టున్ని చేయవలసిందిగా అభ్యర్థించడం నాల్గవ ప్రఘట్టికకు పతాకస్థాయిని చేకూర్చినది.

ఐదునుండి తొమ్మిది ప్రఘట్టములలో తుకారాముడు ఆలుబిడ్డ లను విడిచి అరణ్యములో సంచరిస్తుండగా అక్కడ కాకతాళీయంగా ఒక జొన్నచేను కాపరి తుకారాముని చేనుకాపుకు నియోగించుటయు, భక్త చింతా మణియగు తుకారాముడు భక్తిపారవశ్యమున ప్రకృతి దృశ్యముల తిలకిస్తూ తన్మయుడైయుండ, అడవిపక్షులు చేనును పాడుచేయుటవలన చేను యజ మాని తుకారాముని గ్రామపెద్దలచేత దోషిగా నిర్ణయించుటయును, యీలోగా తుకారామునిసతి అతన్ని వెతుక్కుంటూ వచ్చి కలిసికొని ఇంటికి రమ్మని బ్రతిమాలి తోడ్కొనిపోవుట కడురమణీయంగా, రసవత్తరంగా వర్ణింప బడినవి. ఆయా సందర్భాలలో ప్రకృతి వర్ణనముచేయు పద్యాలు ఎంతో హృద్యంగా అలరారినవి. రెడ్డిగారి మాటలలో చెప్పాలంటె వారి పద్యాలు ఆముక్తమాల్యదా ముక్తాలుగా కాక భక్తిరసప్రపూర్ణములై విలసిల్లినవి. వారి శైలిలో గాంభీర్యమునకుతోడు మార్దవము, ప్రౌఢిమకు జోడుగా ప్రసన్నత సైదోడై పెంపెనలారినవి.

పదవ ప్రఘట్టికలో మాస్వాజీ మఠంలో గంగాజీపంత్ మరియు శంబాజీలమధ్య జరిగిన సంభాషణ బ్రాహ్మణ శూద్ర పద నిర్వచనానికి అనిర్వచనీయమగు రూపకల్పన చేసినది. జ్ఞానాన్వేషకులకు గుణము ప్రధానం కాని కులంతో నిమిత్తం లేదనీ, నిష్కామకర్మ చేయు వ్యక్తికి జాతి కుల మతాలతో ప్రసక్తిలేదనీ, సత్యనిష్ఠ, అహింసాత్మక కర్మలే పరమ ధర్మములని ఎంతో రమణీయంగా రచయిత నిరూపించారు. మద్యపానం, మాంస భక్షణ, సానుల సరససల్లాపములతో కాలాన్ని కరిగిస్తూ లోకం దృష్టిలో దుమ్ముకొడుతున్న మాస్వాజీ శిష్యరికానికి శాశ్వతంగా తిలోదకా లిచ్చి శంబాజీ, గంగాధరపంత్‌లు భక్త తుకారాముని సన్నిధి నాశ్రయిస్తారు.

పదకొండవ ప్రఘట్టికలో తుకారామునికీ వేశ్యయగు సుందరికీ జరిగిన సంభాషణ నాటకాని కంతటికీ తలమానికమని చెప్పవచ్చును. జాము రాత్రి జారినాక తుకారామునింట ప్రవేశించిన సుందరి, తుకారాముడిని రాగ, విరాగ, సరాగ చర్చలలోకి దింపి మనోనిగ్రహాన్ని, నిష్ఠను, హృదయావేద

నను పరీక్షిస్తుంది. భక్తులు విష్ణువును భజిస్తే రాగరంజిత హృదయులు విష్ణుతనయుడగు కాముడిని సంస్మరిస్తారు. తండ్రికొడుకుల నామస్మరణ జేయు మనలో మనకు భేదముండగూడదని నర్మగర్భంగా పృచ్ఛచేసి సంభాషణా సరళిని సరాగాలకు దింప ప్రయత్నించి విఫలమనోరథ యవుతుంది. ఇహలోకంలో మోక్షతాపత్రయంతో, యజ్ఞయాగాది క్రతువులొనర్చిన యోగులూ భోగులూ, పరలోకానికి చేరి రంభామేనకాదులతో తమ కామ తంత్ర పరిజ్ఞానపాటవమును పరీక్షించుకుంటారు గదా! ఆ పనినే ఈలోకంలో మనసుగలిగిన మగువతో మగవారెందుకు మరులు తీర్చుకొన గూడదని సుందరి తన నెరజాణత్వమును నిరూపిస్తుంది. పైగా వేశ్యాసాంగత్యము చేసిన శుకుడు, మల్హణుడు, తరింపబడలేదా యని వితండవాదము లేవదీస్తుంది. మహామహాతపోమహిన్వితులైన ఋశ్యశృంగుడు, విశ్వామిత్రుడు, విప్రనారాయణుడు, పురూరవుడు మొదలగు వారంతా వేశ్యాపరిష్వంగ సుఖభాగులై యుండికూడ తమ మహిమలను విడనాడినారా యని పృచ్ఛ చేస్తుంది. నీవేమి చెప్పినా, ఎన్ని దృష్టాంతములనిచ్చినా నేను మాత్రం ఏక పత్నీవ్రతుడను, భగవద్భక్తుడను కాబట్టి నన్ను నీ పాండితీ ప్రకర్షతో ఓడించి లోబరుచుకొన జాలవని నిష్కర్షగా తుకారాముడు చెప్పినమీదట సుందరి తనవోటమి నంగీకరించి, పూర్వవాసనలత్రుంచి, శిష్యురాలైపోతుంది తుకారామ సుందరీ సంభాషణలద్వారా రెడ్డిగారు తమ అమోఘ పాండితీ పాటమును మనోజ్ఞంగా అభివ్యక్తంచేసి నాటకాన్ని రక్తి కట్టించారు.

పన్నెండు పదమూడవ ప్రఘట్టకములందు సంత్ తుకారాముని మాస్వాజీ ముళ్ళకర్రతో మోదుట, సన్యాసినివేషంలో తారసిల్లిన సుందరిని మాస్వాజీ సంభాషణలోకి దింపి సరసాలాడి విరసముపాలై చావుదెబ్బలు తినుట మొదలగునవి వర్ణితములు. పదునాల్గవ ప్రఘట్టకంలో జీజీబాయి దేహ బాధతో పరితపిస్తున్న తుకారాముని పరిచర్యచేయుట, తనవలెనే దేహశుద్ధి కావించుకున్న మాస్వాజీ స్థితికి తుకారాముడు మథనపడుతూ, "సమానశీల వ్యసనేషు సఖ్యం"అని అంటాడు. హింసను ప్రతిఘటించి ప్రతిహింస చేయు

వారు రాక్షసులనీ, హింసించువారి దౌష్ట్యములను సహిస్తూ వారిని మనసారా దీవించువాడే దైవసముడని తుకారామునినోట పలికించిన రెడ్డిగారిపై గాంధి గారి అహింసోద్యమ ప్రభావం ఎంతగా పడిందనడానికిది ప్రత్యక్ష తార్కాణము.

పదిహేను పదహారు ప్రఘట్టికలలో తుకారాముడు అస్పృశ్యత యొక్క మూలస్వరూపాన్ని భక్తజనులకు విశదంచేస్తాడు. శాస్త్రిలమాట ఎలా ఉన్నా వేదాల్లోమాత్రం చాతుర్వర్ణ్య ప్రసక్తి యున్నది కాని చండాలజాతి సృష్టి లేదని ఉద్ఘాటిస్తూ, చండాలురలో కూడ కవులు, భక్తులు, రాజులు ఉద్భ వించారనీ, రంతిదేవుని వద్దకు చండాలుడు అతిథిగా వెళితె అతని కన్ని మర్యాదలతో సత్కారముచేసిన ఉదంతాన్నీ, మరెన్నో పురాణ ప్రసిద్ధగాథ లతో చండాలుర ప్రసక్తి తెచ్చి సోపపత్తికంగా అస్పృశ్యతను తుకారాముడు ఖండిస్తాడు. హరిజన నామకరణము మొట్టమొదట అస్పృశ్యులకిడినది భక్త తుకారాముడేనని రెడ్డిగారు అభివ్యక్తం చేసినారు.

ఇలా ఎన్నో శాస్త్ర పురాణేతిహాసములందు గల కథాంశముల నుదాహ రిస్తూ అస్పృశ్యతను రెడ్డిగారు తుకారామునిద్వారా ఖండింపజేశారు. పదునే డవ ప్రఘట్టకములోకూడ అస్పృశ్యతయొక్క అర్థరహిత అస్తిత్వమును గూర్చి, శూద్రులకుగల వేదాధికారమును గూర్చియు సవివరంగా, సశాస్త్రీ యంగా చర్చించి రెడ్డిగారు తమకుగల సంస్కృతభాషా పరిజ్ఞానమును రుజువు చేసుకున్నారు.

పదునెనిమిదవ ప్రఘట్టకంలో పంచాయితీ పెద్దల తీర్మానమునను సరించి భక్తతుకారాముడు తాను రచించిన అభంగాలను ఇంద్రాణినదిలో పారవేయుటకు ప్రయాణమవుతుంటె, గ్రామపెద్దలూ మరియు పటేలు అడ్డు వచ్చి తుకారాముని పాదములబడి ప్రార్థించి సగౌరవంగా తమ గ్రామానికి

భక్త తుకారామ నాటకం ఉత్తమనాటకమని ఘంటాపంథగా చెప్ప వచ్చును. రెడ్డిగా రీనాటకం ద్వారా నాటక కళారంగమున సాధించిన ప్రజ్ఞా

పాటవములు, పాండితీ ప్రకర్షలు అపూర్వములు. ఒక్కదెబ్బతో రెండు పిట్టలను సాధించిన వేటగానివలె రెడ్డిగారు, ఈ నాటకంద్వారా భక్తి తత్త్వాన్నేగాక, సాంఘిక సమస్యలుగా నేటికీ నాగరిక సమాజాన్ని వెన్నాడి పీడిస్తున్న అంటరానితనపు దురాచారములను, సత్యాహింసలకు అడుగడుగునా జరుగు అపచారములను వేలెత్తి చూపిస్తూ, జాతికి చక్కని నీతిని బోధించారు. కథానిర్మాణకౌశలమున, రసపోషణమున, పాత్రచిత్రణమున, ఔచిత్యపాలనమున, భాషాప్రయోగమున, భావప్రకటనమున, ప్రదర్శనానుకూల్య ప్రాపణమున, సన్నివేశ కల్పనమున రెడ్డిగారు చూపిన ప్రజ్ఞాపాటవములు ప్రశంసనీయములు. అందందు అలతియలతి లోపములున్నను ఉండుగాక ! మొత్తముపై భక్తతుకారామ నాటకము ఒక రసఝరి. "ఏకో హి దోషో గుణసన్నిపాతె నిమజ్జతి" అన్న వాక్యము సార్థకమవుతుంది.

## 5. కవిత్వము

ప్రతాపరెడ్డిగారు పరిశోధకుడుగా, విమర్శకుడుగా, చారిత్రకుడుగా, కథకుడుగా, సంపాదకుడుగా, నాటక రచయితగా, ఉత్తమ దేశికుడుగా. ఆంధ్రులకు సుపరిచితమే కాని, కవిశేఖరుడుగా రెడ్డిగారిని ఎరిగినవారు అరుదు అందుకు కారణం, వారి కవితాసంకలనం గాని పద్యకావ్యం గాని పాఠకులెరుగరు. వారు వ్రాసిన రెండు పద్యకావ్యములు అనగా 1. చంపకీ భ్రమర విషాదము. 2. హరిశర్మోపాఖ్యానము రెడ్డిగారు పోగొట్టుకొనడం వలన వాటిని ముద్రితప్రతులలో చూచు భాగ్యము ఆంధ్రులకు కలుగలేదు. కాని రెడ్డిగారు అడపాతడపా వ్రాసి ఆయా పత్రికలలో ప్రచురించిన పద్యములు సుమారు రెండువందలకు పైగా డా॥ బి. రామరాజుగారి వద్దనున్నవి. ఆ పద్యములన్నియు క్రీ॥శ॥ 1918 నుండి 1952 సంవత్సరములమధ్య వ్రాయబడినవి. రెడ్డిగారు వివిధ విషయములపై, ఆయా సందర్భములను పురస్కరించుకొని రచించి వివిధ పత్రికలలో ప్రచురించిన ఖండికలు నలుబది

వరకున్నవి. వారు వ్రాసిన పద్యముయొక్క రచనాకాలము మరియు ప్రచురింపబడిన పత్రికలనామములు ఆయా పద్యములక్రింద లిఖించబడినవి. ఆ పద్యజాలము నంతటినీ కలిపి ముద్రించినచో చక్కని ఖండకావ్య సంపుటి యగును. రెడ్డిగారి పద్యరచనలు పుస్తకరూపమున లేవు కనుక ఆయా శీర్షికలతో విషయ వివరణము చేసి, అనంతరము వారి కవితాశక్తిని పరిశీలిద్దాము.

1. *మిత్ర స్మృతి* :— ఏడు పద్యములు — 1919 రచనాకాలము — రెడ్డిగారి మిత్రులు, కర్నూలు వాస్తవ్యులును అగు శ్రీ వేలాలసుబ్బయ్య మరణించినపుడు వారి స్మృత్యర్థము వ్రాయబడినవి. ఈ పద్యములు 'వివిధదంపతీవిలాసము''అను గ్రంథములో కూడ ముద్రింపబడినవి.

2. *మిత్రుడా* :— ఇదొక గేయము — రచనాకాలము 1920. ఇదే కొద్ది మార్పులతో 'మహోదయము'అను ఆధునిక గీతికా ఖండిక సముచ్చయంలో 'తెలుగునాడు' అను శీర్షికతో ప్రచురింపబడినది.

3. *పద్మిని* :— ఇది రెండువందల పంక్తుల గీతమాలిక. 1921లో రచింపబడినది. ప్రతాపసింహుడు దావూద్‌ఖాను నోడించి, అజీతసింహుని మరల సింహాసనస్థుని జేసి, అతని కుమార్తెయగు పద్మినీదేవిని ప్రతాపసింహుడు వివాహమాడుట ఇందలి ఇతివృత్తము.

4. *ఈశ్వరయ్య* :— నాలుగు పద్యములు. రచన 1923లో. ఆలంపురమున పాలెము ఈశ్వరయ్య యను నొక బ్రాహ్మణ భాగవతోత్తముడు ఆంధ్ర మహాభారతమును చక్కని వ్యాఖ్యానముతో పురాణముచెప్పిన సందర్భమును పురస్కరించుకొని వారి నభినందిస్తూ వ్రాసినపద్యములు.

5. *మహమ్మదు ఘజ్నవి* :— ఇది 135 పంక్తుల గీతమాలిక. 1920 లో రచింపబడింది. మహమ్మద్ ఘజ్నవి, గుజరాతులోగల సోమనాథ దేవాలయమును కొల్లగొట్టి ధ్వంసముచేసి తన దేశము వెళ్ళినాక తన ప్రతాపమునుగూర్చి ఒక కావ్యము వ్రాయవలసిందిగా మహాకవి ఫిర

దౌసితో చెప్పి అతనికి పారితోషకంగా కొంతధనం ఇస్తానని వాగ్దానం చేస్తాడు. అతను తీరా కావ్యం వ్రాసుకొనిరాగా అభయమిచ్చిన డబ్బు ఇవ్వడు ఆ కవి విరక్తుడై వెడలిపోయిన కొంతకాలానికా డబ్బు అతనికి పంపించేలోగా కవి కాస్తా కన్నుమూస్తాడు. అతని కుమార్తె రాజుగారిచ్చిన డబ్బును తిప్పికొడుతుంది. క్లుప్తంగా ఇది యీ గీత మాలికలోని ఇతివృత్తము. జాషువాగారి ''ఫిరదౌసి''కావ్యపు ఇతి వృత్తముకూడ ఇదియే ; కాని జాషువాగారా కావ్యాన్ని 1932 సం॥లో రచించారు. రెడ్డిగారి యీ గీతమాలిక రెడ్డిరాణి''యను పత్రికలో 1920లో ప్రచురింపబడింది.

6. స్వాగతము :— ఐదు పద్యములు. రచన 1921 లో. కర్నూలులో జరిగిన సప్తమ రెడ్డి జనసంఘ మహాసభలో చదువబడిన పద్యములు.

7. మద్యపానము :— ఐదు పద్యములు. 1922 రచనా కాలము. మద్యము సేవించుటవలన కలుగు ధన మాన ప్రాణ నష్టములిందు ఉట్టంకించ బడినవి. ఈ పద్యములు రెడ్డిగారు రచించిన "మద్యపానము" అను చిన్న వచనగ్రంథమునుండి ఉల్లేఖించబడినవి. ఇందు ;

గీ॥ ధనమా వ్యయమై పోవును
మనమా చురుకు దనము మానును, యశమా
దినదినము క్షీణించును
తనువా చెడిపోవు కల్లు త్రావుట చేతన్.

అను పద్యము శ్రీ తిరుపతి వేంకటకవులు రచించిన 'శ్రవణానందము' లోని ''ధనమా పోవును, మానమా చెడును, నిందా నెత్తిపైకెక్కును,

మనమా వద్దిక నాదుమాట వినుమా, మర్యాద గాపాడుమా''— అన్న పద్యరాజమును పోలియున్నది.

8. ప్రబోధము :— ఎనిమిది పద్యములు. 1922లో రచన. దత్తమండల పట్టభద్రుల వార్షికోత్సవ శుభసమయాన చదువబడిన పద్యములు.

9. *రతన్ దేవి* :— ఎనిమిది పద్యాలు. 1923 లో రచన. జలియన్‌వాలా బాగ్ హత్యాకాండలో అసువులను బాసిన వేనవేల భారతీయులలో ఒకానొక వీరుని ధర్మపత్ని రతన్‌దేవి. భర్త మరణానంతరం ఆమె దురవస్థను వర్ణిస్తూ వ్రాయబడిన పద్యాలు. ''మాతృభూమి'' లో ప్రకటితములు.

10. *ధర్మపద* :— ఐదు పద్యాలు. 1926 లో రచన. పాలీభాషలో రచింపబడిన గౌతమబుద్ధుని బోధలనుండి అనువదింపబడిన పద్యములు. గోలకొండ పత్రికలో ప్రచురింపబడినవి.

11. *నీతి పంచకము* :— పది పద్యాలు. 1927లో రచన. ''సుజాత"యను మాస పత్రికలో ప్రచురితములు. వేమన పద్యముల ఫక్కీలో వ్రాయబడియున్నవి.

12 *ప్రణయినీ ప్రార్థనము* :— నాలుగు పద్యాలు. 1929 లో "సుజాత'' పత్రికలో ప్రచురితములు. భావకవిత్వధోరణిలో సాగినవీ పద్యరాజములు.

13. "*అస్పృశ్యత*" మరియు ''*ఎంత భారత్వమో*" శీర్షికలతో శీర్షిక కొక సీసపద్యమువ్రాసి గోలకొండలో ప్రచురించారు. రచనాకాలము 1927 - 1929.

14. *మహబూబ్ నగర భాష* :- ఒక సీసపద్యము. 1929 లో గోలకొండలో ప్రకటితము. మహబూబ్‌నగర వాడుక భాషకు సంకేతంగా రచింపబడింది.

15. *వేదం వేంకటరాయశాస్త్రి* :— ఒక సీసపద్యము. 1929 లో 'సుజాత' ప్రచురితము. ఇది గురుస్తుతి. కేతన తన ''దశకుమార చరిత్రము''లో తిక్కన కవీంద్రుని ప్రస్తుతిస్తూ వ్రాసిన' 'సుకవీంద్ర బృంద రక్షకుడెవ్వడనిన వీడను నాలుకకు తొడవైనవాడు...''అను పద్యము ననుసరించి రెడ్డిగారు ''సర్వ పండిత బృంద సాహాయ్యకుండెవ్వడనిన వీడని చూప నలరినాడు...''వ్రాశారు.

16. *పరుసవేది* :— నాలుగు పద్యాలు. పంక్తులు పండ్రెండు ఉన్నవి. 1929 "సుజాత"లో ప్రకటితము. ఒకానొక వేశ్యకు శ్రీ వివేకానందుడు దర్శనమిచ్చుటకు నిరాకరించిన సంఘటనను పురస్కరించుకొని చేసుకున్న విన్నపంబులు.

17. *వెట్టివాని పాట* :— ఇదొక దండకము. 1931 సం॥లో గోలకొండలో ప్రకటింపబడినది. ఒక వెట్టి చాకిరివాడు తనకు అధికారులవల్ల, దొరల వల్ల కలుగుకష్టాలను, ఇబ్బందులను ఎకరువు పెట్టుకొనుట ఇందలి ఇతివృత్తము.

18. *లుబ్ధాగ్రేసర చక్రవర్తి* :— నాలుగు పద్యాలు. 1931 లో గోలకొండ లో ప్రకటితము. ఒక లుబ్ధుడు తాను కడుపుకట్టుకొని పైసనెట్లు సేక రించినదీ, దాని సంపాదనకు తా నెన్నిపాట్లు పడినదీ ఇందు చక్కగా వరింపబడింది.

19. *పౌరాణికేంద్రజాలము* :— రెండు పద్యాలు. 1931 లో గోలకొండలో ప్రచురితము. పురాణ కథలందు గల అద్భుతవిషయములు, ఇంద్ర జాల మహేంద్రజాలముయొక్క చమత్కారములను మించి యున్న వన్న అభిప్రాయమును సంగుప్తంచేసిన పద్యాలివి. వీనియందు కొంత వరకు శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరిగారు వ్రాసిన "సూత పురా ణము"యొక్క బాణి ద్యోతకమవుతుంది.

20. *ధర్మాసనము* :— 210 పంక్తులుగల గీతమాలిక. 1931 లో గోల కొండ పత్రికలో ప్రచురింపబడినవి. యమధర్మరాజుగారి వద్దకు ఒక సోమయాజి, ఒక అర్చకుడు, ఒక కోమటి, ఒక రెడ్డి, కరణము, వైద్యుడు, వేశ్య, ఆది హిందువు వెళ్ళి తమతమ జీవిత కాలములలో తమ జీవితానుభవములను, ఘనకార్యములను, అనుభవించిన ఇడుము లను చెప్పుకొని తీర్పు చెప్పుమని యమరాజు నర్థిస్తారు. యముడు యథోచితంగా అందరి గోడులను వినితీర్పునిచ్చుట ఇందలి కథాంశము

21 *ప్రేమార్పణము* :— ఇది అరువై పంక్తుల గీతమాలిక. గోలకొండ పత్రికలో 1931 సం॥ ప్రచురింపబడింది. తురక బాదుషా కూతురు ఒక గొల్లవాడిని ప్రేమిస్తుంది. ఆ కారణంచేత తురక సుల్తాను గొల్ల వాడిని చంపిస్తాడు. కాని వాడి కుమార్తె ఆ యాదవుని ప్రేమపాశము లను తెంపుకోజాలదు. అందుచేత గొల్లవాడి అంతిమ సందేశానుసారం రాజప్రాసాదమును, సర్వ సౌఖ్యములను వదలి తనప్రియుడి గొర్రెలను కాస్తుంది. అలా ఆవిడ శేషజీవితాన్ని గడుపుతుంది. రాకుమార్తె మరణానంతరం, ఇరువురు దంపతులు గొల్లవారికి ఆరాధ్యదేవతలై పూజలందుకుంటారు.

22 *గార్దభేశ్వర స్తోత్రము* :— రెండు పద్యములు. 1931 లో గోల కొండలో ప్రచురితము. ఇది గార్ధభముయొక్క పూర్వౌన్నత్యమును గూర్చిన ప్రశంస. వేదాల్లోను, మనుస్మృతిలోను ఉట్టంకించబడిన గాడిద ప్రశస్తిని గురించిన ప్రస్తావన ఉంది.

23. *హంవీర సంభవము* :— 26 పద్యములు. గోలకొండపత్రిక, స్రవంతి మరియు తదితర పత్రికలలో ప్రచురింవబడినవి. దీని రచనాకాలము 1934 సంవత్సరము. చిత్తూరు క్షత్రియ రాజొకడు వేటకై బయలు దేరి ఒక అడవిపంది వెంటబడతాడు. అది తప్పించుకొనివచ్చి ఒక చేనిలో దాగుతుంది. చేను కాపరియగు ఒక కాపువనిత ఆ సూకర మునుచంపి రాజుముందు వేస్తుంది. రాజు ఆవిడ శౌర్య ధైర్యపటిమకే కాక అందచందాలకుకూడ ముగ్ధుడై ఆ ముదితను ప్రేమించి దాని తలిదండ్రుల సమ్మతితో వివాహం చేసుకుంటాడు. ఆ దంపతులకు హంవీరుడను పుత్రుడుకూడ కలుగుతాడు.

24. *బాలశిక్ష* :— ఆరు పద్యములు. 1934లో ప్రకటితము 150 సంవత్స రాలక్రితం బాలబాలికల సార్వత్రికాభ్యున్నతికై వ్రాయబడిన యీ బాలశిక్షలో చక్కని నీతులుండుటవలన రెడ్డిగారు దానివల్ల ప్రభా వితుడై పై పద్యములను ప్రశంసాత్మకంగా వ్రాసినారు.

25. *తింత్రిణీ* :— మూడు పద్యములు. 1934 సం॥ గోలకొండలో ప్రచురితము. ఉస్మానియా విశ్వకళా పరిషత్తు అధ్యాపకులొకరు, "దక్షను దేశీయులు చింతపండువాడకం వలన పురుషులు నపుంసకులుగాను, స్త్రీలు మదవతులుగాను మారుతున్నారను ప్రవాదమును లేవదీయుట వలన రెడ్డిగారు దిగ్భ్రాంత చిత్తులై పైన ఉట్టంకించబడిన పద్యములను వ్రాసి ప్రచురించారు. వారి పద్యములలో "హా తెలిసెన్ త్వదీయ గుణమంతయు..." అను పద్యముపోలిక మరియు నడక తెన్నాలి రామకృష్ణ కవిపర్యుడు చెప్పిన, "హా తెలిసెన్ భువనైక మోహనోద్ధత సుకుమార వార వనితా జనితా ఘనతాపహారి..."అను పద్యము ననుకరించినది.

26. *పేడి* :— రెండు పద్యములు. 1934లో గోలకొండలో ప్రచురితము. మీసములను నున్నగా నీటుగా గొరిగించుకొని టీకుటాకుగా వీధుల వెంట తిరుగు విలాసపురుషుడిని గూర్చి వ్రాసినవి.

27 *భావకవి నైతినోయ్* :— ఇదొక గేయము. 1935 లో గోలకొండలో ప్రచురితము. భావకవులను, వారి కవిత్వ పోకడలను నర్మగర్భంగా అవహేళనచేస్తూ వ్రాయబడిన గేయము.

28. *గ్రామ్యం బొబ్బిలి* :— 1935 సం॥లో గోలకొండలో ప్రచురితము. ఇది తందాన సరళిలో వ్రాయబడిన పాట. వ్యాకరణ ఛందోనియమాలను నిరసిస్తూ ఒక వ్యావహారిక భాషావాది వ్రాసిన వ్యాసమునకు జవాబు. వ్యంగ్య హాస్యగర్భితము.

29. *హస్తమా* :— మూడు పద్యములు. 1936 లో గోలకొండలో ప్రచురితము. పెరూరు అను గ్రామంలో రెడ్డిగారు ప్రమాదవశాత్తు కాలు జారిపడితె చేతిఎముక విరిగిపోయిందట. ఈ సంగతివిన్న చమత్కారికుడొకడు రెడ్డిగారు తప్పతాగి సోలిపడితె చేయి విరిగిందని ప్రచారం చేశాడుట. ఆ గాలివార్తవిన్న రెడ్డిగారు ఎడమచేతితో పై పద్యాలు సమాధానాత్మకంగా వ్రాసినారు.

30. *సూతాఖ్యాయిక* :— ఎనిమిది పద్యములు. ఈ శీర్షికపైన వ్రాసి ఫిబ్రవరి 27, 1944 నాడు "తెలంగాణ పత్రిక"లో ప్రకటించారు. ఈ పద్యముల అధోజ్ఞాపికలో "కవిగారి అముద్రిక సూతాఖ్యాయిక గ్రంథభాగము" అని యున్నందున, "సూతాఖ్యాయిక"అనునదొక పుస్తకము వ్రాయబడియున్నట్లు ద్యోతకమగుచున్నది. కాని అది లభ్యముకాలేదు. అందలి మొదటి పద్యమిలా ఉన్నది ;—

"సారోదార విచార సాగర నిమజ్జత్స్ఫార విజ్ఞాని బృం
దారాధ్యంబగు నైమిశాటవిని ఋష్యాదుల్ దగన్ సూతునిన్
గారాబంబున గాంచి యిట్లనిరి ; నీ గాథల్ తమిన్ వింటి మిం
కేరీతిన్ భరతావనిన్ జరుగు విన్పింపన్‌గదే యియ్యెడన్."

ఆ పైన సూతుడు భారతదేశమున నిన్నమొన్నటిదనుక జరిగిన రాజకీయ, సాంఘిక, నైతిక పరిస్థితులను పేర్కొని, ఇకముందు భారతావని ఇట్లుండునని జోస్యము చెప్పను. బహుశా వీరిపై త్రిపురనేని రామస్వామిగారి "సూతపురాణ" ప్రభావము పడిన దేమోనని అనుమానము.

31. *అస్తి నాస్తి విచికిత్స* :— ఐదు పద్యములు. 1948లో గోలకొండలో ప్రకటితములు. ఇవి దేవుని అస్తిత్వమునకు సంబంధించి అనుమానాస్పదముగా, చమత్కార గర్భితముగా వ్రాయబడినవి.

32. *గద్వాల సంస్థాన భాషాపోషణము* :— నాలుగు పద్యములు. 1943లో రచించి, గద్వాల సంస్థానాధీశ్వరియగు ఆదిలక్ష్మి దేవమ్మగారి సమక్షంలో చదువబడిన పద్యరత్న చతుష్టయము.

33. *మా తెనుగు* :— తెలుగు భాషామతల్లిని ప్రశంసిస్తూ వ్రాయబడిన ఒక సీసపద్యము. రచనాకాలము 1948 సంవత్సరము.

34. *తుంగామాత* :— మూడు పద్యములు. విద్యుల్లేఖ యను మాసపత్రికలో 1944 సం॥ ప్రకటించారు. తుంగభద్రామతల్లిని శ్లాఘిస్తూ వ్రాయబడిన పద్యత్రయము.

౩౫. వసంతము :— ఐదు పద్యములు. 1952 సం॥లో ''ప్రజావాణి''యను ద్విదిన పత్రికలో ప్రకటితములు. వసంత ఋతుశోభను ప్రసింశస్తూ వ్రాయబడిన పంచరత్నములు.

ఇవి స్థూలంగా రెడ్డిగారి కవితాశక్తికి మచ్చుతునకలుగా పేర్కొనదగి యున్నవి. పద్యాలు వ్రాసినంతమాత్రాన కవులు కారు. కవులు అయినంత మాత్రమున పద్యములు వ్రాసి ప్రకటించవలసిన అవశ్యకర్తవ్యమును లేదు. ఏ నియమ నిబంధనలను పాటించక విశృంఖలత్వమునే ధ్యేయముగా స్వీకరించిన యీ రోజులలో కవిత్వమంటె ఇది, కవి యనగా వీడు అని గీటు గీసి చూపుట విజ్ఞుల దృష్టిలో హాస్యాస్పద విషయంగా పరిగణింప బడుచున్నది. కవి ఋషిలాంటి వాడనీ, కవి స్రష్ట యనీ, కవికి అవధులుండరాదని ఏ మహానుభావుడు ఎట్టి సదుద్దేశముతో అన్నాడో గాని యీనాడు వాటికి వక్ర భాష్యాలు చెప్పడమే కాక తాము వ్రాసిందంతా కవిత్వమేనని బల్లగుద్ది చెప్పడం కూడ జరుగుతున్న యీనాడు కవిత్వాన్నిగూర్చి కవిత్వతత్వాన్ని గూర్చి వ్రాయడంకంటె పదికాలాలపాటు ప్రజలు ఆదరించినదే కవిత్వమనుట సబబుగా ఉంటుందేమో ! స్థూలంగా విచారిస్తే కవితకు ఛందస్సు శరీరము; ప్రజ్ఞా జన్యమగు భావుకత ఆత్మలాంటిది. అందు ఊహాకల్పనము, కథాకథనము, వస్తు వర్ణనము, ఉక్తి చమత్కారము అనునవి ప్రధాన అంగములు. అట్టి భావుకతకు ఔచిత్యమనునది ఆత్మలాంటిది.

రెడ్డిగారు ఛందోబద్ధమగు పద్ధతిని విడనాడలేదు. వారు వ్రాసిన కవితలలో కొన్ని కథలు, కొన్ని చమత్కారములు, కొన్ని వ్యంగ్యములు, కొన్ని స్మృతులు, మరికొన్ని ప్రశంసలు, అధిక్షేపములు మొదలగునవి కలవు. వీటిలో పెద్దరచనలు ప్రేమార్పణము, పద్మిని, ధర్మాసనము, హంవీర సంభవము మొదలైనవి ముఖ్యములు. ప్రేమార్పణమందలి కవితా వస్తువు ప్రేమతత్వము. కులమునకు, ప్రేమకు సంబంధము ఉండదను తత్త్వ రహస్యమును ప్రవచించు ఊహతో అది కల్పింపబడినది. తానెంత చెప్పిననూ కూతురు విననందువలన పాదుషాగారు ఆమె ప్రియుడిని చంపిం

చెను. మరణానికి ముందు ఆమె ప్రియుడు రాకుమార్తెకొక లేఖ వ్రాసినాడు. అందులో ...

ఆత్మబంధులు లేరు నా కవనిలోన
గొర్ల మందయె నాయాస్తి కొనుము దాని
దాని రక్షించు భారమంతయును నీదె
అంత్య విజ్ఞాపనంబిదె యవధరింపు.

నా కీ భూమిపై బంధువులు లేరు. నీవో సౌధాగ్రమున నున్నావు. నేను మరణించిన వెనుక నీవు నా సౌధమున నిలువలేవు. నేలపైకి దిగివత్తువు నే నుండను కాని, నా యాస్తి సర్వస్వమైన నా గొర్లమంద యుండును. నేను లేని కొరతను నీవు తీర్చుదానవు దానిని నీదానిగా జేసికొనుము. నీ తండ్రి మరణదండమునుండి నన్ను కాపాడుమని యర్థించుటలేదు, రక్షింప లేవు కూడాను కనుక నీకు చేతనైనది, చేయగలది గొర్లను కాపాడుటయే! రెడ్డి గారంతటి భావమును ఆ పద్యములో నిముడ్చినారు. రెడ్డిగారు ప్రజ్ఞావంతులు. ఆ పద్యమున మరొక అన్యార్థ స్ఫురణ మిమిడియున్నది. గొల్లవాడు తనకై ఏమియు నాకాంక్షించలేదు. కేవలము జీవ కారుణ్యదృష్టితో గొర్లను సంర క్షించుమని అర్థించెను. ముఖ్యార్థము బాధింపని ప్రయోజనము వలన కలిగిన అన్యార్థమిది. రెడ్డిగారీ కథాఖండికలో మరొక చమత్కారము చేసినారు. ఇందెవరికి పేర్లు పెట్టలేదు. పేర్లులేని పాత్రలు సంస్కృతమున అగస్త్యభ్రాత, యక్షుడు, అతనిభార్య కలరు. మరి తెలుగు సాహిత్యంలో నిగమశర్మ అక్క మాత్రమే కనబడుచున్నది.

తమ కవధి యున్నంతలో రెడ్డిగారు కథను నాటకీయ ఫక్కీలో నడిపించారు. 'పద్మిని'యను కథాఖండికలో ప్రతాపసింహ అజీత సింహుల సంభాషణమిందు కొక నిదర్శనము. "నేటి చిత్రంబు వింటిరే నెలత యొకతె" అని ప్రతాపుడు ప్రారంభించి చెప్పిన దానికి, "ఓయీ! నా కూర్మి పుత్రి యా యువిద సుమ్ము" అని అజీతుని ప్రత్యుత్తరము. పాత్రల నున్మీలనము చేయుటయందు రెడ్డిగారీ ఖండికలో నొక కొత్తమార్గ మవలంబించినారు.

పాత్ర వర్ణనకంటె పాత్ర చిత్రణ గొప్పది. పాత్రముయొక్క వంశౌన్నత్యమును వర్ణించి పాత్ర విషయమును సహృదయులగు పాఠకులకు విడిచి పెట్టినారు. ఉదాహరణకు ;—

మునలమానులు రాజులై యెసగినపుడు
హైందవులు భిన్నులై భంగ మందినపుడు
ఐకమత్యము నాశనం బైనయపుడు
కులము లన్యోన్య వైరంబు కూర్చినపుడు
భరత ఖండంబు చెడి పాడు పడినయపుడు
రాజపుత్రుల స్థానము రాజ్యపదవి
వీడ కుండగ గాంచెను వీరవరుల
రాజ పుత్రులు శూరులు తేజమందు
రాజ పుత్రులు శూరులు రణమునందు.

అని ప్రవచించి ;—

ఇట్టి రాఠోరు వంశమందెసక మెసక
బల పరాక్రమ యుక్తిచేఁ బరగె నొకడు
అల ప్రతాపసింహుడనగ యశము నొందె.

అని ప్రతాపసింహుని బలమును, ధైర్యమును, ఐకమత్య స్వభావమును, ధార్మిక గుణమును, ఆత్మగౌరవమును. రణశౌర్యమును ఏకోన్ముఖమైన వాడని అర్థము ధ్వనించునట్లు రెడ్డిగారు చిత్రించారు.

ఇకపోతె ధర్మాసనమను ఖండిక ద్వారా సంఘమునగల కొన్ని ఆచారములను, విశ్వాసములను కించిదవహేళన రూపమున చిత్రించినారు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు తమ నిత్య నైమిత్తిక కర్మలలో సత్కర్మలను దుష్టకార్యములను చేసినారు. కాని వారు తమయొక్క ఘన కార్యములనే ధర్మరాజుకు నివేదించుకున్నారు. చిత్రగుప్తుడు మాత్రము వాళ్లు చేసిన చెడ్డపనులనే యమునికి తెలియజెప్పినాడు. కాని యముడు మంచి

చెడుగులతో నిమిత్తములేకుండ తమ తీర్పులను వినిపించాడు. వారిలో ఒక ఆదిహిందువు కూడ కలడు. యముడు వానిపై తీర్పునిస్తూ "గుణము లెల్ల చెడు వీని కులముచేత"నని చెప్పి నరకంలో త్రోయించాడు. అదే విప్రుని విషయంలో మాత్రము "ధరణి సుతులేమి చేసిన తప్పు లేదని" స్వర్గాని కంపినాడు. ఆదిహిందువు ఏ తప్పూ చేయలేదని చిత్రగుప్తుడు వకాల్తా చెప్పినా వానికి మాత్రము నరకము తప్పింది కాదు.

రెడ్డిగారు ఇలా వ్రాయడానికి కారణం యీనాటి సమాజంలో విప్రులకు అస్పృశ్యులకు ఉన్న తేడాను విశదీకరించడానికే! రచయిత ఎంతటి అంటని హరిదాసుగా సమాజంలో ప్రవర్తించినా సమాజం మాత్రం దాని ముద్ర అందరిపై వేసి తీరుతుందనేది సుస్పష్టము. ప్రతిభావంతుడైన కవి పాతపాటే పాడకుండా అందు కొంత క్రొత్తదనమును సృష్టించి నూతనత్వ మును భాసింపజేస్తాడు.

పద్మిని యను ఖండికలో ప్రతాపసింహుడు పద్మినిని చూచినాడు. ఆమె దట్టమగు నొక పొదరింటి కోనలో నుండగా చూచాడు. ఆ స్థితిని వర్ణిస్తూ రెడ్డిగారు ;—

జలదముల వెల్గు జాబిల్లి చందమొప్పి
మోము గుండ్రన, చెక్కులు ముకురయుగము
నయనములు పెద్ద నడుము సన్ననిది మిగుల
మెఱపువలె మాయమయ్యెను గళితయపుడు"

ఇందు గల ఉక్తి చమత్కారమటుంచి, రూప చిత్రమున రెడ్డిగారు చూపిన ప్రతిభ నిరుపమానము. ఆమె మొదట జలధరమున వెల్గు జాబిల్లివలె స్ఫురించినదట. జలమును ధరించిన మేఘము కారుచీకటివలె నుండును. అందుండి తళుక్కున వికసించు చంద్రుడి అందము ఎట్లుండునో ఊహించిన చాలును. జలదమునకు వెలుగునిచ్చిన జాబిల్లివలె, పద్మిని ఆ పొదరింటిని ప్రకాశవంతము చేసినదని తాత్పర్యము. మెరుపువలె కనిపించిన ఆయమ

ముఖమును పరికించి చూడగా గుండ్రని ముఖము, ముకురాలవంటి చెక్కిళ్ళు, ఆకర్ణాంతములైన కళ్ళు కనిపించాయట. నడుముకూడ సన్నగా కనిపించినది, అంతలోనే కనిపించలేదు ; అనగా మాయమైనది. మాయమైనది నడుము మాత్రమే కాదు, మృగమధ్యమ కూడ ! ప్రాచీనములగు ఉపమాలంకారములనే ప్రయోగించి రెడ్డిగారు కొత్త అందాన్ని సృష్టించారు. ప్రతిభా వ్యుత్పత్తులుగల కవుల కవితాలక్షణ మదియే !

రెడ్డిగారు వ్రాసిన లఘుఖండికలు చాల ఉన్నవి. అందు ప్రధానముగా నీతిబోధనములు, దేశాభిమానోద్దీపికోద్బోధకములు కూడ కలవు. నీతిబోధకమున రెడ్డిగారు వేమనను జ్ఞప్తికి తెస్తారు.

ఉదాహరణకు :—

"మలయజము నీడ సర్పంబు మసలినట్లు
గర్వ మొప్పను పండిత గ్రామణులకు
సర్వభూషణ మందుండు వజ్రమటుల
వినయ మొప్పను విద్యా వివేకులకును,"

దేశాభిమానమును రేకెత్తించు ఖండికలలో ప్రబోధము, స్వాగతము, మా తెనుగు ఇత్యాదులు కలవు. 1922 సం॥లో వ్రాసిన ఆంధ్రదేశమును గూర్చిన ప్రబోధగేయం చూడండి :

సీ॥ ఒకనాడు పూర్వా పరోదధి వేళల
వ్యాపించి మించెను వన్నెచెలగ
ఒకనాడు వింధ్యాచలోత్తుంగ శిఖరంబు
పైనుండి యంతట పాఱజూచె
ఒకనాడు పటు భీకరోద్దామ శక్తిమై
భామినీ పతుల సలాము లందె
ఒకనాడు కాకతి ప్రకటిత బలముచే
సంగ్రామ విజయ ధ్వజంబు నెత్తె

గీ॥ అట్టి సాహసంబులు చేసె ఆంధ్రమాత
తన కుమారులు శూరులై తనరు కతన
మరల యుద్ధరింపుడు మన మాతృభూమి
నఖిల విద్యాజనిత సద్గుణాఢ్యులార !

అదే విధమున తెలుగుభాషా సాహిత్యముల నవలోడనము చేసికొని సముచితరీతి నుద్ధరించుకొండని ఆంధ్రులకు ప్రబోధించిన వైతాళికుడు శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు. ''మా తెనుగు తల్లి''అను శీర్షికపైన ; —

సీ॥ పరిపూర్ణ పావనాంభస్తరంగోద్వేగ
గౌతమీ గంభీర గమనమునకు
ఆలంపురీ నందనారామ విభ్రాజి
మల్గోబ ఫలరాజి మధుర రుచికి
ఆంధ్రీకుమారీ సమాయుక్త పరిపూత
తుంగా పయస్సు మాధుర్యమునకు
ఖండ శర్కర జాతి ఖర్జూర గో క్షీర
ద్రాక్షాదియుత రామ రసమునకును

గీ॥ అమృత నిష్యంది వల్లకీ ప్రహ్లాదమునకు
రాగిణీ దివ్య సమ్మోహ రాగమునకు
తేనెతేటల నవకంపు సోనలకును.

అని ఎలుగెత్తి మా తెలుగు తల్లిలో భాషామతల్లిని కీర్తించారు. ఇటువంటిదే ''మిత్రుడా''అను గేయము కూడను.

ఇవిగాక లఘుకృతులలో ''భావకవి నైతినోయ్''వంటి అధిక్షేపములు, ''గ్రామ్యం బెబ్బులి'' వంటి అవహేళనలు, ''హస్తమా'' వంటి ప్రాసంగికములు, ''మిత్ర స్మృతి''వంటి స్మృతి పద్యములు చాల ఉన్నవి. వాటిని విపులంగా చర్చించుటకిందు అవకాశములేదు. పరమేశ్వరుడనుగ్రహించి, పెద్దలు కరుణిస్తే రెడ్డిగారి పద్య కృతులన్నీ గ్రంథరూపమున వెలువడిననాడు, సహృదయులుచదివి ఆనందించుటకు అవకాశంకలుగుతుంది.

ప్రతాపరెడ్డిగారి ఛందోమార్గమును గూర్చి నాలుగుమాటలు వ్రాయ వలసియున్నది. ఆయన చాలవరకు గీతములనే వాడెను. అనంతరం సీస పద్యముల వాడకం ఎక్కువ ఉంది. పద్యములో నాలుగుపాదముల గమనం ఉంటుంది.

రెడ్డిగారు రెండు పాదముల గీతములను ''పరుసవేది''అను ఖండికలో వ్రాశారు. ''వెట్టివాని పాట''యను దండకమున ఒక విశేషం ఉంది. దండక రచన నానావిధాలుగా ఉంది. అప్పకవి మరియు వృత్తరత్నాకర కారుడు కొన్ని దండకభేదములను పేర్కొన్నారు. న, స, హ, త యను గణము లలో దేనినైనను పేర్కొని దండకాలను వ్రాయవచ్చునని లాక్షణికుల అభిప్రాయము. తెలుగు దండకాలు చాలవరకు 'త' గణముతోనే ప్రారంభింప బడినవి. న గణముతో నడచిన దండకాలు కూడ ఉన్నవి. రెడ్డిగారు 'ర' గణముతో దండకం ప్రారంభించారు. న గణాలతో దండకం అల్లండి కాని 'ర'గణంతో వద్దని అప్పకవి శాసనము. సంస్కృత వాఙ్మయమున 'ర' గణపు దండకాలు ఉన్నాయో లేవో తెలియదు.

ఏది ఎలాఉన్నా ఇది తెలుగు సాహిత్యంలో కొత్త ప్రయోగమనక తప్పదు. కొత్తబాటలు తొక్కుటయందును, నూత్నప్రయోగాలు చేయుట లోను రెడ్డిగారికి అభిరుచి కలదు. ప్రజ్ఞాధురీణులైన రెడ్డిగారిని మహాకవి గణములో చేర్చుట భావ్యం కాదు కాని మధ్యతరగతి కవిపుంగవులలో వారికి సముచితస్థానం లభించగలదు.

ఇందు గలడందు లేడను సందేహము సాహితీ వేత్తలకు కలుగకుండా రెడ్డిగారు తమ కలాన్ని అన్ని సాహితీక్షేత్రాలలో నడిపి సవ్యసాచి యని పించుకున్నారు.

## 6. ఇతరములు

లోగడ చర్చింపబడిన గ్రంథముల ననుసరించి రెడ్డిగారిని పరిశోధ కుడుగా, విమర్శకుడుగా, సంఘ సంస్కర్తగా, నాటక రచయితగా, కవిగా,

కథానికా రచయితగా నిర్ణయించుటకు ఆస్కారము కలిగినది. పై నుదాహృత గ్రంథములే కాకుండా రెడ్డిగారు ఇంకా కొన్ని రచనలు చేసినారు. వాటి నన్ని టినీ విపులంగా చర్చించుటకు వీలులేదు. ఏలయన మిగతా రచనలన్నీ దేశ కాల పాత్రానుగుణముగా వ్రాయబడినవే కాని పదికాలములపాటు పనికి వచ్చు ఉద్దేశముతో వ్రాయబడలేదు. అందుకే వాటిని విమర్శనాత్మక దృక్ప థంతో విలోకించి విమర్శింప పనిలేదు.

ప్రస్తుత భాగంలో మొదట పేర్కొనదగినది రాజాబహద్దర్ వెంకట రామారెడ్డిగారి జీవిత చరిత్ర. రాజా బహద్దర్‌గారి జీవిత చరిత్ర నాటి హైద్రాబాదు రాష్ట్రపాలనా సరళికి దర్పణము, నవాబులపాలన నెత్తిచూపు దీపిక; వెంకట రామారెడ్డిగారి నిరాడంబర, నిస్స్వార్థసేవల నుగ్గడించు మణి దీపిక. ఇంత చక్కని చిక్కని జీవితచరిత్ర నాటి హైద్రాబాదు ప్రముఖు లలో ఎవ్వరిదీ వెలువడలేదు. వైయక్తిక జీవన దృక్పథంతో కాకపోయినా, సాంఘిక దృష్టితో తిలకించినా, రాజా బహద్దర్‌వారి చరిత్ర ప్రశంసార్హ మగు గ్రంథరాజము. పది కాలములు ఉండదగిన పుస్తకము.

ఇకపోతె మిగతా గ్రంథాలలో "మద్యపానము" "గ్రామజన దర్ప ణము" "గ్రంథాల యోద్యమము" "ఎల్లోరా అజంతా గుహలు" "పూనా వ్యవసాయ ప్రదర్శనము"మొదలగునవి ఆయా సమయ సందర్భములను పురస్కరించుకొని వ్రాయబడిన గ్రంథములు. వానికి సార్వకాలిక ప్రయో జనము అంతగా లేదనవచ్చు. "కర్నూలు రాజుల వంశావళి" మరియు "నిజాం రాష్ట్ర పాలనము"లాంటి గ్రంథాలకు కొంత చారిత్రక ప్రాధాన్యము ఉంటె ఉండవచ్చు. ఉంటె ఉండవచ్చునని ఎందుకన్నా నంటె అంతకంటె ఉత్కృష్టమైన గ్రంథాలు ఉర్దూ మరియు ఆంగ్ల భాషలందు కలవు. రెడ్డిగారీ రెండు గ్రంథాలను చారిత్రక దృష్టితోనే వ్రాయలేదు. "మొగలాయికథలు" అను పుస్తకముకూడ ఇట్టి ఉద్దేశంతోనే వ్రాయబడింది. కనుక వాటిని చారిత్రక గ్రంథాల జాబితాలో చేర్చడం భావ్యంకాదు.

రెడ్డిగారు నవలా కారుడుగా పాఠకలోకాన్ని ఆకర్షించలేక పోవడానికి ముఖ్యకారణము వారు రచించిన రెండు నవలలూ పుస్తకరూపాన్ని ధరించకపోవడంవల్ల నేమో! ఒకవేళ అవి ముద్రింప బడిననూ రెడ్డిగారికి నవలా రచయితగా ఆశించినంత అంటె వారి పేరుకు తగ్గ ప్రఖ్యాతి కలిగియుండెడిదా యను అనుమానము కూడ రాకపోదు. రెడ్డిగారి నవలలో ఒకటి ''శుద్ధాంత కాంత" రెండవది ''ఆరె వీరులు".

శుద్ధాంత కాంత యను నవలను ''The mysteries of Hyderabad'' అను గ్రంథములో భాగమైన ''Romance of Zenana'' అను అంశాన్ని ఇతివృత్తంగా స్వీకరించి నవలగా రచింపబడినది. ఈ నవల 1917 సం॥లోనే పూర్తిచేయబడింది. అంటె రెడ్డిగారు ఇంటర్ మీడియట్ ఉత్తీర్ణుడైన కాలంలో రచించబడింది. ఇక రెండవ నవల ''ఆరె వీరులు"అను దానిని 1932 సం॥లో రచించారు. ఇది చారిత్రకమూ కాదు, కాకనూపోదు. చారిత్రకము కాదనుటకు కారణమేమనిన దీనిలోని ఇతివృత్తము చరిత్రపుటల నలంకరించనంత చిన్న సంస్థానాధీశుని వంశచరిత్ర. చారిత్రకమే యనుట కింద చారిత్రక ప్రాధాన్యముగల అంశములేవీ ప్రస్తావింప బడలేదు.

ఇతివృత్తము ననుసరించి ఒక పాలెగానికి ముగ్గురు తనయులూ రెండు కోటలు ఉంటవి. తండ్రి పెద్దవాడు కావడంచేత పెద్దకుమారుడు సంస్థాన బాధ్యతలను స్వీకరించి పాలిస్తుంటాడు. అట్టి తరుణంలో బందిపోటు దొంగలు ఒకచోట దారికాచి సంస్థానంబాపతు భూమిశిస్తు ధనాన్ని దోచుకుంటారు ఆ విషయాన్ని తెలుసుకున్న తమ్ములిద్దరూ అవకాశం దొరికినదని తలంచి తండ్రిగారికి అన్నగారి పాలనయొక్క లోపాలను బయటపెట్టి తమ దాయభాగాన్ని పంచి ఇమ్మని బలవంతంచేస్తారు. తండ్రి చేయునదిలేక ఒకకోట నిచ్చి ఏలుకొండని వారిని సాగనంపుతాడు. ఈలోగా తండ్రి అనంతరం, కొంత కాలానికే పెద్దకుమారుడు కాలంచేస్తారు. ఇక ఆ కోటకు చిన్నవాడగు వారసుడు మిగిలిపోతాడు. సమయంకోసం నిరీక్షిస్తున్న తమ్ములిద్దరూ అన్నగారి మరణానంతరం దండయాత్రచేసి సంస్థానాన్ని కొల్లగొట్టి చిరుతవాడిని

రాజ్యభ్రష్టుడిని చేసిపోతారు. ఆ యువరాజు విధిలేక తన సంస్థానాన్ని, కోటను వదలిపెట్టి ఒక గొల్లపల్లెలో కాపురంపెట్టి కొంతకాలానికి తన తాత గారు గుప్తంగా దాచిపెట్టిన ధనాన్ని కోట శిధిలాలనుండి త్రవ్వి తెచ్చుకొని మరొక కోట తను కాపురం ఉన్నచోట నిర్మించుకొని, చిన్నాయినలపై దండ యాత్రచేసి వారిని అనిలో మడియించి పూర్వ ఔన్నత్యంతో తన సంస్థా నాన్ని పాలిస్తూ ప్రజారంజకుడై పది కాలాలు ఉంటాడు. ఇదీ ఇతివృత్తము.

రెడ్డిగారు ఈ నవలా రచనా సంవిధానంలో కథా కథనచమత్కారం గాని, పాత్ర పోషణౌన్నత్యముగాని, ఇతి వృత్త ప్రాముఖ్యముగాని, వర్ణనా విభవంగాని, సన్నివేశ సౌకుమార్యముగాని పాఠకుని ఆకట్టుకొన లేక పోతున్నవి.

వీరి రెండవ నవల "శుద్ధాంతకాంత" యొక్క ఇతివృత్తము, నిజాము నవాబుల రాజ్యరమావిభవం దశదిశలా జాజ్వల్యమానంగా వెలిగిపోతున్న ప్పుడు, ఆయా నవాబుల పెండ్లిచేసుకున్న, నికా కట్టుకున్న, ఉంచుకున్న, కన్నువేసి చెరబట్టిన, కానుకలుగా స్వీకరించిన శతాధిక సౌధాంత రమణీ మణుల లేక బేగంసాహిబాల రాగరంజితమగు నీలిచరిత్ర; లోకమెరుగని రమణీయ రసికచరిత్ర. రెడ్డిగారు నూనూగు మీసాల నూత్న యౌవన వసంతంలో కాలూనినపుడు "శుద్ధాంత కాంత" వారి కలంనుండి అలవోకగా జారిపడింది.

ఇందులో ఇతివృత్తముయొక్క ఔచిత్యమునుగూర్చి వేరుగా చెప్ప పనిలేదు. నవలయొక్క పాత్రల రాగరంజిత రసిక కలాపాల రామణీయకపు టుచితానుచితజ్ఞతలను పనిగట్టుకొని ప్రస్తావించ నవసరంలేదు; కథా కథన సంవిధాన చమత్కృతి నుగ్గడించ మాటలు చాలవు. నవల పాఠకుల కందించు సందేశముయొక్క ప్రాశస్త్యమును గూర్చి రసిక హృదయులకు పనిగట్టుకు పెంచి వ్రాయనవసరం అంతకన్నా లేదు. ఆదిలో ఇదివరకే ప్రస్తావించ బడినట్లు ఈ రెండునవలలు ప్రచురింపబడక పోవడంవలన ప్రతాపరెడ్డిగారి కీర్తిప్రతిష్ఠలకేమీ అవజ్ఞ చేకూరదు.

ఇవిగాక ఒక సాంఘిక నాటకాన్ని కూడ రెడ్డిగారు నలుబది పేజీల వరకు వ్రాసి అసంపూర్తిగా వదలివేసినారు. ఈ నాటకానికి నామకరణం కూడ చేయకుండా వదలివేసినారు. ఈ నాటకంయొక్క ఇతివృత్తము ఒక ప్రేమికుల జంటయొక్క ప్రేమగాథ. మరియు వారు తమ ప్రేమ సాఫల్యముకొరకు పడినపాట్లు, తుదకు వారు సాఫల్యము పొందినతీరు అభివర్ణితములై యుండ నోపు. ఒక మధ్యతరగతి కుటుంబీకుల కూతురు ఒక బీద యువకుడు పట్టభద్రుడైన వానిని ప్రేమిస్తుంది. తలిదండ్రులా అమ్మాయి ప్రేమకలాపానికి అడ్డుతగులుతారు. అయినా ఆవిడ చాటుమాటుగా వారింట్లోఉన్న దాసిదాని సహాయంతో ఉత్తరప్రత్యుత్తరాలు సాగిస్తూ తన ప్రణయాన్ని కొనసాగిస్తుంది ఆ అమ్మాయి తండ్రి ఒక లక్షాధికారి కుమారుడితో మనువు నిశ్చయం చేస్తాడు తన కూతురుకు కూడ ఆ విషయం తెలియజేస్తాడు. అయినా ఆమె అందుకు అంగీకరించదు. ఇక వారి ఇడుములు ప్రారంభమవుతాయి. ఇంత వరకు జరిగిన నాటకరచన రెండవరంగంతో నిలిచిపోయింది. నాటకం పూర్తి అయితె ఎలా ఉండెడిదో గాని మొదటి రెండు రంగములేమంత ఆసక్తిదాయకంగా లేవు.

ఇక మూడవ అముద్రిత రచనయగు "కాపులెవరు?" అనునది ప్రశంసనీయంగా ఉన్నట్లు లోగడనే తెలుపబడింది. ఇదొక్కటే రెడ్డిగారు మరొకరితో పూర్తిచేసిన గ్రంథము. త్వరలో ముద్రింపబడవలసిన పుస్తకము కూడ ఇదియే!

# 16

# ముగింపు

శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారి జీవితమును, రచనలను అవలోడన చేసిన పాఠకులకు వారి వ్యక్తిత్వాన్ని వైయక్తిక శీలాన్ని, గుణవిశేషములను నిర్ధారించుట ఏమంత కష్టమైన విషయం కాదు. రెడ్డిగారిది పవిత్రమైన సంస్కృతమైన జీవితము, ఆడంబరాలు, భేషజాలులేని నిరాడంబర జీవితము. తన జీవిత సర్వస్వాన్ని సాహిత్య సేవకు, ప్రజాసేవకు అంకితం చేసిన ఉత్తమ దేశికుడు. అరువై సంవత్సరాలు నిండీ నిండని జీవితంలో అణుమాత్రమైనా తన స్వార్థ ప్రయోజనానికిగాని, కుటుంబ శ్రేయోభివృద్ధికిగాని వినియోగించుకొనక త్రికరణశుద్ధిగా తనను దేశాభ్యుదయ కార్యక్రమాలకు అంకితం చేసుకుని కీర్తికాయుడైన ఉత్తమ వైతాళికుడు.

వారి రచనలను ఆమూలాగ్రంగా పరిశీలించిన వారికెవరికైనా రెడ్డిగారి దేశభక్తి, ఆంధ్ర దేశాభిమానము, సారస్వతానురక్తి. జాతీయతా భావాలు అభివ్యక్తం కాకపోవు. పాతిక సంవత్సరాలు "గోలకొండ పత్రిక" సంపాదకత్వమును నెరపి ఎదుగుబొదుగులేని గొర్రెతోకలాంటి వేతనంతో ఎలా తృప్తి చెందగలిగారన్న విషయం ఇంగితజ్ఞులను విస్మయ చకితులను చేస్తుంది. డా॥ బి. రామరాజు గారన్నట్లు వారు స్వీకరించినది అతి స్వల్పము, అర్పించినది అనల్పము. అట్టి పవిత్రమూర్తిని, ఉత్తమ వైతాళికుని, అకలంక దేశభక్తుని, మహాపరిశోధకాగ్రేసరుని సంస్మరించుకొనుట ఆంధ్రుల ప్రథమ కర్తవ్యము.

త్రిలింగ దేశంలో ప్రకాశంలాంటి దేశభక్తులు, వీరేశలింగంలాంటి సంఘసంస్కర్తలు, నార్ల వెంకటేశ్వరరావులాంటి సంపాదకులు, ఋలుసు సాంబమూర్తిలాంటి మానవతావాదులు ; గురజాడవంటి సాహితీవేత్త లుద్భ

వించారు. కాని అన్నీ ఒకటిగా రూపొందినవారు ఆంధ్రులకు ఆదర్శమూర్తులే! పై నుదాహృత మహానుభావుల సుగుణరాశినంతా పుణికిపుచ్చుకున్న ఘనుడు శ్రీ సురవరం ప్రతాపరెడ్డి. అట్టి బహుముఖ ప్రజ్ఞాశాలిని సముచిత రీతిన సంస్మరించుకొనుట మన కర్తవ్యము. రెడ్డిగారి పేర ఉస్మానియా విశ్వ కళా పరిషత్తులో నొక యుపకారవేతనము నెలకొల్పబడుట ఎంతేనియు అవసరము.

రెడ్డిగారికి పరిశోధన యనిన ప్రాణసమానము. డా॥ రామరాజుగారి అభిమతానుసారం వారి రచనయగు "హైందవ ధర్మవీరులు' అను పొత్త మును ఉన్నత పాఠశాలలకో, ఇంటర్ మీడియట్ విద్యార్థులకో రెండు మూడు సంవత్సరములపాటు పాఠ్యగ్రంథముగా నిర్ణయించినయెడల కొంత మూలధనము చేకూరును. దానిపై వచ్చు వడ్డిద్వారా ఏటా ఒకరిద్దరు భాషా సాహిత్యములయందు పరిశోధనాసక్తిగల తెలుగు విద్యార్థులకు ఉపకార వేతన మిచ్చినయెడల రెడ్డిగారికీ, అంధ్ర సాహిత్యమునకూ మేలుచేసిన వార మగుదుము. అందుకు పెద్దలు, విజ్ఞులు సముచిత నిర్ణయము గైకొనవలసి యున్నది.

ఇక పోతె రెడ్డిగారి గ్రంథాలయ మొక అపురూపమగు విజ్ఞాన భాండాగారము. అందు ఎన్నియో అన్యథా ఉపలబ్ధములు కాని సంస్కృ తాంధ్ర గ్రంథరాజములున్నవి. వాటిని సేకరించి సాహిత్యసంస్థలు, భాషా సేవకులు ప్రకటించినచో భాషాసేవయు, దేశసేవయు చేసినవారగుదురు. రెడ్డిగారు కొన్ని అమూల్యములగు ఆంగ్ల గ్రంథములను అనువాదము చేస్తూ అసమగ్రముగా విడిచివెళ్ళినారు. వాని యందభినివేశము కలవారు ఆయా గ్రంథానువాదములను పూర్తిచేసినచో ఉభయతారకంగా ఉంటుంది. రెడ్డి గారు ఎన్నోవిషయాలపై తమ పరిశోధనా పాటవమును ప్రసరించి అసం పూర్ణములుగా నిలిపి ఉంచారు. పరిశోధనయందు ఆసక్తి, అభినివేశము కల వారు, వారి గ్రంథాలయంలో సంగుప్తమైన విషయాలను త్రవ్వి వెలికితీసి లోకానికందజేసిన యెడల రెడ్డిగారి ఆశయము నెరవేర్చిన వారలగుదురు. రెడ్డిగారు సేకరించి పెట్టుకున్న 'నిఘంటువున కెక్కని" పదజాలము

